అపరాధ పరిశోధన అనుబంధం—23

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## నలుగురు దొంగలు!
రచన: 'రాజా'

## ఆఖరి క్షణం
రచన: టెంపోరావ్

## దొంగ సొమ్ము
రచన: సుజనశ్రీ

## గుర్రాల దొంగలు!!
రచన: ఏ. వీ. మోహన్రావ్

"ఖైదీ" సీరియల్ - 18 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —23

నవంబర్, 1975

వెల : 3-00 రూపాయలు

ఏడాది చందా 39 రూపాయలు

ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :

శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :

టెంపోరావ్

శ్యాంబాబు

రమణశ్రీ

ఏ. వీ. మోహన్రావ్

సుజనశ్రీ

వసుంధర

కంచర్ల రమణ

కార్యాలయం :

అపరాధ పరిశోధన కార్యాలయం

నారాయణగూడ, హైదరాబాదు-29

ఫోన్-36959

ముద్రణ : క్రాంతి ప్రెస్, మద్రాసు-1

గెడా రంగారావు

# నలుగురు దొంగలు

## రాజా

సాయంత్రం ఆరయింది.

లండన్ 'హీత్రో' విమానాశ్రయానికి మైలు దూరంలో వున్న హోటల్ 'బ్లాక్ నైట్'లో నియాన్ లైట్స్ వెలిగాయి. పదహారంతస్తుల హోటల్ 'బ్లాక్ నైట్' మహా కోలాహలంగా వుంది.

చివరి అంతస్తులో వున్న రూఫ్ గార్డెన్‌లో వక మూలగా కూర్చొన్న ఎడ్వర్డ్ విసుగ్గా మరోసారి వాచీ చూసుకున్నాడు. క్షణాలు యుగాలుగా గడుస్తున్నట్లనిపిస్తోంది అతనికి.

వెయిటర్ తెచ్చిన షాంపెన్ బాటిల్ ఓపెన్ చేసి గ్లాస్‌లో పోశాడు. ఐస్ క్యూబ్స్ కలిపి నెమ్మదిగా సిప్

చేయడం మొదలు పెట్టాడు. లోనికి వెళ్తోన్న షాంపేన్ పని చేస్తోంది. గాజు ప్లేటులోని చిప్స్ క్యాజూనట్స్ పళ్ళ క్రింద నలుగుతున్నాయ్.

పావుగంట గడిచింది. కుర్చీలో చిరాకుగా ప్రక్కకి కదిలాడు ఎడ్వర్డ్. ఆరుగంటలకల్లా రావలసిన ఫ్రండ్స్ ఆరుంపావైనా రాకపోవడంతో ఒళ్ళు మండుతోంది.

తలపైనుంచి ఏదో ప్లేన్ 'హీత్రో' విమానాశ్రయం వైపు దూసుకుపోయింది పెద్దగా శబ్దం చేస్తూ. మిల్కా ఖాన్ నవ్వుతూ అతని ముందుకొచ్చి కూర్చున్నాడు. ఎడ్వర్డ్ ముఖం వికసించింది.

"హౌ ఆర్ యూ ఖాన్?" అడిగాడు ఆప్యాయంగా కరచాలనం చేస్తూ.

"ఫైన్! ఏమిటి విషయం, వున్నపళంగా రమ్మని కేబుల్ ఇచ్చావు?" అడిగాడు మిల్కాఖాన్ సిగరెట్ వెలిగిస్తూ.

"కంగారేం? మనవాళ్ళింకా ఇద్దరు రావాలి. అందరూ వచ్చాక చెప్తాను..." అంటూ మరో గ్లాసులో షాంపేన్ పోసి ఖాన్‌కు అందించాడు.

"థాంక్యూ!" అందుకొన్నాడు.

సిప్ చేస్తున్న ఖాన్ ముఖంలోకి చూస్తూ పైప్ వెలిగించాడు ఎడ్వర్డ్.

ఆరడుగుల రెండంగుళాల పొడ వుంటాడు మిల్కాఖాన్. కండలు తిరిగిన శరీరం, చిన్న తల చూడగానే పహిల్వాన్ అనిపిస్తాడు. ఇండియాలో స్మగ్లర్ అండ్ కిల్లర్స్ బ్రిగేడ్‌గా పోలీస్ రికార్డుల్లో గుర్తించబడినవాడు ఖాన్.

గ్లాసులో మిగిలిన ఆఖరి గుక్క నోట్లో పోసుకొని మూతి తుడుచుకొన్నాడు.

"రావలసిన మిగిలిన ఇద్దరు ఎవరు?" అడిగాడు ఖాన్ వే వైపు చూస్తూ.

"చూస్తావుగా తొందరెందుకు?"

విసుగ్గా చూసాడు మిల్కా-ఖాన్. "పోని ఒక్క విషయం చెప్పు ఎక్కడికైనా ప్రయాణమా?"

తీక్షణంగా ఖాన్ వైపు చూశాడు ఎడ్వర్డ్. "యస్. ఈజిప్టుకు" అతనా మాట అంటుంటే కళ్ళు మెరవటం గమనించాడు మిల్కా-ఖాన్.

"ఈజిప్టు... ఈజిప్టు..." గొణుక్కున్నాడు.

టెక్సాస్ నుంచి హెర్క్యులెస్, అరిజోనా నుంచి శాంసన్ వచ్చేసరికి ఏడు గంటలైంది.

వారిద్దరినీ మిల్కా-ఖాన్‌కు పరిచయం చేసాడు ఎడ్వర్డు.

"హీ ఈజ్ మిస్టర్ శాంసన్...అరిజోనా పోలీస్ దృష్టిలో డెవిల్స్ కింగ్. హత్యలు చెయ్యటం ఇతనికి మంచినీళ్ళప్రాయం. దొంగతనమే అతని వృత్తి. డాలర్ కోసం పదిమందినయినా చిటికెలో చంపుతాడు. భయమంటే ఏమిటో ఎరుగడు...."

అతని ముఖంలోకి పరిశీలనగా చూశాడు ఖాన్.

సన్నగా పొడుగ్గా వున్నాడు. అతని ముఖంలోని క్రూరత్వానికి వళ్ళు జలదరించింది. అతనికి శాంసన్ అని పేరెవరు పెట్టారో గాని ఆ పేరుకు చాలా అన్యాయం చేసారనిపించింది.

"పోతే ఇతను హెర్క్యులిస్. పేరుకు తగ్గట్టే సింహబలుడు. ఏపనైనా చేసుకుపోవడమేగాని వెనక్కి తగ్గటం అనేది ఇతని జీవితంలో లేదు. ఒట్టి చేతులతోనే ఏనుగులాంటి మనిషిని రెండుగా విరిచేయగలడు. ఇతనంటే దక్షిణ అమెరికాలోని ప్రతి పోలీస్‌కు హడల్."

"గ్లాడ్ టు మీట్ యూ" ఇద్దరకూ చెరో చేయి అందిస్తూ అన్నాడు ఖాన్.

"సేమ్ టు విష్ యు" ముక్తకంఠంతో అంటూ చేతులు చిన్నగా నొక్కారిద్దరూ. ఆ క్షణంలోనే ఇద్దరకూ మధ్య తేడా అర్థమైంది ఖాన్‌కు.

ఎడ్వర్డుతో కలిసి ఖాన్, శాంసన్, హెర్క్యులిస్ విడివిడిగా అనేక దోపిడీలలో, దొంగతనాలలో పని చేశారు. కాని నలుగురు కల్సుకోవటం ఇదే మొదటిసారి.

నలుగురి గ్లాసుల్లోని షాంపెన్ ఖాళీ అయింది. "యస్ మిస్టర్ ఎడ్వర్డ్! మనం అసలు విషయాని కొద్దామా?" అడిగాడు శాంసన్.

"తప్పకుండా. కాని ఇక్కడ కాదు, నా రూంకెళ్ళి మాట్లాడుకుందాం" లేచాడు ఎడ్వర్డు.

నలుగురూ లిఫ్టు వైపు నడిచారు.

తన గదిలోకి చేరగానే కుర్చీలో కూర్చుంటూ అడిగాడు ఎడ్వర్డ్. "పారహ్ వంశపు రాజుల గురించి మీకు తెలుసనుకొంటాను."

"రెండు వేల ఏళ్ళ క్రితం ఈజిప్టును పరిపాలించిన రాజులు కదూ?" అడిగాడు శాంసన్.

"అవును. వాళ్ళే. ఇప్పటికీ వాళ్ళ శవాలు దాయబడిన పిరమిడ్‌ల కోసం పురాతన తత్వవేత్తలు వెతుకుతున్నారు. కాని ఏవో చరిత్ర హీనులైన చోటా రాజుల పిరమిడ్‌లు కనిపెట్టగలిగారేగాని పారహ్ రాజుల పిరమిడ్‌లు మాత్రం ఎక్కడున్నాయో ఇప్పటివరకూ తెలుసుకోలేకపోయారు" అగాడు ఎడ్వర్డ్.

విసుగ్గా చూశాడు హెర్క్యులిస్. "ఎందుకిదంతా చెబుతున్నావో నా కర్థం కావటం లేదు" అన్నాడు.

చిన్నగా నవ్వాడు ఎడ్వర్డు. వెలిగించిన పైప్ నోట్లో పెట్టుకొని చెప్పసాగాడు:

"ఈనాటివరకూ ఏ చరిత్రకారుడూ తెలుసుకోలేక పోయిన పారహ్ వంశపు రాజులలో రెండవ పారహ్ పిరమిడ్‌ను నేను కనుక్కొన్నాను. అంతేకాదు. ఆ పిరమిడ్‌లోకి వెళ్లే రహస్య దారిని కూడా తెలుసుకున్నాను."

"నీ ఉద్దేశ మేమిటో నా కర్థం కావటం లేదు. ఈ విషయం మాకంటే ఏ పురాతన శాస్త్రజ్ఞుడికో చెబితే నీ కఖండ పేరు ప్రఖ్యాతు లొచ్చేవి." మధ్యలో అడ్డొస్తూ చిరాకుగా అన్నాడు ఖాన్.

"పొరపాటు పడుతున్నావ్ ఖాన్. పిరమిడ్ గురించి నీకేమాత్రం తెలిసినా ఇలా మాట్లాడవు. అందులో రెండవ పారహ్ పిరమిడ్ అంటే మాటలు కాదు. ఈజిప్టును కొనేసేంతటి సంపద ఉంటుందందులో."

ఉలిక్కిపడ్డారు ముగ్గురూ.

"పిరమిడ్‌లో సంపదా? అసలందులోకి అంత సంపద ఎలా వెళ్ళింది?" ఆతృతగా అడిగాడు హెర్క్యూలిస్.

"ఆ విషయం చెప్పాలంటే పారహ్ రాజుల చరిత్ర నుంచి పిరమిడ్ చరిత్ర దాకా చెప్పాలి" అంటూ కళ్ళు మూసుకున్నాడు ఎడ్వర్డు పైప్ పీలుస్తూ.

మిగిలిన ముగ్గురూ అతని ముఖంలోనికి చూస్తూ కూర్చున్నారు వినటానికి ఉద్యుక్తులౌతూ.

ఎడ్వర్డు కంఠం గంభీరంగా మ్రోగింది.

## 2

"పారహ్ వంశపు రాజులలో ప్రసిద్ధి చెందినవాడు రెండవ పారహ్. దానికి కారణం అతనికి బంగారపు పిచ్చి ఎక్కువగా వుండటం. ఆ బంగారపు పచ్చదనం, ఎంతో

విలువైన ఆ బంగారపు మెరుపు చూసి మైమర్చిపోయే వాడు అతను.

అందుకే ఎక్కడలేని బంగారాన్నంతా తన ఖజానాలో నింపసాగాడు. ఫలితంగా దేశంలోని ప్రజలలో అలజడి రేగింది. పారహ్ సైనికులు ప్రజలపైబడి బంగారాన్నంతా వసూలుచేసి తీసుకుపోయేవారు.

దేశంలో ఎవరైనా బంగారం దాచుకొంటే వారిని కఠినంగా శిక్షిస్తానని ప్రకటించాడు రెండవ పారహ్. దాంతో ప్రజలు భయపడి తమ దగ్గరున్న బంగారాన్నంతా రాజు పరం చేసారు. ఎవరో కొందరు మాత్రం బంగారాన్ని వదలలేక దాచుకొని ఇంట్లోనే ధరించి తృప్తి పడేవారు.

కాని రెండవ పారహ్ వక పని చేసాడు. తనకు బంగారాన్ని అర్పించిన ప్రజలకు దాని విలువకు సమానమైన వెండి, రాగిని పంచిపెట్టాడు. దానితో రెండవ పారహ్ కోటంతా బంగారంతో నిండిపోయింది. ఆయన వంటి మీద దుస్తులు ధరించటం మానేసి బంగారాన్ని ధరించటం ప్రారంభించాడు. ఆయన తల దువ్వుకొనే దువ్వెన దగ్గరనుండి గడ్డం గీసుకొనే మంగలి కత్తివరకూ ప్రతిదీ బంగారంతో చేయబడే ఉండేది.

ఆఖరికి ఆయన బంగారపు పిచ్చి ఎంతవరకూ ముదిరిందంటే బంగారం పొరలు పొరలుగా తీసి తను తినే ఆహారంలో కలిపి తినేవాడు. ఆనాటినుంచి బంగారాన్ని ఆహారంతో కలిపి తీసుకోవటం ప్రారంభమైంది. ఆ బంగారంలాగే తన శరీరం కూడా బంగారపు రంగుతో మెరిసిపోవాలని కోరుకొనేవాడు. అతను కోరుకొన్నట్లే విచిత్రంగా అతను బంగారపు రంగులోనికి మారాడు.

గోధుమ రంగుతో తళతళలాడే అతని శరీరం బంగారపు రంగులోకి తిరిగింది.

అయినా అతని బంగారపు వ్యామోహం తగ్గలేదు సరికదా మరింత పెచ్చింది. ప్రత్యేకంగా పనివాళ్ళను నియమించి దేశం నలుమూలలా బంగారపు ఖనిజం కోసం త్రవ్వకాలు సాగించాడు. ఆ కాలంలో ఈజిప్టులో బంగారము పండుతున్నట్లు ఎక్కడ చూసినా బంగారపు గనులుండేవి. దాంతో మరింత ధనికుడైపోయాడు పారహ్. దాదాపు ఆఫ్రికా ఖండాన్ని కొనేసేటంతటి బంగారాన్ని కూడబెట్టగలిగాడు.

ఇదిలా ఉండగా అతని భార్య మహారాణి యవ్వనంలోకి అడుగు పెట్టేటప్పటికి పారహ్ వయస్సు యాభై దాటి పోయింది. వాళ్ళ వివాహానికి మహారాణి వయస్సు నాలుగేళ్లు. పారహ్ వయస్సు ముప్పై ఐదు. దానికి తగిన కారణముంది. వంశాచారాల ప్రకారం పారహ్ వంశపు స్త్రీల రక్తం ఇతరుల రక్తంతో కలియకూడదు. అంటే వాళ్లు తమకు తోడబుట్టిన అన్ననో తమ్ముడినో తప్ప బయటవాళ్ళను వివాహమాడకూడదు. అలాగే జరిగింది పారహ్ వివాహం కూడా.

పోతే బంగారం పిచ్చి నానాటికీ ముదిరిన రెండవ పారహ్ భార్య సంగతి చూసేవాడు కాదు. తను మరణించిన తదనంతరం ఈ బంగారమంతా పరులపాలై పోతుందన్న భయంతో ఎలాగైనా ఆ బంగారాన్ని ఎవరికీ దక్కనివ్వకూడదనుకొంటూ తన మంత్రిని, ఆస్థాన శిల్పాచార్యుడ్ని పిలిచి సలహా అడిగాడు. ఫలితంగా చరిత్రలో మొట్ట మొదటి పిరమిడ్‌కు అంకురార్పణ జరిగింది.

ఆ పిరమిడ్‌లో ఎన్నో గదులు తయారు చేయబడ్డాయి. తన మరణానంతరం తన శవంతోబాటు మంత్రిని, శిల్పాచార్యుడ్ని పిరమిడ్‌లో ఉండిపోవాలని ఆజ్ఞాపించాడు పారహ్. రాజభక్తుడైన మంత్రి, గత్యంతరంలేని శిల్పి అందుకు అంగీకరించారు. కొన్ని కోట్ల రూపాయల ఖర్చుతో పిరమిడ్ ఎంతో సుందరంగా తయారైంది. తన ఆజ్ఞ ననుసరించి తనతో శాశ్వత సమాధిలోకి వస్తున్నందువల్ల కృతజ్ఞతతో పారహ్ తన తదనంతరం రాజుగా శిల్పాచార్యుడి కొడుకును ప్రకటించాడు.

ఎంతో సుందరంగా వున్న ఆ పిరమిడ్‌ను చూస్తూ తను తొందరగా చచ్చిపోవాలని కోరుకునేవాడు పారహ్.

ఈలోగా అంతఃపురంలో వున్న మహారాణి తనకు కాపలాగా పారహ్ నియమించిన ఒక బానిసవాడిని తన అందంతో రెచ్చగొట్టి లొంగదీసుకొంది. అనుకోకుండా వకసారి అటువైపు వచ్చిన పారహ్ బానిసతో కలిసి వున్న భార్యను చూసి స్తంభించిపోయాడు.

మరుక్షణం కత్తిదూసి వాడిపై విజృంభించాడు. మహారాణి చూపిన ఆశలకు లొంగిపోయిన బానిస కూడా పారహ్‌పై తిరగబడ్డాడు. చావు బ్రతుకుల మధ్య సాగిన ఆ పోరాటంలో ఇద్దరూ మరణించారు. సరిగ్గా అదే సమయానికి అక్కడికి వచ్చిన మంత్రి సంగతంతా గ్రహించాడు. అసహ్యంతో మహారాణిని కూడా ఎలాగైనా తమతో కలిపి సమాధి చేయాలనే నిశ్చయాని కొచ్చాడు.

బ్రహ్మాండమైన వూరేగింపుతో పారహ్ శవం పిరమిడ్‌ను చేరుకొంది. మంత్రి శిల్పాచార్యుడితోసహా కలిసి

విచారం నటిస్తోన్న మహారాణి కూడా పరివారం వెంట పిరమిడ్ లోకి ప్రవేశించింది.

మహారాజు శవాన్ని 'టోంబ్'లో ఉంచగానే క్రిందకి దిగసాగింది. బంగారం, వజ్రాలు, వైడూర్యాలు వున్న గదుల తలుపులు పెద్ద శబ్దంతో మూసుకుపోయాయి. ప్రవేశద్వారం నెమ్మదిగా మూతబడసాగింది.

జరిగిన మోసాన్ని గ్రహించిన మహారాణి కంగారుగా బైటకు పరుగెత్తబోయింది. మంత్రి వెంటనే ఆమెను కదలకుండా బంధించాడు. చూస్తుండగానే భయంకర మైన శబ్దంతో పిరమిడ్ మూసుకుపోయింది. అంతా జీవ సమాధి ఐపోయారు.

అదే మొట్ట మొదటి పిరమిడ్ చరిత్ర. అప్పటినుంచే ఈజిప్టులో ప్రఖ్యాతి చెందిన రాజుల పిరమిడ్లు ఏర్ప డ్డాయి."

ఆగాడు ఎడ్వర్డు. గట్టిగా నిట్టూర్చారు ముగ్గురూ. తిరిగి ప్రారంభించాడు ఎడ్వర్డు.

కాని ప్రపంచంలో ఎవరికీ తెలియని ఒక రహస్యం ఆ పిరమిడ్ లో ఇమిడి వుంది. పారహ్ ఆజ్ఞ ప్రకారం శిల్పా చార్యుడు సమాధికావటానికి గత్యంతరంలేక అంగీకరిం చినా ప్రాణాలపై తీపి వదులుకోలేకపోయాడు. అందుకే ఎవరికీ తెలియకుండా ఆ పిరమిడ్ నుంచి బయటకు వక రహస్యద్వారం అమర్చాడు. ఆ రహస్య ద్వారానికి అను కొని ఉన్న సారంగం పిరమిడ్ కు నాలుగు మైళ్ళదూరంలో ఉన్న 'యిజారా' కొండల్లో బయటపడుతోంది.

పదిహేను రోజులపాటు సమాధిలో ఉన్న తర్వాత ప్రాణభయంతో అల్లాడిపోతున్న మహారాణితో కలిసి ఎవరికీ తెలియకుండా ఆ రహస్య ద్వారంలోంచి పారి

పోయాడు శిల్పాచార్యుడు. ఆసరికే అతని కొడుకు ఈజిప్టు రాజయ్యాడు. మిగిలిన జీవితమంతా మహారాణితో కలిసి అంతఃపురంలో రహస్యంగా గడిపేశాడు శిల్పాచార్యుడు.

ఈ విషయం ప్రపంచంలో మొదటగా తెలుసుకొన్న వ్యక్తిని నేనే. పురాతన ఈజిప్షియన్ శిధిలాల కోసం 'ఇస్తమ్' పొలిమేరలలో వెదుకుతున్న నాకు రెండు రోజుల క్రితం దొరికిన వక అమూల్యమైన పెట్టెలో ఉన్న కరపత్రం ద్వారా తెల్సింది ఈ రహస్యం. వెంటనే లండన్ చేరుకొని మీ అందరికీ కబురు చేసాను" పూర్తి చేశాడు ఎడ్వర్డు.

"మైగాడ్! ఇదంతా నిజమే నంటావా?" అరిచాడు మిల్కాఖాన్.

"అలాగని ఈ కరపత్రం చెబుతోంది" అందించాడు ఎడ్వర్డ్ నవ్వుతూ.

పరీక్షగా చూసారు దానివైపు ముగ్గురూ. ఈజిప్షియన్ భాషలో ఏదో లిఖించబడి వుంది దానిపైన.

"అయితే మన ప్రయాణం ఎప్పుడు?" గ్లాస్‌లోకి విస్కీ వంచుతూ అడిగాడు శాంసన్.

"రేపు ఉదయాన్నే... నాలుగు టికట్స్ బుక్ చేసాను ఫ్లైట్ 731కు."

"ఫైన్."

"కాని వక విషయం."

"ఏమిటది?" అడిగాడు హెర్క్యులిస్.

"మీకు బహుశా ఈజిప్టు గురించి అంతగా తెల్సినట్టు లేదు. ఈజిప్టు విచిత్రాలకు ఎంత ప్రసిద్ధి చెందిందో ప్రమాదాలకు కూడా అంతే ప్రఖ్యాతి గాంచింది. ఏ వస్తువును ముట్టుకుంటే ఎలా మృత్యువు వరిస్తుందో చెప్పలేరక్కడ.

అక్కడున్నన్ని మాయలు, మంత్రాలు, ప్రమాదాలు, వింతలు, విచిత్రాలు ప్రపంచంలో మరెక్కడా లేవు.

అక్కడ శవాలు కూడా కదులుతాయ్.

మమ్మీలు పగ తీర్చుకొంటాయ్.

నరకబడిన చేతులు, తలలేని మొండాలు కూడా వెంటబడి ప్రాణం తీస్తాయ్.

ప్రపంచాన్నే గుప్పిట్లోకి తెచ్చుకొన్న మావాళ్ళు కూడా ఆ రోజుల్లో ఈజిప్టు అంటే భయంతో వణికిపోయేవారు.

ఎంతోమంది పరిశోధనాకారులు ఈజిప్టును గాలించబోయి చిత్రంగా మరణించారు.

ఇప్పటివరకు పిరమిడ్‌ను తెలుసుకోడానికి వెళ్ళినవారెవరూ ప్రాణాలతో తిరిగి రాలేదు.

ఇదిలా వుండగా ఆ దేశంలో ప్రతీ ఈజిప్షియన్‌కూ పిరమిడ్స్ అంటే ప్రాణం. వాటిని నాశనం చేయటానికి ప్రయత్నించినా లేదా వాటికేవిధమైన అపకారం తలపెట్టినట్లు తెలిసినా మమ్మీలకంటే వాళ్లే ముందు చంపేస్తారు.

అటువంటి దేశంలో ఎవరికీ తెలీకుండా పిరమిడ్‌లోకి ప్రవేశించటం తేలిక కాదు. ఒకవేళ ప్రవేశించగలిగినా మమ్మీలతో చెలగాటం ఆడటం మంచిదికాదు.

ప్రశాంతంగా నిద్రపోతున్న మమ్మీని లేపటం అంటే మన మృత్యువును మనమే ఆహ్వానించుకొన్నట్లవుతుంది. ఏదేమైనా మనం పిరమిడ్‌లో ప్రవేశించిన మరుక్షణం నుంచీ మన ప్రాణాలు మనవి కావు. అదృష్టం బాగుంటే అంతులేని సంపదలతో బైటకొస్తాం. లేదా మన శవాలు

కూడా ప్రపంచానికి తిరిగి కన్పించవు." చెప్పాడు ఎడ్వర్డ్.

"నాన్ సెన్స్!" కోపంగా అరిచాడు హెర్క్యులస్. "నాకు మమ్మీలపైన నమ్మకం లేదు. పనీ పాటూ లేని ఈజిప్షియన్ చరిత్రకారులు ప్రపంచాన్ని భయపెట్టాలనే ఉద్దేశ్యంతో ఈ మమ్మీగాళ్ళను సృష్టించారు. ఐ డోంట్ కేర్...ఒకవేళ నిజంగానే ఆ మమ్మీగాని ఎదురైతే... ఈ చేతులతో రెండుగా విరిచేస్తాను." బిగ్గరగా నవ్వాడు.

మౌనంగా తలూపాడు మిల్కాఖాన్.

"ఎడ్వర్డ్ ... నీకేమీ భయంలేదు. నీ ప్రాణాలు కాపాడే బాధ్యత నాది. హెర్క్యు, నేనూ, ఖాన్ ఉండగా ఏ మమ్మీ మనల్ని చేరదు. ఒకవేళ అదేగాని నిజమైందా, దాని రోజులు పిరమిడ్‌లో తీరిపోయినట్లే. నిలువెల్లా బుల్లెట్స్ నింపి తగులబెడతాను." పళ్ళు బిగబట్టాడు శాంసన్. అతని కళ్ళలో ఎర్రగా జీరలు తేలాయ్.

గంభీరంగా నవ్వాడు ఎడ్వర్డ్.

"ఓ. కె. ఫ్రండ్స్. నా అంగీకారం తెల్పుతున్నాను" అంటూ కుర్చీలోంచి లేచాడు.

# 3

కైరోనుంచి బయలుదేరిన రిలీఫ్ విమానం అలెగ్జాండ్రియా చేరుకొంది.

ఎడారిదేశమైనా ఉదయం కావటంవలన చలిచలిగా ఉంది ఈజిప్టు. ఒకప్పుడు బంగారం పండే ఈజిప్టులో నేడు ప్రత్తి పండుతోంది.

'ట్రాన్ సిట్ లాంజ్' లోంచి బయటకువచ్చారు నలుగురూ. టాక్సీ కాబ్ హోటల్ ఇషారా ముందాగింది.

ఇరవైఅయిదంతస్తుల హోటల్ ఇషార్ గంభీరంగా నిలబడివుంది. అలెగ్జాండ్రియాలోని పెద్ద హోటళ్లలో అవొకటి.

దిగి మీటర్ చూసి మనీ 'పే' చేసి లోపలికి కదిలాడు ఎడ్వర్డ్. అతన్ని అనుసరించారు మిగిలిన ముగ్గురూ.

పెట్రోలు ఉత్పత్తిలో ప్రథమస్థానం ఆక్రమించిన అరబ్ కంట్రీస్‌లోకూడా టాక్సీఫాక్జిలు ఎక్కువగా ఉండటం విచిత్రమన్పించింది మిల్కాఖాన్‌కు.

నలుగురూ నాలుగు గదులు విడివిడిగా తీసుకొన్నారు.

తనగదిలోకి నడిచాడు ఎడ్వర్డ్.

ఖరీదైన సోఫాలు, నేలంతా మెత్తని తివాచీ, ఒకప్రక్క రోజ్‌వుడ్ డబుల్‌కాట్ పైన ఫోంబెడ్, గోడలకు ఈజిప్షియన్ అందగత్తెల ఫొటోలు, అద్భుతమైన ఫాషన్‌బుల్ దీపాలు... ప్రతీ అంగుళంలో రిచ్‌నెస్ ఉట్టిపడుతోంది.

ఫ్రిజ్‌డైర్ తెరిచి బీర్‌బాటిల్ అందుకొన్నాడు. బేసిన్‌లో గడ్డకట్టిన మంచుముక్కలను ప్లాస్టిక్ బాక్స్‌లో వేసుకొనివెళ్ళి సోఫాలో కూర్చొన్నాడు.

కాలింగ్ బజర్ మ్రోగింది.

'కమిన్' అన్నాడు ఎడ్వర్డ్ బీర్‌లో ఐస్‌క్యూబ్స్ కలుపుకొంటూ. డోర్ నెట్టుకొని లోనికి వచ్చాడు హోటల్‌బాయ్. అతని చేతిలోవున్న ట్రేలో రకరకాల పదార్థాలున్నాయ్.

"టేబిల్‌పై సర్ది నువ్వెళ్ళు." త్రాగుతూ అన్నాడు ఎడ్వర్డ్. బాయ్ తలూపాడు.

చల్లగావున్న ఆ గదిలో ఇంకా చల్లగా వెళ్తోంది బీర్. బాటిల్ ఖాళీ అయింది. బ్రేక్‌ఫాస్ట్ పూర్తి చేసాడు. పైప్ వెల్గించుకొని వెళ్ళి విండో తెరిచాడు.

ఒక్కసారిగా తీక్షణమైన సూర్యకిరణాలు లోనికి దూసుకొచ్చాయి.

గంట చూసుకొన్నాడు. తొమ్మిదయింది. మధ్యాసియా వేడెక్కుతోంది ఎడారిప్రాంతం కావటంతో.

బలంగా గుండెల్లోకి పీల్చుకొన్నాడు పొగ. పెద్దపెద్ద బిల్డింగ్స్ కన్పిస్తున్నాయ్ చుట్టూ. విశాలమైన రోడ్లపై డబుల్ డెక్కర్స్ వేగంగా పరుగులు తీస్తున్నాయ్.

ఈ నలభైఏళ్ళలో బాగా మారిపోయింది ఈజిప్టు. విదేశీ నాగరికత దేశమంతా అలుముకొంది.

ఎడ్వర్డ్ కళ్ళముందు అలగ్జాండ్రియా సిటీ మేప్ కదులాడుతోంది.

అతనిదృష్టి అనుకోకుండా దూరంగా కన్పిస్తున్న అలగ్జాండ్రియా హార్బర్‌పై నిల్చింది. హార్బర్ నిండుగా వున్నాయి స్టీమర్స్. ఎక్స్‌పోర్టు ఇంపోర్టు జరుగుతోంది వేగంగా.

నాటి చరిత్ర తలపుకు రాగానే కళ్ళు చమర్చాయి అప్రయత్నంగా.

'ఈ నేలమీదే ప్రపంచప్రఖ్యాతిగొన్న జగదేకసుందరి క్లియోపాట్రా నడిచింది!

ఈ నేలమీదే ఆమెకోసం ఎన్నో దారుణయుద్ధాలు జరిగాయి!!

రక్తం ధారలుగా ప్రవహించింది.

పులిలాంటి ఆంటోనీ సింహంలాంటి సీజర్ ఆమెకోసం

పిచ్చివాళ్ళయి విశాలమైన రోమన్ సామ్రాజ్యాన్నే తృణీకరించారు!!!

అలాగే రెండవ పారహ్.

నిలువెల్లా బంగారాన్ని పరచుకొని బంగారపు ఛాయలో మెరిసిపోయిన రెండవ పారహ్ నడిచిన నేల యిది! ప్రపంచ ప్రఖ్యాతిగాన్న ఈజిప్షియన్ పారహ్ సుందరీమణులు నడిచారు ఈ నేలమీద!!

అదంతా ఏమయింది?

భయంకరమైన యుద్ధాలు ఈ సముద్రంపై జరగటానికి కారణమైన ఈజిప్షియన్ సుందరీమణులు ఏమయ్యారు??

ఆనాటి అద్భుత కళానైపుణ్యం, శిల్పచాతుర్యం, ప్రాచీన పురాతన కట్టడాలు ఏమయ్యాయి???

ఆ వైభవం ఏది? వారి చరిత్రలు ఏవి??'

తల బలంగా విదిలించాడు ఎడ్వర్డ్.

బజర్ మ్రోగింది.

"యస్. కమిన్." అన్నాడు ఎర్రసముద్రం పైనుంచి వీస్తున్న గాలిని బలంగా పీలుస్తూ.

తలుపు తోసుకొని లోనికి వచ్చారు ముగ్గురూ.

"ప్లీజ్. సిడౌన్." గోడకు తగిలించివున్న ఈజిప్టు మాప్ తీసుకొచ్చి రౌండ్ టేబిల్ పై పరచాడు ఎడ్వర్డ్.

చుట్టూవున్న సోఫాలలో కూర్చొన్నారు అంతా. స్కెచ్ పెన్సిల్ తీసుకొని వకచోట సర్కిల్ చుట్టాడు.

"ఇది అలగ్జాండ్రియా పట్టణం. దీని ఉత్తరాన్న 'కాబుర్', దక్షిణంవైపు 'ఇస్నా' ఉన్నాయ్. కాబుర్ అంతా కొండల ప్రాంతం. గన్స్‌తో మనుషుల్ని కుక్కల కంటే హీనంగా కాలుస్తారు వాళ్ళు.

పోతే ఇస్తన్. ఇది అలగ్జాంద్రియానుంచి పాతిక మైళ్ళ దూరంలో ఉంది. అలగ్జాంద్రియానుంచి ఇస్తన్‌కు వెళ్ళే దారిలో ముందుగా యిజారా కొండలు దాటాలి. అరేబియా ఎడారుల్లో యిజారా కొండలు ఇక్కడికి 20 మైళ్ళు.

ఆ కొండలు దాటి మరో ఐదు మైళ్ళు ప్రయాణం చేస్తే కాని ఇస్తన్ రాదు. కాని మనం అక్కడిదాకా పోనక్కర్లేదు. ఎందుకంటే మన కేంద్రం గమ్యం కూడా యిజారా కొండలే గాబట్టి...'' సిగ్రెట్‌తో మాప్‌పై దారి చూపుతూ యిజారా కొండలను గుర్తించాడు.

''గుడ్... మరయితే ఎప్పుడు బయలుదేరటం?'' అడిగాడు హెర్క్యులిస్.

''రేపు ఉదయాన్నే ప్రయాణానికి అవసరమైన సరంజామా అంతా సర్దుకొని...''

''ఏమాత్రం ఉంటుందా సరంజామా?''

కళ్ళుమూసుకొని రెండు నిముషాలాలోచించి చెప్పాడు ఎడ్వర్డ్.

''నాలుగు వంటెలు, ఆరడజనుమంది ఈజిప్షియన్ కూలీలు, ఒక వంటవాడు, పోతే ఆమ్స్, డ్రింక్స్, ఎక్సెట్రా...''

''మైగాడ్. ఇంతమందిని వెంటబెట్టుకొని వెళితే వాళ్ళలో ఎవరికైనా అనుమానం రావచ్చునేమో.'' అనుమానంగా అడిగాడు మిల్క్‌ఖాన్.

''నో...'' నవ్వాడు ఎడ్వర్డ్. ''ఇజారా ఇస్తన్‌లకు వెళ్ళే ప్రయాణీకులు కోకొల్లలు. సాధారణంగా ఈజిప్టును చూడటానికి వెళ్ళే ప్రతి ప్రయాణీకుడూ పురాతనమైన వస్తువులపై ఆశతో వెళ్ళటంవలన అలగ్జాంద్రియానుంచి

ఖచ్చితంగా ఏ ఛాంబర్‌లో, ఇస్తమ్‌లలో వెళతాడు. ఇజారా కొండల్లో వెతుకుతాడు.

వాళ్ళు చెప్పినపని చేయటమే తప్ప వాళ్ళేం చేస్తున్నారో గమనించే ఓపిక ఈజిప్షియన్స్‌కు ఉండదు. అయినా వాళ్ళు కేవలం మనం యిజారా చేరేవరకూ మాత్రమే మన నౌకర్లు. ఆపైన ఆ రహస్య సొరంగం ఎక్కడో ఆ కొండల్లో మనమే వెతుక్కోవాలి.'' చెప్పాడు.

# 4

ఉదయం ఆరున్నర అవుతోంది.

గంటన్నర ప్రయాణంలో అందరూ అలగ్జాండ్రియా పొలిమేరలు దాటారు. ఒంటెలు లయబద్ధంగా అడుగులు వేస్తున్నాయి. సూర్యుడు ఆకాశంలోకి రాకుండానే ఇసుక వేడెక్కుతోంది. సన్నగా వీస్తున్న గాలికి ఇసుక గాల్లోకి ఎగురుతోంది.

ఒంటెల మూపురాలపై అమర్చివున్న టొంటెలలో కూర్చొని చుట్టూ పరవశంగా చూస్తున్నారు ముగ్గురూ. ఎడ్వర్డు మాత్రం ఇదేమీ పట్టనట్లు ఏదో ఆలోచనలో నిమగ్నుడై వున్నాడు.

ఒంటెల ప్రక్కనే ఈజిప్షియన్ కూలీలు నడుస్తున్నారు ఏవో కబుర్లు చెప్పుకొంటూ.

జేబులోని పాకెట్ గన్‌ని మరోసారి తడుముకొన్నాడు శాంసన్. ప్రక్కనేవున్న డబుల్ బారల్ రైఫిల్ అతని పెదాలపై చిరునవ్వును కలిగించింది.

ఒక్కసారిగా ఆకాశంలోకి దూసుకొచ్చాడు సూర్యుడు. వేడి విజృంభించింది.

బ్రహ్మాండమైన సూర్యుడి వెలుతురులో ఇసుక పొటీ పడుతూ పచ్చగా బంగారంలా మెరిసిపోతోంది. అరే బియా ఎడారి ఉడుకుతోంది.

గిన్నెలోని పన్నీరు తీసి ముఖంపై అద్దుకొన్నాడు హెర్క్యులిస్. తలపై వున్న హాట్ వేడిని ఆపలేక పోతోంది. చెమటలు శరీరంపైనుంచి ధారగా కారుతో న్నాయి. సూర్యుని కాంతిలో అతని తెల్లటి శరీరం మంచి గంధం చెక్కలా మెరవసాగింది.

సమయం గడుస్తోంది. వాటర్ బాగ్ తెరిచి పెదాలు కంఠం తడుపుకొని నీడలో వదిగి కూర్చొన్నాడు.

మధ్యాహ్నం వంటిగంటకు ప్రయాణం ఆపి గుడారాలు వేశారు కూలీలు. దారిలో వేటాడిన రెండు గువ్వలు మూడు కుందేళ్ళను కూరచేసాడు వంటవాడు. సరదాగా కబుర్లు చెప్పుకొంటూ భోజనాలు పూర్తి చేసారు అంతా.

గంట విశ్రాంతి అనంతరం తిరిగి కొనసాగించారు ప్రయాణం. ఎప్పుడూ ఇసుక ఎడారిలో ప్రయాణం చెయ్యని హెర్క్యులిస్ శాంసన్ లకు చాలా విచిత్రంగా వుంది వాతావరణం.

ఎటు చూసినా అంతులేని ఇసుక గుట్టలు, గాలికి తరంగాలుగా పైకిలేచి నాట్యం చేస్తోంది ఇసుక. వీస్తున్న సన్నని గాలితెరలు నిప్పుల్లా కాలుస్తున్నాయి శరీరాలను తాకినప్పుడల్లా.

అప్పటికే నాలుగు బీరు బాటిల్స్ ఖాళీ చేసాడు మిల్క్ ఖాన్. అయినా వేడిని తట్టుకోలేక పోతున్నాడు.

గంట గడిచింది. దూరంగా యురారా కొండలు లీలగా ప్రత్యక్షమయ్యాయి. కూలీలంతా ఒక్కసారి

ఆనందంగా అరిచారు. బైనాక్యులర్స్ అందుకొని పరీక్షగా చూసాడు జాంసన్.

కనుచూపుమేరంతా రాతిగుట్టలా కన్పిస్తున్నాయి, 'యిజారా కొండలు.' ఆకాశంలో ఏదో విమానం 'బాల్కన్' (గ్రీస్) వైపు ఎగుర్తూ వెళ్ళింది.

దగ్గరగా అన్పించినా వాటిని చేరుకోడానికి ఎక్కువ సమయం పట్టింది.

ఇజారా కొండలు విచిత్రంగా ఉన్నాయ్. అంతా ఇసుక పొర. రాళ్ళు గుండ్రంగా కాకుండా పొరలు పొరలుగా, పలుకలు పలుకలుగా ఉన్నాయి. ఒకవిధంగా చెప్పాలంటే వాటిని కొండలు అనటంకంటే గుట్టలు అనటం సమంజసం అన్పించింది వారికి.

ఒంటెలు నెమ్మదిగా పైకి ఎక్కసాగాయి. ఏటవాలుగా ఉన్నాయి యిజారా కొండలు. పైకి ఎక్కుతోన్న ఒంటెలమీద కూర్చొంటే కొంచెం భయంగానే వున్నా సరదాగా అదో అనుభవంలా తోస్తోంది మిల్కాఖాన్కు.

కొండలపైకి చేరుకొన్నారందరూ. దగ్గర్లో ఇస్తమ్ మైదానాలు కన్పిస్తున్నాయ్. ఇస్తమ్ పట్టణం ఇంకా ఐదుమైళ్ళ దూరంలో వుంది. సామానులు దించి కూలీలందరికీ డబ్బిచ్చి పంపేశాడు ఎడ్వర్డ్.

గంట ఏడయింది. చీకట్లు బాగా ముసురుకొన్నాయి. కొండప్రాంతం కావటంవలన కీచురాళ్ళ రొద ఎక్కువగా వుంది. అప్పుడప్పుడు మాత్రం కొండగుట్టల్లోని ఎడారి నక్కలు భయంకరంగా కూతలు పెడుతున్నాయ్.

వంటప్రయత్నాలు పూర్తయ్యాయ్. కబుర్లు చెప్పుకొంటూ భోజనాలు పూర్తిచేసారు. దూరంగా రాళ్ళకు

కట్టిన నాలుగు వంతెలు చీకట్లో దయ్యాల్లా కన్పిస్తు న్నాయి. ముగ్గురూ రాళ్ళపై దుప్పట్లు పరుచుకొని పడు కొన్నారు.

శాంసన్ మాత్రం జేబులోని పాట్ గన్ ని ఒకసారి తడుముకొని వెళ్ళి ప్రక్కనేవున్న బండరాయికి ఆనుకొని కూర్చొంటూ సిగార్ వెల్గించుకొన్నాడు. అతని రేడియం వాచీ సమయం పదిగంటలు చూపుతోంది.

# 5

తెల్లవారుతోంది.

తలపైవున్న హాట్ ఓసారి సవరించుకొని ఒంటె త్రాడు పట్టుకొని ముందుకి నడిచాడు ఎడ్వర్డ్. మిగిలిన ముగ్గురూ అతని వెంటబడ్డారు.

ఈజిప్టు మాప్ అతని కళ్ళముందు మెదులుతోంది. ఇజారా కొండలు మొత్తం పొడుగు నాలుగున్నర మైళ్ళు. ఈ నాలుగున్నర మైళ్ళ పొడవున్న కొండల్లో ఏదో మూల వుంటుంది పిరమిడ్ కు పోయే రహస్యదారి.

మొదటగా తూర్పుదిక్కుకు పోతున్న కొండపాయను ఎన్నుకొన్నాడు ఎడ్వర్డు. ఎందుకంటే 20 మైళ్ళ దూరంలో వున్న అల్గాండ్రియా, ఐదుమైళ్ళ దూరంలో వున్న ఇస్తమ్ పట్టణాలు తామున్న స్థలంనుంచి తూర్పుగా వ్యాపించి వున్నాయి.

కాబట్టి పిరమిడ్ ఖచ్చితంగా తూర్పువైపునున్న ఇసుక ఎడారిలోనో లేదా ఇస్తమ్ మైదానాల్లోనో కట్టబడి వుండాలి. అలాగే దాని రహస్యద్వారంకూడా తూర్పుకు ఉన్న యిజారా పాయల్లోనే ఎక్కడో వకచోట ఉండాలి.

ఈ ఉద్దేశ్యంతోనే తూర్పుదిక్కును ఎన్నుకొన్నాడు. ప్రతీ రాయీ, గుట్టా జాగ్రత్తగా పరిశీలిస్తూ ముందుకు కదులుతున్నారు అందరూ.

ఎటు చూసినా ప్రగాఢమైన నిశ్శబ్దం ఆవరించుకొని వుంది. క్రమంగా సూర్యుడు పైకెక్కుతున్నాడు.

ఆకాశంలో రాబందులు గిరికీలు కొడుతున్నాయి. నలుగురూ నాలుగువైపులా వెదుకుతున్నారు.

మిల్కాఖాన్ బూట్లశబ్దం విని రాళ్ళ చాటునుంచి హైనా వకటి అరుస్తూ పరిగెత్తింది దూరంగా. రాళ్ళ గుట్ట దగ్గరకు వెళ్ళి లోనికి చూసాడు ఖాన్. చిన్న గుహలా వుండి నాలుగైదు ఎడారి జంతువులు నివసించటానికి అనువుగా వుంది.

హైనా పిల్లలు కాబోలు నాలుగు కూనలు ఒకదానిపై వకటి దొర్లుతున్నాయి. ఆ ప్రదేశమంతా దుమ్ముతో ఛండాలంగా దుర్గంధం కొడుతోంది. ముందుకు కదిలాడు మిల్కాఖాన్.

రెండు గంటలు గడిచాయి. దాదాపు మైలుదూరం వరకూ వెదికి వచ్చేశారు నలుగురూ. దారిలో సుమారు పాతికదాకా సొరంగాలు, గుహలు తారసిల్లాయి వారికి. అన్నీ చిన్నగా అర్ధ గజంకూడా పొడుగు లేకుండా వున్నాయి. వాటిల్లో జంతువులు నివసిస్తున్న జాడ స్పష్టంగా తెలుస్తోంది.

అకస్మాత్తుగా ఆగిపోయాడు మిల్కాఖాన్ ఎడ్వర్డ్ కేక విన్పించి. రెండు ఫర్లాంగుల దూరంలో నిల్చున్న ఎడ్వర్డ్ చేతులూపుతున్నాడు.

ఒంటెపైకెక్కి ముందుకి అదిలించాడు మిల్కాఖాన్.

ఎడ్వర్డ్ దగ్గరకు చేరుకొనేసరికి మిగిలిన ఇద్దరూకూడా పరిగెత్తుకొచ్చారు అక్కడికి.

"ఏమిటి? ఏం జరిగింది??" ఆత్రుతగా అడిగాడు మిల్కాఖాన్.

మాట్లాడకుండా ఎదురుగావున్న పెద్ద బండరాయిని చూపించాడు ఎడ్వర్డ్.

కళ్ళు చికిలించాడు శాంసన్. కండలు పొంగించాడు హెర్క్యులిస్.

దానివైపు పరిశీలనగా చూశాడు ఖాన్. నిలువెత్తులో వుండి ఎవరో మలచి కావాలనేచానిని అక్కడ అడ్డుగా వుంచినట్లు కొండకు ఆనుకొనివుంది బండ. లేకుంటే చిన్న చిన్న రాళ్ళగుట్టలతో నిండివున్న యిజారాకొండల్లో ఇంత పెద్దరాయి ప్రత్యేకంగా వుండటం విచిత్రమే అన్పించిందతనికి.

అనుమానంగా చూస్తూ దానిచుట్టూ ప్రదక్షిణచేసాడు మిల్కాఖాన్. అతనిదృష్టి వకచోట నిలచింది. మరు క్షణం అతని ముఖం ఆనందంతో వెలిగిపోయింది.

బండరాయి కొండకు ఆనుకొని వున్నచోట కొండలో ప్రకృతిసిద్ధంగా సన్నని బీటలువేసి నిలువుగా చీలిక ఏర్ప డింది. ఆ చీలికలోంచి లోనికి జొరబడుతున్న సూర్య కిరణాలు లోనవున్న సొరంగాన్ని బహిర్గతం చేస్తున్నాయి.

ఆనందగా అరిచారు అంతా.

"బహుశా ఇదే ఆ రహస్య సొరంగం అయి వుంటుంది" అన్నాడు మిల్కాఖాన్.

"ఏం చేద్దాం? డైనమేట్ పెట్టి పేల్చేద్దామా ఆబండ రాయిని?" అడిగాడు శాంసన్.

"నో...ఆ పని చేస్తే మొదటికే మోసం వస్తుంది. ఇవసలే చిన్న చిన్న రాళ్ళగుట్టలు. డైనమైట్ ప్రేలుడికి బండరాయి నాశనమవటంతోపాటు ఆ సొరంగం మొత్తం కూలిపోయే ప్రమాదం వుంది" అన్నాడు ఎడ్వర్డ్.

"మరయితే ఏం చెయ్యాటం?" విసుగ్గా అరిచాడు శాంసన్.

నవ్వాడు హెర్క్యులిస్.

"డోంట్ వర్రీ ఫ్రెండ్స్... నేనున్నాను. కమాన్ ఖాన్" అంటూ ముందుకు కదిలాడు.

చెరొక వైపునా కొండ నానుకొని, నిలబడి బండను ముందుకు నెట్టనారంభించారు.

హెర్క్యులిస్ పళ్ళు బిగబెట్టాడు.

అతని ఛాతీ ఉప్పొంగింది. కండలు పైకి లేచాయ్.

ఊపిరి బిగబట్టి శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకొని ముందుకు నెట్టాడు మిల్కాఖాన్.

బండరాయి ముందుకు కదిలింది. మరోసారి బలంగా త్రోసాడు హెర్క్యులిస్. బండరాయి గాల్లోకి లేచి కొండ కిందకి దొర్లింది. భయంకరమైన వేగంతో పిడుగులు పడుతున్న శబ్దం చేస్తూ క్రిందా పైనా దొర్లుతూ వెళ్ళి ఇసుక మైదానాల్లో పడింది.

తృప్తిగా నిట్టూర్చారు నలుగురూ. నెమ్మదిగా లోని కడుగు పెట్టాడు మిల్కాఖాన్. అతని చేతిలోని టార్చి చీకటిని ఛేదిస్తోంది. రాకాసిలా నోరు తెరుచుకొని చూస్తూంది సొరంగం.

ఒంటెలను చీకటిలో కట్టేసి రివాల్వర్స్ పొజిషన్‌లో ఉంచుకొని పిరమిడ్‌ను వెతుక్కొంటూ సొరంగంలో

ముందుకు నడిచారు. వాళ్ళ చేతుల్లోని టార్చిలైట్స్ మార్గాన్ని ప్రకాశవంతం చేస్తున్నాయ్.

# 6

ఏటవాలుగా ముందుకు సాగుతోంది సొరంగం. ఎడారి క్రింద నుంచి వెళ్తోండటంవలన వేడి చాలా దారుణంగా వుంది. అదరాబాదరా కట్టినట్లనిపిస్తోంది రాళ్ళు పేర్చిన తీరు చూస్తూంటే.

జాగ్రత్తగా పరిసరాలను చూస్తూ నెమ్మదిగా కదులుతున్నారు నలుగురూ. అప్పటికే సుమారు రెండు మైళ్ళు పైగా వెళ్ళారు. అయినా ఆ సొరంగానికి అంతు దొరకటం లేదు. ఒక్కొక్కచోట మరీ వాలుగా వుండి నడవటానికి వీలులేక జారవలసి వస్తోంది. ఆహార పదార్థాలు, మందులు దాయబడిన బాగ్‌లు భుజాలకు వ్రేళ్ళాడుతున్నాయ్.

దాహం వేసింది ఎడ్వర్డుకి. జేబులోంచి రమ్ బాటిల్ తీసి సగం త్రాగి, ప్రక్కనే వున్న మిల్కాఖాన్‌కు అందించాడు. నవ్వుతూ తీసుకొని ఖాళీ చేసాడు దాన్ని మిల్కాఖాన్.

"ఎడ్వర్డ్..." పిల్చాడు ఖాన్.

"ఏమిటి?" అడిగాడు ఎడ్వర్డ్.

"నిజంగా ఈ దారి పిరమిడ్‌కే వెళుతుందనుకో. అయితే అప్పుడు శిల్పాచార్యుడు, మహారాణి ఇలాగేకదా బైట కెళ్ళింది?"

"అవును."

"అలాగయితే ఈ సొరంగం ద్వారానికి బైట రాతి బండ అడ్డుగా ఉంటే ఎలా వచ్చారంటావ్? ఒక వేళ వాళ్ళు బైటకొచ్చేదాకా ఆ బండరాయి లేదనుకొందాం.

మరయితే వాళ్ళిద్దరూ బైట కొచ్చాక అంత పెద్ద బండను ఎలా అడ్డు పెట్టగలరు?" అడిగాడు.

రెండు నిముషా లాలోచించి చెప్పాడు ఎడ్వర్డు.

"బహుశా ఒకవిధంగా జరిగి వుండొచ్చు. ఆ బండ రాయిని రహస్యద్వారానికి కొంచెం ప్రక్కగా ఏట వాలుగా ఉంచి ఏ కొంచెం తోసినా ద్వారానికి అడ్డు పడేటట్లు అమర్చి వుండొచ్చు. శిల్పాచార్యుడు మహా రాణితో కలిసి బైటకు రాగానే ఆ బండరాయిని ద్వారా నికి అడ్డుగా నెట్టేసి, అలెగ్జాండ్రియాకి వెళ్ళిపోయి ఉండొచ్చు."

"అవును...అలాగే జరిగి వుంటుంది" ఒప్పుకొన్నాడు మిల్కాఖాన్.

ఏదో శబ్దమైంది. ఉలిక్కిపడి ఆగిపోయారు నలుగురూ. చెవులు రిక్కించాడు ఎడ్వర్డ్. మళ్ళా విన్పించిందా శబ్దం నేలపై జరజరా ప్రాకినట్లు.

ప్రక్కనే బుస్ మన్న శబ్దంతో బాటు బూట్ కాలిపై ఏదో గుద్దుకొంది మిల్కాఖాన్ కు. అదిరిపోతూ ప్రక్కకి గెంతాడు. అతని చేతిలోని టార్చి అప్రయత్నంగా నేల వైపు తిరిగింది.

చిక్కటి వెలుగులో గిలగిలా కొట్టుకొంటూ మెలికలు తిరుగుతున్న పాము కన్పించింది. దాని శరీరం గాజులా తళతళ మెరిసిపోతోంది. అరనిముషంలో దానిలో కదలిక ఆగిపోయింది. కాంతిని తన వైపుకు తిప్పుకొన్నాడు. బూట్లపై విషపు చుక్కలు అక్కడక్కడా మెరుస్తు న్నాయి. నేలపై పడిన విషం ఇసుకలో ఇంకిపోతోంది.

దానివైపే చూస్తోన్న అతనికి చటుక్కున గుర్తొచ్చింది గ్లాస్ స్నేక్. దానికి మనుషులంటే భయం. మనిషిని

చూస్తే తల బ్రద్దలు కొట్టుకొని చచ్చిపోతుంది. ఒళ్ళంతా గాజులా తళ తళా మెరిసే ఆ అందమైన పాములు ప్రపంచంలో చాలా అరుదుగా కన్పిస్తాయి.

నిట్టూరుస్తూ ముందుకు కదిలాడు. మరో గంట గడిచింది. ఇంకో రెండు మైళ్ళు ముందుకెళ్ళారు.

కొంచెం దూరంలో సొరంగం అంతమౌతూ కన్పించింది. ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతూ ముందుకు పరిగెత్తారు.

అన్ని వైపులా గోడలు కన్పిస్తున్నా ఎక్కడినుంచో సన్నని వెలుతురు లోనికి ప్రసరిస్తూ అంతా ప్రకాశవంతం చేస్తోంది.

ఎటు చూసినా బూజులు సాలెగూళ్ళు కనిపిస్తున్నాయ్. అక్కడంతా కంపు కొడుతోంది. భూమిలో నిర్మించిన ఆ సమాధిలోకి అంత ధారాళంగా గాలి ఎలా వీస్తోందో, వెలుతురు ఎలా ప్రసరిస్తుందో అర్థం కాలేదు హెరాక్లిస్ కు.

అడ్డుగా వున్న సాలెగూళ్ళు చేతితో ప్రక్కకు నెట్టి చుట్టూ చూసాడు ఎడ్వర్డు.

తాను వున్న చోటునుంచి ఎదురుగా పొడవైన వరండాలా సన్నని ఇరుకు దారి కన్పిస్తూంది. రెండు వైపులా ఎత్తైన గోడలు పైన ఏటవాలుగా కలిసిపోయి వున్నాయి. పాలరాతితో నిర్మించబడిన గోడలలో ప్రతిబింబాలు కన్పిస్తున్నాయి. నేలంతా దుమ్ము పేరుకొని వుంది.

ముందుకు కదిలాడు ఎడ్వర్డు. రెండు ఫర్లాంగుల దూరం పోగానే ఆ దారి అంతమైంది. అడ్డుగా ఉన్న రాళ్ళను తొలగించి సన్నని పగులుద్వారా అవతలి వైపుకు వెళ్ళగానే ఆశ్చర్యంతో నిలబడిపోయాడు ఎడ్వర్డు.

అతని గుండె లయ తప్పింది ఆ పిరమిడ్ అందాన్ని చూస్తూంటే.

ఎటు చూసినా బంగారపు పలకలతో నిర్మించిన గోడలు మెరుస్తున్నాయ్. అందంగా మలచబడిన బంగారపు విగ్రహాలు గోడలకు అమర్చబడి ఉన్నాయ్! అక్కడక్కడా బంగారపు కొలనులు కన్పిస్తున్నాయి! గొట్టాల ద్వారా భూగర్భ జలాశయాలతో సంబంధం కలపటం వలన అందులో నీరు నిలవ వుండక స్వచ్ఛమైన నీరు ప్రవహిస్తూంది.

అక్కడ కన్పించేవి రాళ్లు కాదు. బంగారపు ముద్దలు!
అక్కడ ఉండేది మట్టికాదు. బంగారపు ధూళి!

అసలది ఒక సమాధిలాగే లేదు. ఎవరో మహారాజు విశ్రాంతి కోసం ప్రత్యేకంగా కట్టించుకొన్న అద్భుతమైన మందిరంలా వుంది.

ఇది కేవలం ఒక సమాధిగా భూమిలో మిగిలిపోయిందేమోకాని ప్రపంచంలో గుర్తించబడితే దీని సౌందర్యం ముందు ఏదీ నిలవదన్పించింది మిర్యాఖాన్‌కు.

ఎంతో సువిశాలంగా వుంది పిరమిడ్. వాళ్లున్న చోటు నుంచి ఎన్నో దారులు కన్పిస్తున్నాయి. ఎటు చూసినా పిరమిడ్ పెరుగుతోందే కాని తరగటం లేదు.

అరగంట ఆగి తిరిగి బయలుదేరారు అంతా. కాళ్ళకు అడ్డు తగులుతున్న బంగారపు గుట్టలను నిర్లక్ష్యంగా తన్నేస్తూ ముందుకు నడుస్తున్నారు. ఆ పిరమిడ్ సౌందర్యాన్ని చూస్తున్నకొద్దీ మతిపోతోంది అందరికీ.

ప్రపంచంలో ప్రతి వ్యక్తిచేతా వక బంగారపు పిచ్చివాడిలా గుర్తించబడిన రెండవ పారహ్‌లో ఎంత కళాభిమానం వుందో ఆ పిరమిడ్ చూస్తూంటే అర్థమౌతోంది.

అక్కడక్కడా అస్థిపంజరాలు కన్పిస్తున్నాయి. ఎండిపోయిన వాటి ఎముకలపై అడుగు వేసినప్పుడల్లా వెలువడే విచిత్రమైన శబ్దం పిరమిడ్ లో ప్రతిధ్వనిస్తూంది.

పిరమిడ్ అంతా పూర్తిగా కలియతిరిగేసరికి రెండు గంటలు పట్టింది. అంతా పిరమిడ్ మధ్య భాగానికి చేరుకొన్నారు. సుమారు వెయ్యిమంది పైగా హాయిగా నివసించేటంతుంది పిరమిడ్.

చుట్టూ నిధులు దాచబడిన గదులు కన్పిస్తున్నాయి. తలపై ప్రవేశ ద్వారం మూసుకుపోయి వుంది. మధ్యనించి 'టోంబ్'లో దాచబడిన పారహా మమ్మీ దగ్గరకు చేర్చే దారి భూమిలోకి పోతోంది.

ఏం చేద్దామన్నట్లుగా మిగిలిన ముగ్గురివైపూ ప్రశ్నార్థకంగా చూసాడు ఎడ్వర్డు.

"ముందు నిధుల తలుపులు తెరుద్దాం!" అన్నాడు శాంసన్ వక గది ముందుకు వెళ్ళి. మూయబడివున్న వుక్కు తలుపు వైపు పరీక్షగా చూసాడు.

"మన చేతుల్లోని శక్తికి అవి కదలవు!" అన్నాడు మిలార్కాఖాన్.

"ప్రయత్నించి చూద్దాం" అంటూ పిడికిలి బిగించి బలంగా గుద్దాడు దానిపై హెర్క్యులిస్. గట్టిగా ప్రతిధ్వనించింది శబ్దం, కాని ఇసుమంత కూడా కదలలేదు వుక్కు తలుపు.

శాంసన్ చేతిలోని షాట్ గన్ రెండుసార్లు ప్రేలింది. బులెట్స్ తుపాకారాలి పడినట్లు పడ్డాయి దానికి తగిలి. వేడిగా వున్న బులెట్స్‌ను కర్చీఫ్‌తో తీసి జేబులో వేసుకొన్నాడు.

ఎడ్వర్డు బాగ్ లోంచి టార్పెడో పౌడర్ తీసి వుక్కు తలుపు మొదట్లో కూరాడు. దాని పైభాగాన లెడ్ అజైడ్ వుంచి గన్ పౌడర్‌తో చేయబడిన తీగను పరుచుకొనివచ్చి అంటించాడు.

భయంకరమైన ప్రేలుడుతో ఉక్కు తలుపు సగం విరిగి ద్వారానికి అడ్డంగా వ్రేలాడసాగింది. పిరమిడ్ గోడలు అర సెకనుపాటు కంపించాయి. లోనికి ప్రవేశించిన వారికి ఆనందంతో మతి పోయింది. ఎటు చూసినా గదంతా బంగారపు ఇటుకలు పరచబడి వున్నాయి.

"బాస్టర్డ్! ఎంత బంగారాన్ని ప్రపంచానికి అందకుండా స్వార్థంతో దాచుకొన్నాడో?" జలసీగా అరిచాడు శాంసన్.

"ఈ బంగారంతో ఖచ్చితంగా ఈజిప్టును కొనేసి అరబ్ సుందరీమణులనంతా పెళ్ళాడేయొచ్చు..." నాలికతో పెదాలు తడుపుకొంటూ అన్నాడు మిల్క్‌ఖాన్.

"ఇంత బంగారాన్ని ఎలా బయటకు తీసుకెళ్ళాలో అర్థం కావటం లేదు" గొణిగాడు హెర్క్యులిస్.

"ఫ్రెండ్స్!" గంభీరంగా పిల్చాడు ఎడ్వర్డు.

"నాకు తెలిసిన విషయం నిజమైతే ఇంతకన్నా అద్భుతమైన సంగతొకటి ఉంది. రెండవ ఫారోహ్ చనిపోయే ముందు అమూల్యమైన ఎనిమిది వజ్రాలతో ఒక హారాన్ని తయారు చేయించుకొన్నాడట. ఆ హారాన్ని తన ప్రాణాలకన్నా ఇష్టంగా చూసుకునేవాడు. బంగారం కోసం తవ్విన త్రవ్వకాలలో ఒక చోట బయటపడ్డాయా ఎనిమిది వజ్రాలు.

వాటిని పరిశీలించిన రత్నపు నిపుణులు ఆ వజ్రాలకు విలువ కట్టలేకపోయారు. కాని దురదృష్టవశాత్తూ ఆ

హారాన్ని ధరించిన నెల రోజులకే పారహ్ మృత్యువు వాత బడ్డాడు.

తర్వాత ఎప్పుడో ఆ చరిత్రకారులు ఆ వజ్రాల పోలికలనుబట్టి వాటి వర్ణాలనుబట్టి లెక్క కట్టి ఆ హారం విలువ సుమారు ఏనభై కోట్ల డాలర్లుగా తేల్చారు."

"యస్. నేనూ ఏదో మాగజైన్‌లో ఆ విషయాన్ని చదివినట్లు గుర్తు" అన్నాడు శాంసన్. అతని కళ్ళు మెరుస్తున్నాయి. "అంటే ఆ హారం మమ్మీ మెడలో వుండాలి" అరిచాడు.

"అవును. అది దక్కించుకొంటే చాలు. దాని విలువ ఈ గదిలో బంగారానికి రెట్టింపు వుంటుంది" అన్నాడు మిల్కాఖాన్ 'టోంబ్‌కు' వెళ్ళే మార్గాన్ని చూస్తూ.

హెర్క్యులిస్ నవ్వుతూ ముందుకు నడిచాడు. మిగిలిన ముగ్గురూ అనుసరించారు.

నెమ్మదిగా క్రిందకు దిగుతున్నాడు హెర్క్యులిస్. కాలు వేస్తే జారిపోయేంత నునుపుగా ఉన్నాయి మెట్లు. ఆఖరి మెట్టు దిగగానే ఎదురుగా కన్పించింది 'టోంబ్'.

చుట్టూ వున్న అద్దాలలోంచి ప్రశాంతిగా నిద్రపోతున్నట్లు కనిపిస్తోంది పారహ్ శవం. అతని మెడలో వున్న వజ్రాల హారం కాంతులు విరజిమ్ముతోంది. నెమ్మదిగా నడుస్తూ దగ్గరికెళ్ళి పారహ్‌ను పరీక్షగా చూసారు అందరూ.

రకరకాల ద్రవాలలో ముంచి భద్రపరచబడిన పారహ్ శవం కొద్ది క్షణాల క్రితం మరణించినవాడిలా ఫ్రెష్‌గా వుంది.

ఆరడుగుల ఎత్తున్న పారహ్ ముఖంలో స్పష్టమైన రాజఠీవి మెరుస్తోంది. బంగారపు రంగులో మెరుస్తోన్న పారహ్ కిరీటంలోని ఆకుపచ్చరాయి కాంతులు వెదజల్లుతోంది.

తన దగ్గరున్న ఫ్లాష్ కెమెరాతో చకచకా ఫొటోలు తీసాడు శాంసన్. ఎడ్వర్డు వైపు చూసాడు మిల్కాఖాన్.

తల వూపాడు ఎడ్వర్డ్.

ఖాన్ 'టోంబ్'పై గాజు పలకను ప్రక్కకు జరిపి, చెయ్యి చాచి పారహ్ మెడలో వున్న హారాన్ని అందుకొని పుటుక్కున తెంపాడు. తళతళలాడుతూ చేతిలో మెరిసిపోతోన్న ఆ హారాన్ని ఎడ్వర్డుకు అందించాడు తిరిగి మమ్మీ వైపు చేయి చాచబోతున్న మిల్కాఖాన్ ఉలిక్కిపడ్డాడు....

## 7

అతని గుండెలు దడదడలాడాయి. కళ్ళు నులుసుకుని పరీక్షగా చూడసాగాడు.

"సందేహం లేదు. నిజమే. కల కాదు..." గొణుక్కుంటూ మిగిలిన వారివైపు చూసాడు ఖాన్.

వాళ్ళ పనీ అలాగే వుంది.

ఎడ్వర్డు జేబులోంచి గ్రెనేడ్ తీసాడు.

శాంసన్ పాట్‌గన్ చుట్టూ వ్రేళ్ళు బిగించాడు. అతని ముఖం ముడుచుకొంది. అలవికానటువంటి క్రూరత్వం అతని కళ్ళల్లో తొంగి చూస్తోంది.

హెర్క్యులీస్ కండలు పొంగాయి. ముందు కడుగు వేయబోయూ డతను. చేయిచాచి వారిస్తూ 'టోంబ్' వైపు తీక్షణంగా చూస్తున్నాడు ఎడ్వర్డు.

అప్పటివరకు ప్రశాంతంగా నిద్రపోతున్న పారహ్ శవం కొద్దిగా కదులుతోంది. మూసుకొని వున్న కళ్ళు తెరుచుకొన్నాయి. జీవం లేనట్లు శూన్యంలోకి చూస్తున్న ఆ కళ్లు వారిలో తెలియని భయాన్ని రేకెత్తిస్తున్నాయ్.

అర నిముషం గడిచింది.

నెమ్మదిగా టోంబ్‌లోంచి లేచి నిలబడింది పారహ్ శవం.

కొయ్య బొమ్మల్లా చూస్తున్నవారు ఉలిక్కిపడి వెనకడుగు వేశారు.

మిల్కాఖాన్ గాభరాగా వెనక్కి తిరగబోయాడు. నిర్జీవంగా నిలబడిన మమ్మీలో చలనం వచ్చింది. మెరుపులా వకడుగు ముందుకేసి వెను తిరగబోతున్న ఖాన్‌ను అందుకొంది.

భయంకరంగా ఆర్తనాదం చేశాడు ఖాన్. పహిల్వాన్ లాంటి మిల్కాఖాన్‌ను తేలికగా పైకెత్తి అడ్డంగా విరచేసింది మమ్మీ.

రక్తం పిచికారిలా గదంతా విరజిమ్మింది. గజగజలాడిపోయారు ముగ్గురూ అనుకోని ఆ పరిణామానికి.

అప్రయత్నంగా ట్రిగర్ నొక్కాడు శాంసన్. బుల్లెట్స్ దూసుకెళ్ళి మమ్మీని తాకడంతోటే క్రిందకి రాలిపోయాయి.

మమ్మీ పెదాలు విడివడ్డాయి. ముందు కడుగు వేసింది.

చేతిలోని గ్రినేడ్ మమ్మీపై విసిరాడు ఎడ్వర్డు. ప్రేలుడికి చెవులు బ్రద్దలయ్యాయి. గదంతా పొగలు అలుముకుంది. కళ్ళు చిట్లించి చూసారు ముగ్గురూ. అంతకు ముందు మమ్మీ ఉన్న చోట లోతైన గొయ్యి ఏర్పడింది.

ఐనా తనకేమీ పట్టనట్లు ముందుకు నడుచుకొస్తోంది మమ్మీ చేతులు చాచి.

చటుక్కున వెనక్కి తిరిగి పైకి పరిగెత్తాడు ఎడ్వర్డ్. అతని వెంట పడ్డారు మిగిలిన ఇద్దరూ. 'టోంబ్' నుంచి

బయటకురాగానే మరో గ్రెనేడ్ విసిరాడు ఎడ్వర్డ్.

టోంబ్ కు వెళ్ళేదారి మూసుకుపోయింది. కంగారుగా ముందుకు పరుగెత్తారు అందరూ. ఆ భయంకరమైన నిశ్శబ్దంలో వాళ్ళ బూట్ల శబ్దం ప్రతిధ్వనిస్తోంది.

ఎంత త్వరగా బైటకు పారిపోతే అంత మంచిది అనే ఉద్దేశంతో లేని ఓపిక తెచ్చుకొంటూ ముందుకు పరిగెత్తుతున్నారు.

కళ్ళముందు మిల్కాఖాన్ చావు కన్పిస్తోంది. పహిల్వాన్ లాంటి మిల్కాఖాన్ ను అతి తేలికగా విరిచేసిన మమ్మీ శక్తి సామార్థ్యాలు ఇప్పుడర్థమౌతున్నాయి.

వాళ్ళ చెవుల్లో మమ్మీ నవ్వు ప్రతిధ్వనిస్తోంది. అరగంటలో పిరమిడ్ ను దాటి రహస్య సొరంగంలో ప్రవేశించారంతా. అయినా ఆగలేదు.

అత్యాసకుపోయి హారం కోసం మమ్మీతో చెలగాట మాడినందుకు తనని తనే తిట్టుకొన్నాడు ఎడ్వర్డ్.

ఎంత వేగంగా పరిగెత్తినా సొరంగం బైటకు చేరుకోడానికి గంటపైనే పట్టింది వారికి. చకచకా వంటెలను విప్పి బైటకు తరుముతుండగా డైనమేట్ అమర్చాడు ఎడ్వర్డ్.

వత్తిని దూరంగా పట్చుకొచ్చి దాన్ని అంటించి బైటకు దూకాడు.

సొరంగ ద్వారానికి దూరంగా పరిగెత్తారు. భయంకరమైన విస్ఫోటంతో సొరంగద్వారం కూలిపోయింది.

యిజారా కొండలు దద్దరిల్లిపోయాయి. క్రిందకి దొర్లుకుంటూ పోయారు ముగ్గురూ.

# 8

సూర్యుడు నడినెత్తిన మండుతున్నాడు. ఎడారి అగ్ని గోళంలా ఉంది. ప్రతీ ఇసుక రేణువూ సూర్యుడితో పోటీ పడుతోంది. చేతిలోని వజ్రాలహారాన్ని ఒకసారి ఆప్యాయంగా ముద్దుపెట్టుకొన్నాడు ఎడ్వర్డు.

ఒంటెదగ్గరకు నడిచి పైకెక్కబోతూ రైఫిల్ బోల్ట్ క్లిక్ మన్న శబ్దం విని ఉలిక్కిపడి వెనక్కితిరిగాడు.

అతని కళ్లు బైర్లు క్రమ్మాయి.

శాంసన్ చేతిలోని డబుల్ బారల్ రైఫిల్ ఎడ్వర్డు గుండెలకు గురిపెట్టివుంది. ప్రక్కనేవున్న హెర్క్యులిస్ చిన్నగా నవ్వుతున్నాడు.

ఎండిపోయిన పెదాలు నాలికతో తడుపుకొన్నాడు ఎడ్వర్డు.

"సారీ ఫ్రండ్! ఈ హారంలో నీకు వాటా ఇవ్వటం నా కిష్టంలేదు!—" పరిహాసంగా నవ్వుతూ అన్నాడు శాంసన్.

"ఇడియట్! ఇంత నమ్మకద్రోహం చేస్తావా?" అరిచాడు ఎడ్వర్డు.

"నో!...ఇది నమ్మకద్రోహం కాదు, ఈ పరిస్థితుల్లో అవకాశం దొరికితే నువ్వైనా ఇలాగే ప్రవర్తిస్తావ్!" నవ్వాడు హెర్క్యులెస్.

"వెల్...ఆ హారాన్ని ఇలా ఇచ్చి నీ దేవుడ్ని ప్రార్థించుకో..." కఠినంగా అన్నాడు శాంసన్.

జేబులో చెయ్యిపెట్టాడు ఎడ్వర్డు. మరుక్షణంలో వేగంగా బైటకుతీశాడు గన్.

"ధన్" మంది రైఫిల్. ఎగిరి క్రిందపడ్డాడు ఎడ్వర్డు. అతని గుండెల్లో దూరింది బుల్లెట్. గన్ ఎగిరిపోయింది.

శాంసన్ మెరుపులా రైఫిల్ రీలోడ్ చేసాడు. హెర్క్యులిస్ ఎడ్వర్డ్ శవంవైపు కదలబోయాడు.

"డోంట్ మూవ్! కదిలావంటే నిన్నుకూడా చంపటానికి వెనుకాడను." అరిచాడు శాంసన్ రైఫిల్ హెర్క్యులిస్ వైపు గురిపెడుతూ.

ఆదిరిపోయాడు హెర్క్యులిస్. వికటంగా నవ్వాడు శాంసన్. జాగ్రత్తగా వెళ్ళి ఎడ్వర్డ్ జేబులోని హారాన్ని తీసుకొన్నాడు.

"హెర్క్యులిస్! నా సంగతి నీకు బాగా తెలుసు. నేనెలాంటివాడినో తెలిసికూడా ఈ ఎసైన్ మెంట్ లో మెంబర్ గా ఎన్నుకోవటం ఎడ్వర్డ్ చేసిన తప్పు. నా తత్వం తెల్సికూడా నువ్వు నాతో కలవటం నీ తప్పు. పది డాలర్లకోసం పదిమంది ప్రాణాలు తీసే నేను దీనిలో నీకు షేర్ ఇస్తానని ఎలా నమ్మావ్?" పరిహాసంగా అన్నాడు.

హెర్క్యులిస్ ముఖం ఎర్రబడింది. కోపంగా పళ్ళు కొరికాడు.

"ఐ సీ! అయితే నన్నిప్పుడేం చెయ్యాలనుకొంటున్నావ్? ఎడ్వర్డులా చంపేస్తావా?" అడిగాడు బుసలు కొడుతూ.

"నో! మరీ అంత దుర్మార్గుణ్ణి కాను నేను. ఇన్నాళ్ళూ నా బెస్ట్ ఫ్రెండ్ గా ఉన్నందుకు నీకో ఛాన్స్ ఇస్తాను. అదృష్టం బాగుంటే తప్పించుకొని ప్రాణాలతో బైట పడతావ్."

"ఏమిటదీ?" కనుబొమ్మలు ముడుస్తూ అరిచాడు హెర్క్యులిస్.

"చెప్తాను! తొందరపడక!! నాతో కల్సి నిన్ను ఎడారి లోకి అలగ్జాండ్రియావైపు ఐదుమైళ్ళు తీసుకెళ్ళి వది లేస్తాను. వదిలే ముందు నీ కాళ్ళ బూట్స్ తలపై హాట్ తీసేసుకొంటాను. చాతనైతే ఎడారిలో పదిహేనుమైళ్ళు నడిచివెళ్ళి అలగ్జాండ్రియా చేరుకో. లేదా తిరిగి ఇజారా కొండలు దాటి ఇస్తమ్ పట్టణానికి వెళ్ళిపో. ఏమంటావ్?" అడిగాడు శాంసన్.

"డామిట్. నువ్వు మనిషివి కాదు. డెవిల్‌వి." గొంతు చించుకొన్నాడు హెర్క్యులిస్.

"చాన్నాళ్ళకు తెల్సుకొన్నావ్. సంతోషం."

"ఇడియట్ నిన్ను నిలువుగా విరిచి రక్తం తాగు తాను." మళ్ళా అర్చాడు.

"బ్రతికి బైటపడితే అలాగే చేద్దువుగాని. కమాన్ ఈ వంటెపైకెక్కు." రైఫిల్ జాగ్రత్తగా కదుపుతూ అరి చాడు శాంసన్.

అవకాశం దొరికితే ప్రాణం తీసేవాడిలా చూస్తూ వంటెపైకెక్కాడు హెర్క్యులిస్.

ఎడ్వర్డు శవం ప్రక్కనున్న వంటెను, తన ఒంటెను జతచేసి, హెర్క్యులిస్‌ను జాగ్రత్తగా కవర్ చేస్తూ, ముందుకు నడిపించాడు ఒంటెలను శాంసన్.

అతని భుజాన కెమెరా వ్రేలాడుతోంది.

# 9

హోటల్ ఇషారా ముందు టాక్సీ దిగి కౌంటర్ దగ్గరకు నడిచాడు శాంసన్. అతన్ని గుర్తుపట్టిన రిసెప్షనిస్ట్ చిరునవ్వుతో విష్ చేసాడు.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ సర్?" వినయంగా

అడిగాడు రిసెప్షనిస్ట్.

"రూం కావాలి." అన్నాడు శాంసన్ అతని ముఖం లోకి సూటిగా చూస్తూ.

చకచకా ఏదో లెడ్జర్ పరిశీలించాడు అతను.

"గుడ్ లక్ సర్. ఇంత క్రితం మీరున్న రూం ఇంకా ఖాళీగానే వుంది." చిరునవ్వుతో అంటూ లెడ్జర్ ముందుకు తోసాడు.

సంతకం చేసి చకచకా లిఫ్ట్ వైపు కదిలాడు శాంసన్. రూంలోకి వెళ్ళగానే డ్రస్ మార్చుకొని టైం చూసు కొన్నాడు.

గంట పదయింది. మరో రెండుగంటల్లో పాకిస్తాన్, థాయ్‌లాండ్, ఇండోనేషియాల మీదుగా ఆస్ట్రేలియా లోని సిడ్నీ వెళ్ళే ఫ్లైట్ ఉంది.

గదిలో ఫ్లోర్‌సెంట్ లాంప్ దేదీప్యమానంగా వెలుగు తోంది. కిటికీదగ్గరకు వెళ్ళి తలుపులేసాడు. 'రెడ్ సీ' పై నుంచి దూసుకొచ్చిన చలిగాలి ఒళ్ళు జలదరింప చేసింది. హార్బర్‌లో ఉన్న స్టీమర్లలో రంగురంగుల దీపాలు వెలు గుతూ ఎంతో అందంగా కన్పిస్తున్నాయి.

హెర్క్యులిస్ గుర్తొచ్చాడు. నవ్వుకొన్నాడు శాంసన్. ఈ పాటికి వాడి శవం ఏ ఎడారినక్కల గుంపుకో ఆహారం అయిపోయి ఉంటుందనుకొన్నాడు.

అరగంట గడిచింది.

డైనింగ్ రూంనించి తిరిగి తన రూంకు చేరుకొన్నాడు శాంసన్. తలుపు గడియతీసి కెమెరా విప్పి రీలు తీసుకొని బాత్‌రూంలోకి నడిచాడు, క్లీన్ చేయటానికి కావలసిన సామాన్లన్నీ తీసుకొని.

పది నిముషాల్లో తిరిగి బయటకు వచ్చాడు. అతని చేతిలో తడితడిగా ఉన్న పొడవైన రీలు గాలికి కదులుతోంది. లైట్ల కాంతిలో దానివైపు ఆసక్తిగా చూసిన శాంసన్ తృళ్ళిపడ్డాడు.

అనుమానంగా తల విదిల్చి దానివైపు మరోసారి చూసాడు. బ్లాంక్ గా ఉన్న నెగిటివ్ ఫిల్మ్ వెక్కిరిస్తూ చూసింది అతని వైపు. నేలపై విసిరికొట్టాడు దానిని. బ్రీఫ్ కేస్ తెరిచి బట్టలన్నీ సర్దుకొన్నాడు. జేబులోంచి వజ్రాలహారాన్ని తీసి ఆనందంగా దానివైపు చూసాడు. దాని విలువ ఎనభై కోట్లు. అంటే ప్రస్తుతం తనో పెద్ద కోటీశ్వరుడన్నమాట.

చకచకా బట్టలేసుకొన్నాడు. గంట పదకొండయింది. హారాన్ని ఒక జేబులోను, షాట్ గన్ మరో జేబులోనూ వేసుకొని విండోలోంచి కన్పిస్తూన్న అలగ్జాండ్రియా నగరాన్నంతా ఒకసారి చూసాడు.

'గుడ్ బై టు ఈజిప్ట్' అనుకొంటూ డోర్ వైపు అడుగు వేసాడు.

వెనకనుంచి అతని భుజంపై పొడవైన చెయ్యి పడింది. అదిరిపోతూ వెనక్కి తిరిగాడు వేగంగా.

మమ్మీ... రెండవ ఫారహ్ శవం... నిలబడివుంది నవ్వుతూ. శాంసన్ కు ఊపిరి ఆగిపోయింది. అనుకోకుండా వెనక్కి అడుగు వేసాడు.

తన పొడుగైన చేతులు చాస్తూ మరో అడుగు ముందుకు వేసింది మమ్మీ. మిల్కాఖాన్ గుర్తుకొచ్చాడు శాంసన్ కు.

గజగజా వణికిపోయాడు ఆకులాగ. 'నో. నేను చావను. నాకు అలాంటి చావు రాకూడదు.' వెనకడుగు వేసి షాట్ గన్ తీసి కాల్చడం మొదలెట్టాడు.

పకపక నవ్వుతూ ముందుకొస్తూంది. షాట్‌గన్‌లోంచి వెలువడుతున్న బుల్లెట్స్ పారహ్ శరీరాన్ని తాకి క్రిందకి పడుతున్నాయ్.

పిచ్చిగా ప్రేలుస్తున్నాడు షాట్‌గన్‌ని, బుల్లెట్స్ శబ్దం విని ఎవరైనా వస్తారేమో అనే ఆశతో. మమ్మీని చూస్తున్న భయంలో దానికి సైలెంసర్ అమర్చిన విషయాన్ని మర్చిపోయాడు శాంసన్.

ఆగిపోయాడు విండో పీపుకు అడ్డుతగిలి. పారహ్ నవ్వుతూ దగ్గరకొస్తున్నాడు తనని కిటికీలోంచి విసిరి పారెయ్యటానికి. పాతిక అంతస్తుల పైనుంచి క్రిందకి చూస్తూంటే కళ్లు తిరిగాయి శాంసన్‌కు.

శాంసన్ దగ్గరకొచ్చాడు మమ్మీ. చేతులు శాంసన్ నడుం చుట్టూ బిగించబోయాడు. మొండిధైర్యంతో ప్రక్కకి కదిలాడు శాంసన్. తూలి కిటికీపై పడింది మమ్మీ.

ఆ అవకాశాన్ని వినియోగించుకొన్నాడు శాంసన్. చటుక్కున గొంతుకూర్చుని మమ్మీ కాళ్ళ చుట్టూ చేతులు బిగించాడు. చల్లగా ఐసుగడ్డల్లా ఉన్నాయి కాళ్ళు.

బలంగా పైకి ఎత్తాడు. కదలలేదు మమ్మీ. కిటికీ పైనుంచి లేవబోతూండగా ఊపిరి బిగబెట్టి శరీరంలోని శక్తినంతా చేతుల్లోకి తెచ్చుకొంటూ మమ్మీ కాళ్ళను పైకి నెట్టేశాడు శాంసన్.

అరక్షణం ఊగిసలాడాడు పారహ్. తేరుకొని విండోను పట్టుకోబోయేంతలో గాలిలోకి కిటికీలోంచి బయటకు దూసుకుపోయాడు.

బరువుగా ఊపిరి పీల్చాడు శాంసన్. అతని ముఖంలో చావుకళ తప్పింది. కర్చీఫ్‌తో ముఖం తుడుచుకొని బ్రీఫ్

కేస్ అందుకొని వేగంగా వెళ్ళి తలుపు తీస్తూ కొయ్యబారి పోయాడు.

అతని చెయ్యి అప్రయత్నంగా పాకెట్ వైపు ప్రాకింది.

# 10

"డోన్ట్ మూవ్ ఫ్రండ్" రివాల్వర్‌ను నుదుటిపై నొక్కి శాంసన్‌ను నెట్టుకొంటూ లోనికి ప్రవేశించాడు హెర్క్యులిస్.

అతని పెదవులపై విషపు నవ్వు కదులాడుతోంది. అతని ముఖం భీకరంగా వుంది.

"ఎక్కడా హారం?" క్రూరంగా అడిగాడు.

"చెప్పను!" అన్నాడు శాంసన్.

"నీ చేత ఎలా చెప్పించాలో నాకు తెలుసు." అర చేతో కసిగా శాంసన్ ముఖంపై చరిచాడు. బాధగా అరుస్తూ ఎగిరి గది మధ్య పడ్డాడు శాంసన్.

అతని ముఖమంతా రక్తసిక్తమయింది. ఊహించనంత వేగంతో గన్ బయటకు లాగాడు. హెర్క్యులిస్ చేతిలో రివాల్వర్ పేలింది. గన్ ఎగిరిపోయింది.

"పిచ్చిపిచ్చి వేషాలేస్తే ముందే చంపేస్తా. ఏదీ ఆ హారం?" అరిచాడు హెర్క్యులిస్ గన్ అందుకొని జేబులో వేసుకొంటూ.

ఉన్న ఒక్క అవకాశంకూడా పోయింది శాంసన్‌కు. చేతిలో ఆయుధంలేకుండా హెర్క్యులిస్‌తో కలబడడం అంటే తను తవ్వుకొన్న గోతిలో కావాలని దూకటం లాంటిదని శాంసన్‌కు తెలుసు. అర నిముషంలో శరీరం లోని అవయవాలు కన్పించకుండా చేసేస్తాడు హెర్క్యులిస్.

"చెప్తాను...కాని ముందు నువ్వెలా ఎడారిలోంచి తప్పించుకొన్నావో చెప్పు?" అడిగాడు లేచి కూర్చోవటానికి ప్రయత్నిస్తూ.

గంభీరంగా నవ్వాడు హెర్క్యులిస్.

"కేవలం నా అదృష్టం బాగుండి బ్రతికి బైటపడ్డాను. లేకపోతే నువ్వు చేసిన ద్రోహానికి అక్కడే చచ్చి వుండేవాడిని. దారిలో నన్నొదిలేసి నువ్వెళ్ళిపోయాక ఇస్తమ్ వైపు పరుగుతీశాను. కాని నా అదృష్టంకొద్దీ పావుగంట గడిచీ గడివకముందే ఒక ఒంటె అటువైపు వస్తూ కన్పించింది.

తీరా చూస్తే అది మనం తీసుకెళ్ళిన ఒంటే. సారంగాన్ని కూర్చేసే కంగారులో నాలుగు ఒంటెలలో ఒకటి తప్పిపోవటం మనం గమనించలేదు. తిరిగి వెళ్ళేటప్పుడు కూడా నువ్వు ఆ ఒంటి సంగతి పట్టించుకోక రెండు ఒంటెలతోటే అలగ్జాండ్రియా వెళ్ళిపోయావు. ఆ ఒంటెతోటే నీ వెనకే వచ్చేశాను నేనుకూడా. నేను ఇసుకలో నడుస్తూ ప్రయాణంచేసింది పావుగంట మాత్రమే. ఆ పావుగంటను నా జీవితంలో మరువలేను. ఆ పావుగంట ప్రతీ క్షణం నరకాన్ని అనుభవించాను నేను." కసిగా అన్నాడు.

అతని పాకెట్‌లో కాంతులు వెదజల్లుతోన్న హారం హెర్క్యులిస్ కళ్ళబడింది. రివాల్వర్ జేబులోకి తోసి ముందుకు వంగి శాంసన్ పీక పట్టుకొని పైకి లేపాడు. అతని దగ్గరనుంచి వజ్రాలహారాన్ని లాక్కొని తన జేబులోకి తోశాడు.

"హెర్క్యులిస్...ప్లీజ్...నన్నొదిలెయ్..." దీనంగా అడుగుతున్నాడు శాంసన్.

"సారీ ఫ్రెండ్!" నవ్వాడు హెర్క్యులిస్. "నన్ను చంపటానికి ప్రయత్నించినవాళ్ళని బ్రతకనివ్వటం నాకు చేతకానిపని." అంటూ మరో చెయ్యి నడుంచుట్టూ బిగించి కిటికీలోంచి బయటకు విసిరేసాడు శాంసన్‌ను.

శాంసన్ 'చావుకేక' హార్బర్‌లో ప్రతిధ్వనించింది.

తృప్తిగా నిట్టూరుస్తూ డోర్ వైపు తిరిగాడు హెర్క్యులిస్. అతని గుండెల్లో డైనమేట్ ప్రేలింది.

వేయబడి ఉన్న డోర్‌ను ఆనుకొని హెర్క్యులిస్ వైపు నవ్వుతూ చూస్తూంది మమ్మీ... రెండవ పారహ్ మమ్మీ...

అప్రయత్నంగా నాలుగడుగులు వెనక్కి వేశాడు హెర్క్యులిస్. తలుపుదగ్గరనుంచి ముందుకు వచ్చింది మమ్మీ. ప్రక్కకి నడిచాడు హెర్క్యులిస్. అతనివైపు కదులుతూ తలుపుదగ్గరనుంచి ప్రక్కకు తప్పుకొన్నాడు పారహ్.

మరుక్షణం డోర్ వైపు పరుగుతీశాడు హెర్క్యులిస్. మెరుపులా అడ్డురాబోయేడు పారహ్. ఊహించనంత వేగంతో పిడికిలి బిగించి అడ్డువస్తూన్న మమ్మీ ముఖంపై బలంగా గుద్దుతూ బయటకు దూకాడు.

అనుకోని ఆ పరిణామానికి మమ్మీ అరక్షణంపాటు తృళ్లిపడ్డాడు. తేరుకొనేలోగా బైటనుంచి గడియపెట్టి మెట్లవేపు పరుగుతీశాడు హెర్క్యులిస్.

ఐదు నిముషాలలో క్రిందకి చేరుకొని హోటల్ బైట కొచ్చాడు, రోడ్డంతా నిర్మానుష్యంగా ఉంది. హోటల్ ఇవారా బైటనించి లైట్లు డిమ్‌గా వెలుగుతున్నాయి.

గంట చూసుకున్నాడు. పన్నెండుకు ఐదు నిముషాలుండి. జేబులోని ప్లేన్ టికట్ నొకసారి తడుముకొని

అటువైపు దూసుకుపోతున్న బేబే టాక్సీని పిలిచాడు.

గిర్రున రివర్స్ గేర్‌లో వెనక్కి తిరిగివచ్చి అతనిముం దాగింది టాక్సీ. బాక్ డోర్ తెరుచుకొని లోపల కూల బడుతూ "ఎయిర్‌పోర్టుకు పోనీ!" అన్నాడు.

ముందుకు దూకింది టాక్సీ.

అలగ్జాండ్రియా ఎయిర్‌పోర్టులో టాక్సీ ఆగింది. ఫేర్ చెల్లించి ముందుకు పరుగెత్తాడు. అప్పుడే ఎయిర్‌పోర్టులో పైకి లేచిన 'లండన్ టు సిడ్నీ' ఫ్లైట్ ఆస్ట్రేలియా వైపు దూసుకుపోయింది.

కళ్ళలో నీళ్ళు తిరిగాయి హెర్క్యులిస్‌కు. ఈ దేశం నుంచి బయటపడటానికి ఉన్న అవకాశం దాటిపోయింది.

ఎలాగయినా తనా దేశంనుంచి పారిపోవాలి. అర క్షణం కూడా అక్కడుండకూడదన్పిస్తోంది. ఏ క్షణంలో ఏ ప్రమాదముస్తుందో! తిరిగి జీవితంలో యీ ఈజిప్టు వైపు కన్నెత్తికూడా చూడకూడదు.

'కాని ఎలాగ?...ఇక్కడనుంచి పారిపోవటం ఎలా??...పిశాచంలాంటి ఈ మమ్మీ చేతుల్లోంచి ప్రాణాలతో తప్పించుకోవటం ఎలా???' ఆలోచనలతో తల బ్రద్దలౌతూంది.

ఎయిరోడ్రోం చేరుకున్నాడు హెర్క్యులిస్. ఆలో చనలతో గిరగిరా అతని మెదడులో ఏదో మెరుపు మెరి సింది. మరుక్షణం అతని ముఖం వికసించింది.

'అవును! అదే దారి. రిస్క్ వున్నా తప్పదు.' అను కొంటూ ఎయిర్‌పోర్ట్ బిల్డింగ్స్ వెనకనుంచి పరిగెత్తు కొంటూ వెళ్ళి కొంచెం దూరంలోవున్న మిలటరీ స్పెషల్ ఎయిర్ ఫీల్డ్ చేరుకున్నాడు.

రన్ వే పై వరుసగా నిలబడి వున్నాయి రకరకాల వార్ ప్లేన్స్. అక్కడక్కడా సోల్జర్స్ తిరుగుతున్నారు. గదుల్లో కూర్చొన్న ఆఫీసర్స్ నీడలు కిటికీలోంచి బైట పడుతున్నాయ్.

చీకట్లో బిల్డింగ్ ప్రక్కనుంచి శబ్దంకాకుండా ఫెన్సింగ్ దూకి 'రన్ వే' పై ప్రవేశించాడు. ప్రక్కనే వున్న మరో ఎయిర్ పోర్ట్ లో ఏదో పాసింజర్ విమానం చెవులు చిల్లులు పడేలా రొద చేస్తూ గాల్లోకి లేచింది.

సందేహించలేదు హెర్క్యులిస్.

ఒక్క పరుగులో వెళ్ళి వార్ ప్లేన్స్ దగ్గరకు చేరు కొన్నాడు. 'ఇండియన్ నాట్స్', 'అమెరికన్ శాబర్ జెట్స్,' 'రష్యన్ మిసైల్స్' విరివిగా కన్పిస్తున్నా యక్కడ.

చటుక్కున కాబిన్ లోకి దూకాడు హెర్క్యులిస్. సిగరెట్స్ కాల్చుకొంటూ కబుర్లు చెప్పుకొంటూన్న పైలట్స్ ఇద్దరూ కంగారుగా లేచారు అతన్ని చూసి.

హెర్క్యులిస్ చెయ్యి జేబులో దూరింది. మరుక్షణం బయటకు లాగుతూ టపటప కాల్చేశాడు గన్ తో సందే హించకుండా. శవాలని బయటకు నెట్టి డోర్ లాక్ చేశాడు. ఇంజన్ స్టార్ట్ చేస్తూ ఫ్యూయల్ టాంక్ వైపు చూసాడు. నిండుగా ఉంది ఫ్యూయల్.

పెద్ద గొంగళిపురుగులా ముందుకి కదిలింది నాట్ విమానం. ఎయిర్ పోర్ట్ బిల్డింగ్స్ లోంచి సోల్జర్స్ కేకలు పెట్టుకొంటూ ప్లేన్ వైపు పరిగెత్తుకొస్తున్నారు.

బిగ్గరగా నవ్వుతూ ముందుకు పోనిచ్చాడు ప్లేన్ ను.

స్టూడెంట్ గా వుండేటప్పుడు సరదాగా యూని

వర్సల్ క్లబ్‌లో చేరి నేర్చుకొన్న ప్లేన్ డ్రైవింగ్ ఉపయోగపడుతోందిప్పు డతనికి.

రన్ వేపై పరిగెడుతోన్న ప్లేన్ గాల్లోకి లేచింది. ఇన్ స్ట్రుమెంట్ పానల్ వైపు దీక్షగా చూస్తూ స్పీడో మీటర్‌ను పెంచ్చించాడు హెర్క్యులిస్.

అలగ్జాండ్రియా పట్టణాన్ని దాటి 'రెడ్ సీ' పై ఎగురు తోంది ప్లేన్. క్రిందనుంచి లేస్తూన్న శాబర్ జెట్స్ మిసైల్స్ కన్పిస్తున్నాయి కిటికీలోంచి.

మాగ్జిమమ్ స్పీడుకు ఫిట్ చేసి విశ్రాంతిగా వెనక్కి వాలాడు. వెంటాడుతున్న వార్ ప్లేన్స్‌లోంచి రకరకాల ప్రేలుళ్ళు విన్పిస్తున్నాయి.

అవి ఎంత వేగంగా ప్రయాణించినా తమ మధ్యనున్న దూరాన్ని తగ్గించుకొంటూ 'నాట్' దగ్గరకు చేరుకో డానికి ఖచ్చితంగా పదినిముషాలు పైన పడుతుంది. ఈ లోగా 'రెడ్ సీ'ని దాటి పారాచూట్‌తో అరేబియాలోకి దూకెయ్యవచ్చు అనుకొంటూ హారంకోసం జేబులో చెయ్యిపెట్టాడు.

గుండె జల్లుమంది హెర్క్యులిస్‌కు.

కంగారుగా రెండు జేబులూ వెతుక్కున్నాడు. ఖాళీ జేబులు వెక్కిరిస్తూ నవ్వాయ్. పిచ్చిగా జుట్టు పీక్కు న్నాడు.

వెనకనుంచి చిన్నగా నవ్విన్పించింది. తృళ్ళిపడుతూ తిరిగి చూసాడు.

'నుమ్మీ... రెండవ పారహ్ మమ్మీ...' నవ్వుతూ నిలబడి చూస్తూంది. దాని మెడలో వ్రేళ్ళాడుతోన్న వజ్రాల హారం కాంతులు వెదజల్లుతోంది. పళ్ళికిలిస్తూ

హెర్క్యులిస్ వైపు చూస్తూన్నాడు మమ్మీ.

తన జేబులోని ఆ హారం మమ్మీ మెడలోకి ఎలా వెళ్ళిందో అర్థం కాలేదు హెర్క్యులిస్‌కు.

కోపంతో పిచ్చివాడయ్యాడు అతను. ఇంజన్ వదిలి మమ్మీపైకి దూకాడు గట్టిగా అరుస్తూ. పారహ్ మరింత వికటంగా నవ్వుతూ చేతులు ముందుకు చాచాడు.

హెర్క్యులిస్ కండలు పొంగాయి. ఛాతీ రెండింత లయింది. గుప్పెళ్ళు బిగుసుకొన్నాయి. మమ్మీ ముఖంపై బలంగా చరిచాడు.

మమ్మీ కొంచెంకూడా తొణకలేదు. మరోసారి గుద్ద బోయాడు హెర్క్యులిస్. మధ్యలోనే అతని చేతిని విరిచిపట్టుకొని రెండో చేత్తో గడ్డంక్రింద గుద్దాడు పారహ్.

హెర్క్యులిస్ దవడ ఎముకలు పటుక్కుమన్నాయ్. కళ్ళముందు చీకట్లు క్రమ్మాయి.

లేవబోతున్న హెర్క్యులిస్‌ను ఒకచేత్తో పట్టుకొని తేలికగా పైకెత్తింది మమ్మీ. రెండుచేతులూ మమ్మీ పీకచుట్టూ బిగించబోయాడు హెర్క్యులిస్.

మమ్మీ రెండో చేయి గాల్లోకి బలంగా లేచింది. మరు క్షణం వినురుగా వెళ్ళి హెర్క్యులిస్ తలపై బలంగా మోదింది.

దిశలు దద్దరిల్లేంత గట్టిగా చావుకేక వేశాడు హెర్క్యులిస్. పల్టీలు కొడుతూ సముద్రంపైకి కూలిపోతోన్న ప్లేన్‌లో ఆ ఆర్తనాదం ప్రతిధ్వనించింది. తల రెండుగా పగిలి మెదడు బైటకొచ్చింది. రక్తం ధారలుగా కారు తోంది.

కొనఊపిరితో గింజుకొంటున్న హెర్క్యులిస్‌ను కిటికీ

పైకి విసిరాడు మమ్మీ. కిటికీఅద్దాలు బ్రద్దలు చేసుకొని బయటకు దూసుకుపోయింది హెర్క్యులిస్ శవం.

మమ్మీ గట్టిగా నవ్వాడు. అతని జీవంలేని కళ్ళలో తృప్తి కదులాడింది.

ఏటవాలుగా కూలిపోతోన్న నాట్ ప్లేన్ సముద్రాన్ని తాకుతూ భయంకరంగా ప్రేలిపోయింది.

అప్పటివరకూ 'నాట్'ను వెంటాడుతోన్న వార్ ప్లేన్స్ ఈజిప్టువైపు మరలాయి.

-: ఐపోయింది :-

# ఆఖరి క్షణం!

## టెంపోరావ్

తులసి తనభర్త ప్రొఫెసర్ రాజారావువైపు చూసింది. సూటు ధరించి అతను తల దువ్వుకుంటున్నాడు. గోడ గడియారం మీదకు ఆమె చూపు వెళ్ళింది. టైమ్ పదవుతోంది!

"ఎక్కడికేనా వెళ్తున్నారా?" అందామె.

"నీతో చెప్పి వెళ్ళాలా?" అన్నాడతను ఆమెకేసి విసుగ్గా చూస్తూ.

"నేను చెప్పి వెళ్ళాలనలేదుగా!"

అతను సిగరెట్ వెలిగించి పొగపీలుస్తూ అద్దంలో తన రూపాన్ని చూసుకున్నాడు. వెనక్కి తిరిగి గుమ్మంవైపు నడిచి ఆమెముందు ఆగాడు.

"తొందరగా వచ్చేస్తారుగా?"

"చెప్పలేను. నువ్వు హాయిగా పడుకో!" అని అతను నడవమ్మట మెట్లవైపు గబగబా కదిలాడు.

ప్రొఫెసర్ రాజారావు వయస్సు నలభై వుంటుంది. పేరు ప్రఖ్యాతులున్న విల్సన్ కాలేజిలో పనిచేస్తున్నాడు. రెండువేలు పైన ప్రతి నెలా గడిస్తున్నాడు. కాని భార్యతో అతని జీవితం సుఖంగా సాగడంలేదు!

తులసి పాతకాలపు మనిషి. పూజలుచేస్తూ, దేవాలయాలకు వెళ్ళి తిరిగివస్తూ ఆమె కాలాన్ని గడిపేస్తూ వుంటుంది. ఆమె ఎక్కువగా చదువుకోలేదు. భర్తతో ఇంగ్లీషులో వుషారుగా మాట్లాడలేదు.

పదేళ్ళ క్రితం అతనామెను పెళ్ళాడవలసి వచ్చింది. ఎమ్మే పాసయిన అతనికి ఎంత వెతికినా వుద్యోగం దొరకలేదు. తులసి తండ్రి అతనికి సిఫార్సుచేసి కాలేజిలో వుద్యోగం ఇప్పించాడు. ఆ వుద్యోగంకోసం అతను ఆమె భర్త కావలసి వచ్చింది.

అతనికి నచ్చినా నచ్చకపోయినా పదేళ్ళనుంచి అతను తులసితో సంసారం సాగిస్తున్నాడు. ఆమె తండ్రి మరణించాడు. కూతుర్కి తండ్రి ఆస్తి బాగా వచ్చింది. ప్రస్తుతం ఆమెకు దగ్గరచుట్టాలెవ్వరూ లేరు.

ప్రొఫెసర్ రాజారావు ఫియట్ కారును స్పీడుగా పోనిస్తున్నాడు. చల్లటి గాలి వీస్తోంది. ఆకాశంలో చంద్రుడు అఖండంగా ప్రకాశిస్తున్నాడు.

హెడ్ లైట్ల కాంతిలో బస్టాప్ లో వున్న యువతిని అతను చూసి కారును ఆపాడు. ఆమె తలుపు తెరిచి అతనిప్రక్కనే కారులో కూర్చుంది. అతను కారును పోనిచ్చాడు.

"జయా, ఐయాం సారీ! పదినిమిషాలు లేటుగా వచ్చాను," అన్నాడతను.

ఆమె అతని దగ్గరగా జరిగింది. అతని కాలుమీద చెయ్యి వేసింది.

"వచ్చావుగా! రాజా, డోంట్ బాదర్!" అందామె.

ఇరవై ఏళ్ళ యువతి. ఎమ్మే చదువుతోంది! అతని స్టూడెంట్!

"ఎక్కడకి వెళ్దాం?" అన్నాడతను.

"బీచ్ కి వద్దు. పోలీసులు చుట్టూ తిరుగుతూవుంటారు," అంది జయ.

"నైట్ క్లబ్ కి పోదాం," అన్నాడతను.

# 2

పారడైజ్ నైట్ క్లబ్ లో ఎదురెదురుగా కూర్చున్నారిద్దరూ. చుట్టూ చీకటిగా వుంది. ఫ్లష్ లైట్ల కాంతిలో కాబ్రే డాన్స్ చేస్తూన్న మిస్ షమీలా అవయవాలు అందరికీ కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నాయి. విదేశాల్లో శిక్షణపొంది తిరిగొచ్చిన మిస్ షమీలా చలాకీగా ఎగురుతోంది, గిర్రున తిరుగుతోంది, వెనక్కి వంగి తన స్తనాల సంపదను ప్రదర్శిస్తోంది. ఆర్కెస్ట్రా శ్రావ్యంగా మ్రోగుతోంది.

ప్రొఫెసర్ రాజారావు ఆమె చెయ్యి పట్టుకుని నిమిరాడు. గ్లాసులోని విస్కీ త్రాగేసి ముందుకు వంగిన ఆమె పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"రాజా, ఇలా ఎంతకాలం క్లబ్బుల్లోనూ, బీచ్ ఒడ్డునా కాలం గడుపుతాం?" అందామె.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను!" అన్నాడతను.

ఆమె అతని చేతుల్ని పట్టుకుంది.

"రాజా, నన్నెక్కడికేనా తీసుకుపో! ఒకగదిలో మనిద్దరంమాత్రం వుండాలి! నీ ఒళ్లో తలెట్టుకుని నేను పడుకోగల్గాలి," అంది జయ.

డాన్స్ పూర్తయింది. లైట్లు వెలిగాయి. నైట్ క్లబ్ లో వందమంది వున్నారు. రాజారావు నలువైపులా చూశాడు. తనకు తెలిసినవాళ్ళవరూ లేనందుకు అతను సంతోషించాడు.

బాటిల్లోని విస్కీని అతను గ్లాసులో పోసుకుని, కొంచెం సోడా కలిపాడు. విస్కీ చప్పరిస్తూ ఆమెకేసి చూశాడు. జయ అప్సరసలా వుంది. కోలముఖం, విశాల నేత్రాలు, బంగారంలాంటి శరీరచ్ఛాయ. చెవులకు పెద్ద రింగులు వేళ్ళాడుతున్నాయి. మెళ్లో ఒకే పేట గొలుసుంది.

"జయా, బెంగుళూరు పోదాం. నాకు ఈ నెలాఖరులో సెలవులిస్తారు. వారం రోజులపాటు అక్కడ ఏ హోటల్లోనో వుండి, స్వర్గంలో విహరించి, తిరిగిరావచ్చు!" అన్నాడతను.

"తిరిగి వచ్చి నరకంలో పడాలి," అన్నదామె.

అతను నవ్వుతూ ఆమెకేసి చూశాడు. జయ కోక్ ను మెల్లిగా తాగుతోంది.

"రాజా, శాశ్వతంగా ఇలా దొంగచాటుగా మనం కల్సుకోవలసిందేనా?" అడిగిందామె.

అతను జవాబివ్వలేదు. ఆమెకేసి చూస్తూ వుండిపోయాడు. జయ! గతంలోంచి ఏవేవో అతనికి జ్ఞప్తికొస్తున్నాయి.

జీవితంలో విసుగెత్తి అతనొక రాత్రి బీచ్ కి ఒంటరిగా వెళ్ళాడు. పడవకు జార్లాబడి ముందుకొస్తున్న కెరటాలను

చూస్తున్నాడు.

ఎదురుగా ఎవరో యువతి కాళ్ళు కడుక్కుం టోంది. చీర కుచ్చెళ్ళను ఎత్తిపట్టుకుంది. ఆమె పాదాలు, పిక్కలు చంద్రకాంతిలో అతడికి కనిపిస్తున్నాయి. కాస్సేపట్లో వెనక్కి తిరిగివస్తూ ఆమె అతనివైపు చూస్తూ, "ప్రొఫెసర్, మీరా!" అందామె.

"హలో జయా!" అన్నాడతను.

ఇద్దరూ గంటసేపు మాట్లాడుతూ ఇసుకలో కూర్చుండి పోయారు. చంద్రకాంతి అద్భుతంగా వుంది.

అతను టైమ్ చూశాడు. ఎనిమిదైంది.

"నువ్వు ఇంటికి వెళ్ళాలా?"

"సినిమాకు వెళ్ళి ఆలస్యంగా వస్తానని చెప్పాను," అందామె.

"అలా నైట్ క్లబ్ కి పోదాం, పద. తర్వాత మీ ఇంటి దగ్గర దిగబెడ్తాను," అన్నాడతను.

"ఫైన్, ఐయామ్ రెడీ! చీర తడిసింది. ఫరవా లేదుగా?" అడిగిందామె.

"వెట్ క్లోత్స్ యీ రోజుల్లో ఫాషన్ గా?" అన్నాడతను నవ్వుతూ.

ఆమె అతని పక్కనే ఇసుకలో నడుస్తోంది. సముద్రపు గాలి వీస్తోంది. ఆమె శరీరం అతనికి రాసుకుంటోంది. ఓరగా ఆమెను చూశాడతను. హుషారైన యువతి! ఆమె పక్క మాట్లాడుతూ నడుస్తూంటే తనకు కూడా యవ్వనం మళ్ళా వచ్చిందేమో అనిపించింది.

యువకుడిలా అతను ఏవేవో తన తీయటి కంఠంతో ధారావాహికంగా చెప్తున్నాడు. ఎంత చక్కగా మాట్లాడతాడతను అనుకొంది జయ. అతను తలుపు తెరిచి ఆమె

కూర్చోగానే మూశాడు. తన సీటులో కూర్చొని కారును పోనిచ్చాను.

మానసికంగా యవ్వనదశలో వుండగలిన మనిషి నూరేళ్లు నిండినా యువకుడే; ఇప్పుడు ఆ స్థితిలో వున్నాడతను.

కారును వేగంగా పోనిస్తున్నాడు.

"ప్రొఫెసర్ సార్!" అందామె.

అత నామె నడుంచుట్టూ చెయ్యిని పోనిచ్చి దగ్గరగా లాక్కున్నాడు.

"జయా, నన్ను సార్ అనకు! రాజా అని పిలు!" అన్నాడతను.

అతని చేతివేళ్ళు ఆమె పొట్టను నిమురుతున్నాయి' ఆమె విదిలించుకోలేదు. హుషారుగా, నవ్వుతూ అతనికి దగ్గరింది!

అతను గతంలోంచి మేలుకున్నాడు.

"రాజా, నా ప్రశ్న విన్నావా?"

"విన్నాను," అని గ్లాసులోని విస్కీని అతను ఖాళీ చేశాడు.

లైట్లు ఆరిపోయాయి. మిస్ షమీలా మళ్ళా ఫ్లడ్ లైట్లముందుకు వచ్చింది. ఆమె నాట్యం చేస్తూంటే ఆమె స్తనాలు బంతుల్లా ఎగురుతున్నాయి. అతను జయ చెయ్యి పట్టుకొని చీకట్లో ఆమె గొంతుమీద ముద్దెట్టుకున్నాడు.

"మొదట బెంగుళూరు వెళ్దాం. అక్కడికి కెళ్ళాక నీ ప్రశ్నకు సమాధానం కనుక్కుందాం," అన్నాడతను.

నైట్ క్లబ్ చీకట్లో ఇద్దరూ దగ్గరయ్యారు. ఆమెను అనేకచోట్ల ముద్దెట్టుకున్నా డతను.

"రాజా, నిన్ను ఒక్క క్షణంకూడా విడిచి నేనుండ లేను," అంది జయ.

# 3

ప్రొఫెసర్ రాజారావు ముస్తాబై, బాగ్ను పరుపు మీద పడేసి యటాచ్డ్ బాత్రూమ్‌లోకి వెళ్ళాడు.

తులసి గదిలోకొచ్చి పరుపుమీదున్న అతని బాగ్ను తెరిచింది. అతని డైరీ కవర్లో వున్న యువతి ఫోటోను ఆమె చూసింది. 'విత్ లవ్, జయ' అని కింద రాసివుంది. ఎవరీ జయ ?

ఆమె డైరీని వదిలేసి అతని పర్సులోంచి రెండు రూపాయలు తీసుకుంది. రాజారావు పడగ్గదిలోకి వచ్చాడు. ఆమె కేసి ఆక్షేపణగా చూశాడు.

"ఆ బాగ్లో నీ వస్తువులేమీ లేవే!" అన్నాడతను.

"మీ పర్సులోంచి రెండురూపాయలు తీసుకున్నాను" అందతని భార్య.

"అడిగితే నేనే ఇచ్చేవాడినిగా!"

"రెండు రూపాయలు అడగాలని నాకు తెలియదు!"

అతను ఆమెకేసి కోపంగా చూశాడు.

"తులసీ, నీ తండ్రి నాకు ఉద్యోగం యిప్పించి వుండొచ్చు. అది మన తాతలనాటి కథ. నీదే పైచెయ్యి అన్నట్లు యీ ఇంట్లో ఇటుపైన సంచరించకు! ఎప్పుడూ ఆ బాగ్ను నువ్వు, అమాటకొస్తే ఎవ్వరూ ముట్టుకో కూడదు!" గద్దించాడతను.

"నన్ను క్షమించండి!" అందామె.

అతని పర్సులోంచి తీసుకొన్న రెండు రూపాయిలూ పరుపు మీద పడేసి ఆమె వెళ్ళబోయింది.

"ఆ డబ్బు తీసుకో!"

"వద్దు. నా బ్యాంక్ అకౌంట్‌లో చాలా డబ్బుంది" అందామె.

తులసి గబగబా తన గది వైపు వెళ్ళిపోయింది. అతను మెట్లు దిగి, ఇంటి ముందున్న ఫియట్ కార్లో కూర్చుని తలుపు మూశాడు.

కాలేజి వైపు కారు స్పీడుగా వెళ్తోంది. ప్రొఫెసర్ రాజారావు ఆలోచిస్తున్నాడు. తన భార్య బాగ్‌లో వున్న జయ ఫోటోను చూసి వుంటుందా? తను బాత్ రూమ్‌లో ఎక్కువసేపు వుండలేదు. భార్య అన్న మాటలు అతనికి జ్ఞాపకమొచ్చాయి. ఆమె బ్యాంకి అకౌంటులో చాలా డబ్బు వుంది. సంవత్సరాలు దొర్లుతున్నకొద్దీ అతని ఆదాయం పెరిగింది. ఆమె ఆ స్తిలోకి చెయ్యి దూర్చకుండా అతను జీవించగల్గుతున్నాడు. అందువలన ఆమె ఆస్తిని గురించి అతను మర్చిపోయాడు.

కాలేజి కాంపౌండులోకి కారు వెళ్ళింది. కారును షెడ్‌లో పెట్టి అతను స్టాఫ్ రూమ్స్ వైపు హుషారుగా అడుగు వేశాడు.

## 4

లత అండ్ లాల్ ఆఫీసు గదిలో లత తన కుషన్ కుర్చీలో కూర్చుని వుంది. గొంతుచుట్టూ వురితాడులా మఫ్లర్ చుట్టుకుంది. దగ్గు, రొంపలతో ఆమె బాధ పడుతోంది.

పక్క గదిలోంచి లాల్ సిగరెట్ పీలుస్తూ వచ్చి ఆమె కెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. కళ్ళద్దాల్లోంచి శత్రువును చూసినట్లు ఒకసారి అతడిని చూసి ఆమె తన పనిలో మునిగిపోయింది.

లాల్ చిరునవ్వుతో ఆమెనే గమనిస్తున్నాడు. లత దగ్గసాగింది. రుమాల్తో ముక్కును తుడుచుకుంది.

"లతా, కాఫ్ అండ్ కోల్డుతో బాధ పడుతున్నావు!" అన్నాడు లాల్.

"నన్ను చూసేవాళ్ళు బాధపడుతున్నారేమో!" అంది ఆమె.

"డాక్టర్ ఫాక్స్‌ని కలుసుకున్నావా?"

"దీనికి డాక్టర్ అనవసరం. వేస్ట్ ఆఫ్ మనీ! రెండు మూడు రోజుల్లో అదే సరవుతుంది," అంది లత.

ఆమె మళ్ళా దగ్గసాగింది.

"మెషిన్‌గన్ మోతలా వుంది నీ దగ్గు! డాక్టర్ ఫాక్స్‌ని అడిగి ఇది టి. బి. కి దారి తీయదని తెల్సుకోవడం మంచిది."

"షటప్, యూ డర్టీ మైండెడ్ రోగ్! నాలాంటి వాళ్ళకు టి. బి. రాదు. ఐ యామ్ హేల్ అండ్ హెల్దీ!" అర్చిందామె.

లాల్ సిగరెట్‌ను యాష్ట్రేలో పడేశాడు.

"లతా! హియర్ మీ! డబ్బు ఖర్చవుతుందని భయపడి డాక్టర్ ఫాక్స్ దగ్గరకు వెళ్ళడం మానుకోకు. తర్వాత ఇస్తామంటే అతను ఓ. కె. అంటాడు!" అన్నాడు లాల్.

ఆమె అతని వైపు సూటిగా చూసింది. ఏదో చెప్పబోయి దగ్గడం మొదలెట్టింది. టేబుల్ మీదున్న రెండు కాగితాలు ఎగిరి కింద పడ్డాయి.

"గుడ్ హెవెన్స్, నువ్వు దగ్గితే కాగితాలు ఎగిరి కింద పడుతున్నాయి. మరికొన్ని రోజులుపోతే రోగం ముదిరి నీ ఎదురుగా కూర్చున్నవాళ్ళు నువ్వు దగ్గగానే వాల్మీకిలా వెనక్కి పడ్తారు." ఏడిపించాడు లాల్.

"యూ డర్టీ రాట్ లాల్! నాకు ఏ రోగం లేదని నేను చెప్తున్నాను. డాక్టర్ ఫాక్స్ సర్టిఫికెట్ నా కక్కరలేదు. డాక్టర్ ఫాక్స్ నీలాంటి రోగే. అయిదు రూపాయిలు చేతిలో పెడితే బతికున్న మనిషికి అతను డెత్ సర్టిఫికెట్ ఇస్తాడు. రాస్కెల్స్ ఆల్!" అర్చిందామె.

బయట జోళ్ల చప్పుడైంది. ఒక స్త్రీ గదిలోకొచ్చింది. ఆమెను కూర్చోమని తను లాల్ వైపు తిరిగింది.

"లాల్, నీ గదికి వెళ్ళు. డూ సమ్ వర్క్! ఐడిల్‌గా కూర్చుంటే ఆమ్లెట్లు రావు!" అర్చిందామె.

"యూ స్టింకింగ్ బిచ్!" అని లాల్ పక్క గదిలో వున్న తన టేబుల్ దగ్గరకు వెళ్ళిపోయాడు.

చేతులు నులుపుకుంటూ లత ఆత్రంగా ఎదురుగా కూర్చున్న స్త్రీ వైపు చూసింది.

"నా పేరు తులసి. మీ సహాయం నాకు కావాలి!" అంది.

"నేషనల్ ఏమర్జన్సీ వచ్చాక మాకు తీరిక లేదు. మా రేట్లు పెరిగాయి. అయినా మీకు సహాయపడ్తాం. ఏం కావాలో చెప్పండి!" అంది లత.

"నా భర్త ప్రొఫెసర్ రాజారావు. ఆయన ఒక యువతితో తిరుగుతున్నారని నాకు అనుమానంగా వుంది. ఆమె పేరు జయ కావచ్చు. వారు ఎక్కడెక్కడ తిరుగుతున్నదీ, ఏమేమి చేస్తున్నదీ నాకు తెలపాలి!" అంది తులసి.

"ఎంత కాలంపాటు ఇది చెయ్యాలి?"

"పూర్తి వివరాలు తెలిశాక నాకు రిపోర్టు పంపండి!"

"మీరు కోరినదంతా సాధించడానికి మాకు కనీసం నెల రోజులు పడుతుంది. రోజుకు రెండు వందలు చొప్పున ఆరు వేలవుతుంది. వాళ్ళు బయట వూళ్ళకు పోతే అప్పుడు మేం కూడా వెనకనే వెళ్ళాలి. అప్పుడు రోజుకి వెయ్యి రూపాయి లిచ్చుకోవాలి. మరో విషయం. దేశంలోని బాంకులు అప్పు లివ్వడం లేదు. మనీ మార్కెట్ మహా టైట్‌గా వుంది. అందువలన ఆరు వేలు మీరు మాకు అడ్వాన్స్‌గా ఇవ్వాలి!" అంది లత.

తులసి హేండ్ బేగ్ తెరిచింది. అరవై వంద రూపాయిల నోట్లను తీసి ఆమె టేబుల్ మీద పడేసింది. మాంసం ముక్క ముందుకు కుక్క దూకినట్లు లత చేతులు నోట్లను లాగి, లెక్కట్టి, హాండ్‌బాగ్‌లో దాచేశాయి.

"ఇది రహస్యంగా జరగాలి. నా భర్తకు తెలియ కూడదు" అంది తులసి.

"డోంట్ వర్రీ, నా భర్తకు కూడా చెప్పను" అంది లత. మాట వరసకి అలా అన్నా తనకు పెళ్ళి కాలేదని లత తర్వాత లోలోన నవ్వుకుంది. తులసి కాగితం మీద అడ్రెస్ రాసి ఆమె కిచ్చింది. కుర్చీలోంచి లేచింది.

"యూ కెన్ గో మేం పని ప్రారంభిస్తాం" అంది లత.

తులసి బయటకు కదిలింది. లత బెల్ నొక్కింది. తుల సింగం బయట వరండాలోంచి పరుగెత్తుకొచ్చాడు.

"లాల్‌ని రమ్మను!" అర్చిందామె.

ఆమె కంఠం విని లాల్ గబగబా గదిలో కొచ్చి కుర్చీని దూరంగా యీడ్చుకొని కూర్చున్నాడు.

"లాల్, కుర్చీనంత దూరంగా లాగి కూర్చున్నావు, ఏమిటి కారణం? ఆర్ యు ఎ టి. బి. పేషెంట్?"

అడిగిందామె.

"నేను పేషెంట్ కాకపోయినా గదిలో రోగి వున్నప్పుడు జాగ్రత్తపడ్డం మంచిది!" అన్నాడు లాల్.

లత నవ్వుతూ అతనికేసి చూసింది.

"లాల్, మనకొక చిన్న కేస్ దొరికింది. ఆమె అయిదు వందలు అడ్వాన్సు ఇచ్చి వెళ్ళింది. పని పూర్తికాగానే ......"

"యూ డర్టీ లయ్యర్, పక్కగదిలో కూర్చొని మీ సంభాషణంతా విన్నాను. నీకు ఆమె ఆరువేలు ఇచ్చింది!"

"అంతా విన్నావుగా! అదీ మంచిదే. స్టార్ట్ ఎట్ ఒన్స్! మూడురోజుల్లో నీ రిపోర్టు నా చేతుల్లో వుండాలి!' అందామె.

"ముప్ఫయిరోజుల తర్వాత ఆమెకు రిపోర్టు పంపి నెల పనిచేశామని అబద్ధమాడావు! యూ మనీ ఈటింగ్ కంబూన్!" అన్నాడతను.

"లాల్ స్వీట్ బాయ్, బయల్దేరు!" అందామె బతిమాలుతూ.

"మూడువేలు ఇలా పడేయి!"

"ఎందుకు?"

"ఖర్చులకు!"

"పట్నంలో తిరగడానికి పల్లవా ట్రాన్స్‌పోర్టు వుంది. బెస్ట్ మీన్స్ ఆఫ్ ట్రావెల్!" అని ఆమె ఒక వందరూపాయల నోటును అతనికిచ్చింది.

"లాల్, ఖర్చయిన ప్రతి పైసాకీ నాకు అకౌంట్ కావాలి!" అర్చిందామె అధికార ధోరణిలో.

"మూడువేలిస్తేగాని నేను పరిశోధన ప్రారంభించను" అన్నాడతను.

అఖర్కి ఏడుస్తూ ఆమె లాల్ కి అయిదుకందలిచ్చింది. తులసి రాసిచ్చిన అడ్రెస్ ను చూసి విజిల్ వేస్తూ లాల్ బయటకు కదిలాడు.

# 5

ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ప్రొఫెసర్ రాజారావు ఆమె చెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరూ ఎవ్వరూలేని ప్రదేశానికి వెళ్ళి కూర్చున్నారు.

సముద్రపు హోరు వినిపిస్తోంది. ఎడంవైపు ఎత్తయిన సరుగుడు చెట్లు వున్నాయి.

"ఇక్కడ హాయిగా వుంది. ఏంకావాలన్నా చేసుకోవచ్చు," అన్నాడతను.

ఆమె నలువైపులా చూసింది. కొంచెం దూరంగా కూర్చొని ఎవరో సిగరెట్ కాలుస్తున్నారు.

"రాజా, ఇక్కడ వున్నది మనిద్దరమే కాదు!" అందామె.

ఆమె చూపించినవైపు అతను చూశాడు. ఒక ఆకారం అతనికి కనిపించింది.

"పాయసంలో చీమలా వాడెందుకిక్కడా?" అన్నాడు ప్రొఫెసర్ రాజారావు.

"ఇంకా దూరంగా పోదాం," అంది జయ.

ఇద్దరూ ఇంకా దూరంగా వెళ్ళారు. కాస్సేపట్లో ఆకారం వాళ్ళకు దగ్గరగా కదిలింది.

జయ అతడిని కౌగలించుకుంది.

"రాజా, ఎవరో మనల్ని వెంటాడుతున్నారు!" అందామె.

"సిల్లీ! మన్నెవరు వెంటాడుతారు?"

"రాజా, నువ్వు ప్రొఫెసర్ కావచ్చు కాని అమాయకుడవు. మన ప్రేమను లోకం చూడలేదు. నీ భార్య, మా నాన్న! మనమీదకు రాళ్ళు విసిరేవాళ్ళు చాలామంది వున్నారు," అందామె.

"జయా, నిన్ను విడిచి నేను బ్రతకలేను. నీ తండ్రి అడ్డొస్తే యెలాగ?" అడిగాడతను.

"ప్రేమకోసం అడ్డుగోడల్ను కూలగొట్టాలి! అది చెయ్యలేని పక్షంలో రోమియో, జూలియెట్లలా మనం బలైపోవాలి," అందామె.

చంద్రకాంతిలో జయ కళ్ళు తళతళ మెరుస్తున్నాయి. రాజారావు ఆమెను ఆప్యాయంగా ముద్దెట్టుకున్నాడు.

"జయా, నిన్ను ఈ జీవితంలో నేను వదలను. నీకోసం ఏమి చెయ్యడానికైనా నేను సిద్ధం," అన్నాడతను.

"నన్ను నీవు పెళ్ళాడ్తానంటే నాన్న అడ్డురాడు!" అంది జయ.

"నా భార్య వుందని మర్చిపోతున్నావు!" అన్నాడతను.

"ఆమె ఒప్పుకుంటే నువ్వు నన్ను పెళ్లాడొచ్చుగా!" అంది జయ.

"అడిగి చూస్తాను," అన్నాడతను.

మరో యువతిని తను పెళ్ళాడ్తానంటే తులసి ఒప్పుకోదని అతనికి తెలుసు. తులసి దృష్టిలో పెళ్ళి ఒక పవిత్రమైన బంధం. అటువంటి స్త్రీని లొంగదీయడం సాధ్యంకాకపోవచ్చు.

కొంచెం దూరంలో కూర్చున్న లాల్ వాళ్ళు చేసినదంతా స్పెషల్ కళ్ళద్దాలతో స్పష్టంగా చూడగల్గుతున్నాడు.

'ఆ యువతికోసం అతను ఏదేనా చేస్తాడు! హి ఈజ్ మాడ్ ఫర్ హర్!' అనుకున్నాడు లాల్ తనలో తను.

# 6

బెంగుళూర్ !

ప్రొఫెసర్ రాజారావు మంచి నిషాలో వున్నాడు. పీటర్ స్కాట్ బాటిల్ టీపాయిమీదుంది. టీపాయి పక్కన చల్లటి సోడాబుడ్లు వున్నాయి.

అప్పుడే బాత్‌రూమ్‌లోంచి బయటకొస్తూన్న జయ వైపు అతను చూశాడు. ఆమె శరీరం బంగారం పూసినట్లు మెరుస్తూంది.

ఆమె బ్లూ టర్కిష్ టవల్ చుట్టుకుంది. ఆ స్థితిలో ఆమెను చూస్తూంటే నెలల తరబడి అతడిలో అవకాశం చిక్కక అణగి వున్న కోర్కె రగుల్కొని భోగిమంటలా మండింది.

జయ అద్దం ముందు నిలబడింది. తూలుతూ అతను ఆమె వెనక్కి జరిగాడు. అతని చేతులు ఆమెను చుట్టేశాయి. ఆమె ధరించిన తువ్వాలు వూడి కిందకు జారింది.

పక్క గదిలోని వెంటిలేటర్‌లోంచి లాల్ వాళ్ళ వైపు చూస్తున్నాడు. అతను నవ్వుకుంటూ వెనక్కి తిరిగి కుర్చీ మీద నుంచి టేబుల్ మీదకు దిగి కిందకు దూకాడు.

టెలిఫోన్ మ్రోగింది. లాల్ గ్లాసులోని బ్రాందీని కొంచెం త్రాగి రిసీవ రెత్తాడు.

"హలో లాల్ స్పీకింగ్!" అన్నాడతను.

"లాల్, ఏం చేస్తున్నావు?" అర్చింది లత అటువైపు నుంచి.

"పక్క గదిలో వాళ్లేం చేస్తున్నారో చూస్తున్నాను" అన్నాడు లాల్.

"ఏం చేస్తున్నారు వాళ్ళు?"

"వాళ్ళు చేస్తున్నవి నీలాంటి పెళ్ళికాని మిస్సమ్మలు వినకూడదు."

"యూ డర్టీ మనీ వేస్టింగ్ రోగ్, ఏం చూశావో చెప్పు!"

"పక్క గదిలో నున్న జయ మహా అందంగా వుంది. ఆమె ఒంటిమీద టర్కిష్ టవల్ మాత్రం వుంది. అది కూడా మెల్లగా కిందకు జారింది."

"లాల్, డోంట్ ఫాల్ ఫర్ హర్! పనిని ముగించి తొందరగా రా!" అర్చిందామె.

"నాకు రెండు వేలు కావాలి!" అన్నాడతను.

"ఎందుకు? పట్టుకెళ్ళిన అయిదు వందలు చాలు!"

"లతా, బయట వూళ్లో పని చేస్తే రోజుకి వెయ్యి రూపాయిలు మనకొస్తుందిగా! రెండు వేలు వెంటనే బాంకి ట్రాన్స్‌ఫర్ చేయించు నా పేర!" అన్నాడు లాల్.

ఆమె దగ్గడం మొదలెట్టింది.

"గుడ్ గాడ్! నువ్వు దగ్గితే ఇంత దూరంలో వున్న నా మీద చినుకులు పడ్తున్నాయి. నా మాట విను. గో అండ్ సీ డాక్టర్ ఫాక్స్. నిర్లక్ష్యం చేస్తే తర్వాత అది టి. బి. అయితే మనం కంపెనీ మూసెయ్యాలి."

"నేను లేకపోతే కంపెనీ మూసేయాలన్నందుకు సంతోషిస్తున్నాను. నిజం ఇప్పటికేనా తెల్సుకున్నావు," అందామె.

"యూ ఫూల్, నా అర్థం అది కాదు. నువ్వు టి.బి.తో దగ్గుతూ కూర్చుంటే క్లయింట్స్ ఆఫీసుకు రారు. మరె

క్కడికో పోతారు. అందువలన మనం మూసేయాలని నా అర్థం.''

''యూ రాస్కెల్! నాకు ఏదో రోగం వుందని కలలు కంటూ కూర్చోకు! మళ్ళీ చెప్తున్నా. తక్కువ ఖర్చుతో ఎక్కువ సాధించి బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో వచ్చేయి.''

''రెండు వేలు...'' అన్నాడతను.

''యూ డర్టీ రాట్!'' అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

లాల్ రిసీవర్ పెట్టేసి గ్లాసులోని బ్రాందీని తాగేశాడు. సిగరెట్ పీలుస్తూ టేబుల్ ముందున్న కుర్చీ ఎక్కి వెంటిలేటర్‌లోంచి పక్క గదిలోకి చూశాడు.

గదిలో ఎవ్వరూ లేరు. టీపాయ్ మీద బాటిలుంది. వాళ్ళు ఎక్కడికి పోయారు? దూరంలో వున్న బాత్ రూమ్ తలుపు కొద్దిగా తెరిచి వుంది. వాళ్ళు బాత్ రూమ్‌లో వున్నారేమో!

నగ్నంగా బాత్‌రూమ్‌లోంచి గదిలో కొస్తున్న జయ అప్రయత్నంగా ఎదురుగా వున్న వెంటిలేటర్ వైపు చూసి త్రుళ్ళిపడింది. లాల్ వెనక్కి తిరిగి క్షణంలో కిందికి దూకాడు. టేబుల్ మీదున్న కుర్చీని లాగి నేల మీద పెట్టాడు. ఆమె తనను చూసింది! ఆలోచిస్తూ లాల్ సోఫాలో కూర్చుని బ్రాందీ తాగుతూ వుండిపోయాడు.

# 7

ప్రొఫెసర్ రాజారావు తలుపు మీద తట్టాడు. ఎవరూ తలుపు తెరవలేదు. ఇంకా గట్టిగా తట్టాడు. తలుపు తెరిచి లాల్ మందహాసంతో రాజారావుకేసి చూశాడు.

''మై డియర్! లూసీ-ఫర్ డియర్!'' తడబడుతూ లాల్ వాగుతున్నాడు.

రాజారావు లోపలకు కోపంగా జొరబడ్డాడు. టీపాయి మీదున్న బ్రాందీబాటిల్ వైపు చూశాడు. లాల్ తూలుతున్నాడు. అర్థంలేని మాటలు వెలువడుతున్నాయి అతని గొట్లోంచి. తప్ప తాగుండాలి అనుకున్నాడు రాజారావు.

"మిస్టర్! నువ్వు ఇంతవరకూ ఏం చేస్తున్నావు?" అడిగాడు ప్రొఫెసర్.

"ఐ డ్రింక్! వుయ్ డ్రింక్! దే డ్రింక్!" అని లాల్ పొట్టమీద చెయ్యేసి నవ్వాడు.

"ఇటువంటి పిచ్చి పనులు చేస్తే పోలీసులకు అప్పగిస్తాను!" బెదిరించాడు ప్రొఫెసర్.

"డ్రింకు పిచ్చికాదు! నో! మై డియర్, కమ్ అండ్ జాయిన్ మీ," అన్నాడు లాల్.

లాల్ గదిలో తూలుతూ ఈలపాట పాడుతున్నాడు, పిచ్చి చేష్టలు చేస్తున్నాడు.

ప్రొఫెసర్ రాజారావు లాల్‌ని భుజం మీద తట్టాడు.

"నీ పేరేమిటి?"

"దేవ్-దాస్!" అని లాల్ బ్రాందీ బాటిల్‌ను అందుకున్నాడు.

"ప్రేమించి ఫెయిలయ్యావా?"

"పార్వతి ఐ లవ్. పార్వతి మేరీ...ఓల్డ్ రాట్!" అన్నాడు లాల్.

ప్రొఫెసర్ రాజారావు గదిలోంచి బయటకు వచ్చి తలుపు దగ్గరగా మూశాడు. పక్కనున్న గదిలోకి వెళ్ళాడు.

సోఫాలో వున్న జయ పక్కనే చతికిల బడ్డాడు. "జయా, అతను ఏమీ చూడలేదు. చూసినా ఏదీ జ్ఞాపకముండే స్థితిలో అతను లేడు," అన్నాడతను.

"అతను చక్కగా చూశాడు డర్టీ ఫెలో!" అందామె.

"అతను తప్ప తాగి వున్నాడు. అతని పేరు దేవదాస్ట. ఏ పార్వతో అతడికి పిచ్చెక్కించి వదిలేసింది. పూర్ చాప్ బాటిల్ కి మెల్లిగా బలైపోతున్నాడు."

"అతను నటించడం లేదుగా?"

"ఎందుకు నటిస్తాడు? నన్ను నమ్మకపోతే అతని గదిలోకి తీసుకువెళ్తాను రా! అతడిని చూసి నీ హృదయం కరిగి పోతుంది!"

"ఆల్ రైట్, అతడిని మర్చిపోదాం," అందామె.

"జయా! అనుక్షణం నువ్వు నా కళ్ళ ముందు వుండాలి," అన్నాడతను.

"అదే నా కోరిక కూడా!" అందామె.

"తులసిని అడిగాను. ఆమె మన పెళ్ళికి ఒప్పుకోనంది" అబద్ధమాడేడతను.

జయ అతని వైపు తీక్షణంగా చూసింది.

"రాజా, నిన్న మనం చూసిన జలపాతంలో పడి పోదాం! చెయ్యీ చెయ్యీ కలిపి రాళ్ళమ్మట కిందకి దొర్లి పోదాం! ఈ జన్మలో సాధ్యం కానిది వచ్చే జన్మలో దొరుకుతుందేమో!" అందామె.

ఆమె కళ్ళమ్మట నీళ్లు కారుతున్నాయి. ఆమె కన్నీళ్లు చూసి అతను ఏడుస్తూ ఆమెను కౌగలించుకున్నాడు.

"జయా, అడ్డొచ్చే నా భార్యను తొలగిస్తాను!" అన్నాడతను.

"ఎలా రాజా? డైవర్స్ చేస్తావా?"

ఆమె అతని వైపే చూస్తోంది. రాజారావు మొహం అదో విధంగా మారింది.

"నేను చదువుకున్నవాడిని. సంస్కారం గలవాడిని! అయినా మన ప్రేమ కోసం ధైర్యంగా ఆమెను హత మార్చాలి!"

"నువ్వూ నేనూ ఇరుక్కుంటాం!" అందామె.

"రోజూ ఆలోచిస్తున్నాను, అతి రహస్యంగా ఆమెను తుద ముట్టించాలి! అటుపైన నీకూ నాకూ స్వేచ్ఛ! మనం హాయిగా జీవించవచ్చు!" అన్నాడతను.

"రాజా, నాకు భయంగా వుంది!" అందామె.

"ప్రేమ ధైర్యాన్ని ఇస్తుంది," అన్నాడతను.

జయ అతని చెయ్యి పట్టుకుంది. అతనిని ఆప్యాయంగా తన మీదకు లాక్కుంది.

# 8

లత అండ్ లాల్ కంపెనీ పంపిన సీక్రెట్ రిపోర్టును తులసి మూడుసార్లు చదివింది. రెండు కాయితాలను మడిచి కవర్లో పెట్టి, కవర్ను తన పరుపు కింద దాచుకుంది.

ఈ మధ్య రాజారావు తన పడగ్గదిలోకి రావడంలేదు, ప్రక్కనున్న మరో పడగ్గదిలో అతను ఒంటరిగా పడు కుంటున్నాడు.

ఆమె లేచి గుమ్మం దగ్గరగా వెళ్ళి తలుపు మూసి లోపల గడియ బిగించింది. మెల్లిగా వెళ్ళి పరుపు మీద వాలింది. రిపోర్టులో వాళ్ళిచ్చిన వార్నింగ్ ఆమె చెవుల్లో మ్రోగుతోంది.

"మీ భర్త మిమ్మల్ని చంపడానికి ప్రయత్నాలు చేయొచ్చు. మీరు మెలుకువగా వుండాలి. మీకు ప్రమాదం రాకుండా మేం చూడగలం. అది మీకు అవసరమైతే వెంటనే మమ్మల్ని కల్సుకోండి" అని వాళ్ళు రాశారు.

తులసి ముఖాన్ని తలగడలో దాచుకుని వెక్కి వెక్కి

ఏడుస్తోంది. తన తలిదండ్రులు పోయారు. దగ్గర చుట్టా లెవ్వరూ లేరు.

పెళ్ళయిన పదేళ్ళ తర్వాత తన సంసారం రాళ్ళకు కొట్టుకుని ఇలా ముక్కలవుతుందని కలలో కూడా ఆమె వూహించలేదు. తనకు అన్యాయంచేసి భర్త సుఖపడలేదు.

# 9

టైమ్ తొమ్మిది దాటింది.

ప్రొఫెసర్ రాజారావు వంటగది బయట నిలబడ్డాడు. వంటామె మీనాక్షి అతనివేపు భయంతో చూసింది. తన వంటకాలు బాగాలేవని చెప్పడానికి వచ్చాడేమో అతను అనుకుంది!

"తులసి పాలు నాకిచ్చి మీరు వెళ్ళొచ్చు!" అన్నాడు రాజారావు.

మీనాక్షి పాలగ్లాసును అతని కందించి బయటకు వెళ్ళి పోయింది. అతను వీధితలుపు మూసి, కింది లైట్లు తీసేసి మెట్లమ్మట పైకి వెళ్ళాడు.

పాలగ్లాసును తనగదిలోకి పట్టుకెళ్ళి టీ పాయిమీద పెట్టాడు. బీరువాలో తను దాచిన చిన్న బుడ్డీని తీశాడు. దానిపైన ఎర్రటి అక్షరాల్లో "పాయిజన్" అని లేబు లుంది. బుడ్డీలోని ద్రవాన్ని అతను పాలల్లో పోసి, చంచాతో కలుపుతూ కూర్చున్నాడు.

అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. ముఖంమీద చమట పోసింది. చంచాను పట్టుకున్న చేయి కొద్దిగా వణుకుతోంది. అతను ఆలోచిస్తున్నాడు. తన జీవితానికి అడ్డయిన ఒకవ్యక్తిని చంపడానికి తనింత భయపడు తున్నాడు! జర్మనీలో ఒక స్త్రీ వందలాది యువకుల్ని చంపింది. ఆమె కథ క్రితం రాత్రే చదివాడతను. ఆమె కంత ధైర్యం ఎలా వచ్చిందో!

పాలల్లో తను పోసిన ద్రవం బాగా కలిసిపోయింది. ఏదో కలిపినట్లు ఎవ్వరూ గుర్తించలేరు! కాని పాల రుచి మారుతుందేమో!

అతను పడివైపున్న గుమ్మంకేసి చూశాడు. భార్య గదికి ఆ గుమ్మంలోంచి వెళ్ళాలి. అతను లేచాడు. గ్లాసు పట్టుకొని గుమ్మంవద్దకెళ్ళి తలుపు తోశాడు. తలుపు గడి పెట్టబడిందేమో, ఎంత తోసినా తెరుచుకోలేదు.

బయట నడవమ్మట అతను తులసి గదికి వెళ్ళాడు. తలుపు తోయగానే తెరుచుకుంది. అతను మెల్లిగా పరుపు దగ్గరకు నడిచాడు. పాలగ్లాసును ఆమె పక్కనున్న టీపాయిమీద పెట్టాడు.

గొంతుదాకా దుప్పటి కప్పుకుని తులసి నిద్రపోతోంది. అదీ మంచిదే అనుకున్నాడతను. ఎప్పుడో లేచి పాలు తాగుతుంది. ఆమె లేచి తాగకపోతే! ఆమెను లేపి పాలు తెచ్చానని చెప్పాలి! మెల్లిగా ఆమెను తట్టాడు. ఆమె తొందరగా పాలు తాగాలి? అతని గుండె నూటనాలుగు డిగ్రీలు టెంపరేచర్ వచ్చినట్లు వేగంగా కొట్టుకుంటోంది.

తులసి లేచి కళ్ళు తెరిచి అతనివైపు చూసింది.

"మీరా!" అందామె.

"తులసీ, నీ కోసం పాలు తెచ్చాను. తాగి పడుకో! లేకపోతే నిద్రలో మర్చిపోతావు," అన్నాడతను.

"మీరెందుకు తెచ్చారు? మీనాక్షి ఏమైంది?"

"ఆమె కాలు బెణికింది. పైకి రాలేనంది!" అబద్ధమాడాడతను.

తను ఏం చెప్పినా ఫరవాలేదు. పాలు తాగగానే ఆమె మరోలోకంలో వుంటుంది. మీనాక్షిని అడిగే అవకాశం ఆమెకుండదు.

"చాలా థాంక్స్, ప్రేమతో పాలు తెచ్చి నాకిచ్చినందుకు," అందామె.

ఆమె గ్లాసును అందుకుంది.

"నే వెళ్తాను. నోట్సు రాయాలి," అని పిరికిపందలా అతను తన గదిలోకి పరుగెత్తాడు.

నీళ్లు తరిగిపోతున్న చెరువులో చేపలు ఎగిరినట్లు అతని మెదడ్లో అనేక ఆలోచనలు తలెత్తుతున్నాయి. తన గదిలో అతను పచార్లు చేస్తున్నాడు. ఆమె అరుస్తుందేమో!

ఈ విషం తాగినవాళ్ళు అరవలేరు. తాగడం, పోవడం వెనువెంటనే సంభవిస్తాయని అతనికి తెలుసు. భార్య గదికీ, తన గదికీ మధ్యనున్న గుమ్మందగ్గర అతను నిలబడ్డాడు. తలుపుకు చెవి ఆనించి అటువైపు గదిలోని శబ్దాలను వినసాగాడు.

అటువైపు గదిలో ఏ చప్పుడూ లేదు! ఈ పాటికి ఆమె పాలు తాగేసి, పరుపుమీద వెనక్కి పడివుండాలి!

టెలిఫోన్ మ్రోగింది. అతను పరుగెత్తుకెళ్ళి రిసీవర్ని అందుకున్నాడు.

"హాలో!" అన్నాడతను.

"రాజా, నువ్వేనా?" అడిగింది జయ.

"నేనే!"

"హోటల్ ఫోన్ లోంచి మాట్లాడుతున్నాను. ఏమైంది?" అడిగిందామె.

ఆమె కంఠం విన్నాక అతనికి ధైర్యమొచ్చింది. "అంతా అయిపోయింది. పాలు నేనే ఇచ్చాను. తాగేసి పడుకుని వుంటుంది. మెలుకువలేని నిద్ర!" అన్నాడతను.

"వెళ్ళి చూశావా?"

"చూడాలి!"

"అవసరమైతే నేనొస్తాను."

"జయా, నువ్వు రావద్దు. అంతా సవ్యంగా సాగిపోతుంది," అన్నాడతను.

"అయితే రేపటినుంచి వుయ్యార్ ఫ్రీ!" అందామె.

"రేపటిదాకా ఎందుకు, యీ క్షణంనుంచీ మనం స్వేచ్ఛగా గాలి పీల్చొచ్చు," అన్నాడతను.

"తారుమారవదుగా?"

"నో ఛాన్స్!" అన్నాడతను.

"రాజా, గుడ్ నైట్!" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

అతను రిసీవర్ పెట్టేసి సిగరెట్ వెలిగించాడు. టైమ్ చూశాడు. పదైంది. గుమ్మం దాటి అతను నడవలో అడుగుపెట్టాడు. కాలికేదో మెత్తగా తగిలింది. అది ఏమిటో చూడకుండా అతను గబగబా భార్య గదిలో ప్రవేశించాడు.

క్షణకాలం ఆగి పరుపుకేసి చూశాడు. ఆమె పడుకుని వుంది. వేగంగా దగ్గరకెళ్ళాడతను. గ్లాసులో కొద్దిగా పాలున్నాయి. ఆమె నిద్రపోతున్నట్లు వుంది. అది నిద్ర కాదు, చావు!

ఆమె శరీరాన్ని ముట్టుకున్నాడతను. గుండెమీద చెయ్యివేసి చూశాడు. మామూలుగా కొట్టుకుంటోంది. గుడ్ గాడ్, ఇదెలా సాధ్యం? అన్ని పాలు తాగి ఆమె ఇంకా ఎలా బతికుంది?

తలా తోకా తెలియడంలేదు. అతను తన గదివైపు నడుస్తున్నాడు. నడవలోని స్విచ్ నొక్కి తన కాలికి మెత్తగా తగిలినదేమిటా అని చూశాడు.

నల్లటి పిల్లి! గచ్చునేలమీద చచ్చిపడుంది! కాల్తో

అతను పిల్లిని దూరంగా తన్నాడు.

ఏదో ఆలోచన తట్టి పిల్లిపడున్న చోటకు పరుగెత్తాడు. నల్లపిల్లి ఎలా చచ్చింది? గ్లాసులోని పాలను పిల్లి తాగేసిందా? గ్లాసు కిందపడిన చప్పుడు ఎందుకు కాలేదు?

అంతా అగమ్యగోచరంగా వుంది. తను ఊహించిన విధంగా అంతా జరగలేదు.

అతను మళ్ళా భార్యగదిలోకి వెళ్ళాడు. టీపాయి మీదున్న గ్లాసును నీళ్ళుపోసి కడిగేశాడు. నడవలోకొచ్చి చచ్చిపడున్న పిల్లిని వాల్కనీపైనుంచి తోటలోకి విసిరాడు. తన గదిలోకి చేరుకున్నాడు.

టైమ్ చూశాడు. పదకొండైంది. తులసి చావలేదు. ఆమె పాలు తాగలేదు. ఆమె ఎక్కడో పోసిన పాలను పిల్లి తాగివుండాలి! ఆమె పాలను ఎందుకు పారబోసింది? తను ఆమెను చంపడానికి ప్రయత్నిస్తున్నట్లు అమెకు తెలిసుండాలి!

ఇప్పుడేం చెయ్యాలి? పొద్దుటే ఆమె లేచి పాలను గురించి అతడిని అడుగుతుందేమో? పిల్లిని తోటలో పడేసినందుకు అతను సంతోషించాడు. చనిపోయిన పిల్లిని తులసి చూసుండదు! అనేకవిధాల అతను ఆలోచిస్తూ సిగరెట్ తర్వాత సిగరెట్ కాల్చి యాష్ట్రేలో కుక్కుతున్నాడు.

# 10

వెలుతురు వచ్చేముందే తులసి మేల్కొంది. టీపాయి మీదున్న గ్లాసువైపు చూసింది. అడుగున పాలు లేవు. అతను గ్లాసును కడిగివుంటాడని ఆమె గ్రహించింది.

ఒక ఆడదాన్ని తుదముట్టించడానికి అతను ఎంత తాపత్రయపడ్తున్నాడో! ఆమె కిందకి దిగి నడవలో

కెళ్ళింది. అతని గదిముందు నల్లటి పిల్లి పడుండాలి! క్రితం రాత్రి పడున్న పిల్లిని ఆమె చూసింది. కాని ఇప్పుడు పిల్లి లేదు? ఏమైంది? దాన్ని ఎక్కడో పారేసివుండా లతను.

తులసి అతని గదిలోకి వెళ్ళింది. గదిలో లైటు వెల్గుతోంది. యాష్ట్రే నిండా సిగరెట్ పీకలున్నాయి. రాజారావు వుండచుట్టుకుని సోఫాలో పడుకునివున్నాడు. ఆమె మెట్లు దిగి కిందకెళ్ళింది. వీధి తలుపు తెర్చింది.

తోటంలోకి ఆమె కదిలింది. అప్పుడే వెల్తురొస్తోంది. ఇంటికొస్తూన్న వంటామె ఆమె కెదురైంది. తులసిని చూసి వంటామె నవ్వింది.

"మీ కాలు బెణికిందా?" అడిగింది తులసి.

"లేదమ్మా! అలా ఎవరు చెప్పారు?"

"మీరు పాలు తేకపోతే మునపటిలా బెణికిందనుకున్నాను," అంది తులసి.

"పాలు అయ్యగారు తీసుకెళ్తానన్నారు. నన్ను వెళ్ళిపొమ్మన్నారు."

తులసి విని ముందుకు సాగిపోయింది. వంటామె ఇంట్లోకి వెళ్ళిపోయింది. మొక్కల పక్కన పడున్న పిల్లి వైపు ఆమె చూస్తూ నిలబడింది. తోటవాడు ఆమెముందు ప్రత్యక్షమయ్యాడు.

"సుబ్బా, యీ పిల్లిని దహనం చేయి!" అందామె.

తన భర్త హృదయంలోని కల్మషాన్ని, కృత్రిమాన్ని తనకు చాటుతూ పిల్లి మరణించింది. అటువంటి జంతువును దహనంచేసి తన రుణాన్ని తీర్చుకోవాలి!

"అలాగే నమ్మా!" అన్నాడతను.

పిల్లి మీద పుల్లలూ, ఎండుటాకులూ పడేసి అగ్గిపుల్లతో అంటించాడతను. మంటలు పైకిలేచాయి. ఆమె కాల్తూన్న

చితిముందు కాస్సేపు నిలబడింది. భార్యగా తన ఆశలన్నీ ఆ మంటల్లో భగ్గుమంటున్నట్లు అనిపించిందామెకు!

ఆమె వెనక్కి తిరిగి ఇంట్లోకి వెళ్ళింది. అంతా తెలిసినా దేన్నీ ఆపాలనే వుద్దేశం ఆమెకు లేదు. అగ్గి రగిలించినవాళ్ళు మంటల్లో మాడిపోయి తీర్తారు!

## 11

సముద్రపొడ్డున ఇద్దరూ కూర్చున్నారు. ఇంకా చీకటి పడలేదు.

ప్రొఫెసర్ రాజారావు ముఖం పేలవంగా వుంది. ఎర్రబడిన అతని కళ్లు చూస్తే రాత్రి అతను సరిగ్గా పడుకోలేదని తెలుస్తోంది.

"రాజా, ఏమిటలా వున్నావు?" అడిగింది జయ.

"నేను చంపడానికి ప్రయత్నించానని తులసికి తెలుసు."

"ఎందుకలా అనుకుంటున్నావు?"

"నేనిచ్చిన పాలు ఆమె తాగలేదు. ఏ బాత్ రూమ్ లోనో పోసుంటుంది. నేలమీద పోసిన పాలను నాకిన పిల్లి మరణించింది. నేను గదిలోకి వెళ్ళినపుడు ఆమె నిద్రపోతున్నట్లు నటించింది. జయా, ఆమెకంతా తెలుసు! ఆమె పోలీసు రిపోర్టిస్తుందేమో!" అన్నాడతను గాభరాగా.

జయ మాట్లాడలేదు. అతని చెయ్యి పట్టుకుంది.

"జయా, ఇంతవరకూ వచ్చాక వూరుకుంటే లాభం లేదు. తెగించి ఆమెను అడుగట్టించాలి!" అన్నాడతను.

"ఏం చెయ్యదల్చుకొన్నావు?"

జయ చేతులు అతడిని చుట్టేశాయి.

"జయా, నిద్రలో వున్నపుడు గొంతు పిసికేయాలి!

ఆమె బ్రతికుంటే మనిద్దర్నీ రచ్చకెక్కిస్తుంది!''

అతను తన చేతులను చూసుకున్నాడు. సున్నితమైన చేతులు. కలంతో రాయడానికి అలవాటుపడిన చెయ్యి ఇప్పుడు తాడై ఆమె గొంతును నులపాలి! అదంతా తను చెయ్యగలడా?

ఆమె అతనితో పోట్లాడొచ్చు. గట్టిగా అరిస్తే పక్కిళ్ళలో వుండేవాళ్ళెవరేనా రావచ్చు!

ఇన్నేళ్ళపాటు విద్యావంతుడిగా, పెద్దమనిషిగా జీవించిన తను పుఝ్మలపాలై ముసుక్కాలవలో తల దాచుకోవాలి!

జయ అతనివైపు కళ్ళు చిట్లించి చూసింది. "రాజా, మన ప్రేమసౌధాన్ని నిలబెట్టుకునేందుకు మరో ప్రాణాన్ని తుంపివేయడం అన్యాయమనిపిస్తోంది. మన ప్రేమను ఇంకా పెంచుకుంటే ప్రమాదం. ఇప్పుడే విడిపోదాం, రాజా! ఈ జన్మలో అడవిలోని పువ్వులా వాడిపోయినా వచ్చే జన్మలో సంపూర్ణంగా నీదాన్నవుతాను, రాజా!'' అంది ఆమె.

ప్రొఫెసర్ రాజారావు సముద్రంవైపు చూస్తూ వుండిపోయాడు. బలమైన కెరటం ముందుకొచ్చింది. సముద్ర తీరాన ఆడుకుంటూన్న ఆరేళ్ళ కుర్రాడిని భయంకరంగా కొట్టి, అతడిని తనతో సముద్రగర్భంలోకి లాక్కుపోతోంది.

ఆ కుర్రాడు అరుస్తున్నాడు. ఒడ్డునున్నవాళ్ళు అతనివైపు చూస్తూ అరుస్తున్నారు కాని, అతడిని కాపాడే ధైర్యం ఎవ్వరికీ లేదు.

మరో కెరటం కుర్రాడ్ని ఒడ్డుకు తోసుకొచ్చి పడేసింది. అందరూ అతనివైపు పరుగెత్తారు. పొట్టవుబ్బిన

కుర్రాడివైపు ప్రొఫెసర్ రాజారావు తదేకంగా చూశాడు.

ఒక నిండుప్రాణాన్ని క్షణంలో ప్రకృతి తన కళ్ళ ముందు ధ్వంసం చేసింది! క్షణంలో సంభవించే చావును గురించి తామంతగా ఆలోచించడం వృధా అనిపించింది! అదే జయతో చెప్పాడు.

# 12

మెట్లపైనుంచి అతను కిందకు చూశాడు. పూజా మందిరంలోంచి తులసి బయటకొచ్చి వంటామెతో మాట్లాడుతూ నిలబడింది.

"మీనాక్షమ్మగారూ, ఇవాళ భోజనం చెయ్యను. ఏకాదశి," అందామె.

"ఫలహారం చెయ్యండి," అంది వంటామె.

"ఇవాళ పూర్తిగా వుపవాసం చేయదల్చాను. మంచి నీళ్ళు తప్ప మరేమీ తీసుకోను," అంది తులసి.

అతను భార్యకేసి సూటిగా చూశాడు. జల్తారున్న ఖరీదైన కంచీపురం పట్టుచీర ఆమె ధరించింది. అదే గుడ్డతో కుట్టిన జాకెట్. ఆమె మెళ్ళో చంద్రహారం మెరుస్తోంది. చేతులకు ఎన్నో గాజులున్నాయి. ఆమెను చూస్తే ధనవంతురాలని తెలుస్తోంది.

తటాలున ఆమె పైకిచూసి భర్తను గుర్తించింది. నవ్వుతూ మెట్లెక్కి వరండాలో వున్న అతని ముందుకు నడిచింది. ఆమె నుదురుమీద పెద్ద కుంకుమ బొట్టుంది. ఆమె కళ్ళు జ్యోతుల్లా మెరుస్తున్నాయి.

అతని ముందు మోకరిల్లి ఆమె అతని పాదాలకు నమస్కరించింది. అతని గుండె గుబేల్మంది.

"ఏమిటిదంతా?" అడిగాడతను.

"ఏకాదశి. ఉపవాసం చేస్తున్నాను. నన్ను దీవిం

చండి.'' అందామె.

ఆమె ప్లేటులో తెచ్చిన అక్షింతల్ను తీసుకుని అత నామె తలమీద జల్లాడు. సంతోషంగా ఆమె లేచింది. ఒక అరటిపండును అతని చేతిలో పెట్టింది.

''ప్రసాదం తినండి! పూజ చేశాను,'' అందామె.

అరటిపండును పట్టుకుని అతను తన గదిలోకి వెళ్ళి పోయాడు. అరటిపండును పరీక్షగా చూశాడు. పండులో ఆమె ఏదేనా పెట్టిందేమో! ఇంతకుముందు అతను పుస్తకాల్లో చదివాడు. బ్లేడుతో అరటిపండును కోయొచ్చు! కోసినట్లు ఎవ్వరూ గుర్తించలేరు!

అతను మెల్లిగా కిటికీ ముందుకు నడిచాడు. భార్య ఇచ్చిన అరటిపండును వూసలమధ్యనుంచి కింద పడేశాడు.

సిగరెట్ వెలిగించి కిందకు చూస్తూ నిలబడ్డాడు. కొన్ని కాకులు పండువైపు ఎగుర్తూవచ్చాయి. పండును పొడుచుకు తినసాగాయి. పూర్తిగా తినేసి కాకులు అరుస్తూ గాలిలో ఎగిరిపోయాయి!

అందులో విషం లేదు! తన గిల్టీ హృదయంతో తులసిని అతను అనుమానించాడు. తనని గురించి ఎంతో తెలిసినా ఆమెకు తనమీద భక్తి తరగలేదు!

# 13

ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. చల్లటిగాలి వీస్తోంది.

ఎనిమిది గంటలదాకా పూజచేసి తులసి బయటికొచ్చి నేలమీద కూర్చున్న వంటామెవైపు చూసింది.

''మీనాక్షమ్మగారూ, మీ వంటకాలు చాలా బాగుంటాయి. మీ చేతి రుచిని నేను మరవలేను,'' అంది తులసి.

''ఇవాళ తిండేనా తినలేదు!'' అందామె.

"ఎన్నేళ్ళనుంచో తింటున్నాను, ఇవాళ తినకపోతే పోయిందేమిటి?" అని తులసి వీధి గుమ్మం దాటి తోట లోకి వెళ్ళింది.

చల్లటి చంద్రకాంతి నలువైపులా ప్రసరిస్తోంది. ఆమె కాస్సేపు నిలబడి అన్ని వైపులా చూసింది. వెను తిరిగి హాల్లోకొచ్చి మేడ మెట్లు ఎక్కింది.

తన పడగ్గదిలోకి చేరుకుంది. టాయిలెట్ టేబుల్ సొరుగులో వున్న ఒక పాత ఫోటోను ఆమె తీసిచూసింది. విశాలాక్షి! తన బాల్య స్నేహితురాలు.

చిన్నతనంలో ఇద్దరూ కలిసి స్కూలుకి వెళ్ళేవారు. చెట్టుకింద కూర్చొని టిఫిన్ తినేవారు. తన కీనాడు విశాలాక్షి తప్ప లోకంలో ఆత్మీయులు ఎవ్వరూ లేరు.

విశాలాక్షిని గురించి ఆమె ఆలోచిస్తూంది. చిన్నతనంలో జరిగిన ఒక సంఘటన ఆమెకు జ్ఞాపక మొచ్చింది. ఒక క్లాసబ్బాయి తులసి జడను పట్టుకులాగాడు, నడి రోడ్డు మీద! విశాలాక్షి అది కళ్ళతో చూసింది. కాలి జోడు తీసి ఆ అబ్బాయిని ఎడా పెడా కొట్టింది. అతను పుస్తకాల సంచీ వదిలేసి పరుగెత్తాడు! "విశాలా, ఎందుకు చెయ్యి చేసుకున్నావు?" అడిగింది తులసి.

"మనిషి బతకాలంటే తనని పీడించే యీగల్నీ దోమల్నీ తరిమేయడం నేర్చుకోవాలి! మెత్తటాళ్ళని చూస్తే లోకానికి మొత్తాలనిపిస్తుంది," అందామె.

ఫోటోను సొరుగులో పెట్టేసి తులసి పరుపు మేద నీరసంగా వాలింది.

## 14

చుట్టూ నిశ్శబ్దంగా వుంది. రాజారావు గుండె మాత్రం దడదడ మంటోంది. అతను మెల్లిగా తలుపు తోసి ఆమె

గదిలోకి వెళ్ళాడు. తలుపును మూసి గడియ పెట్టి, అడు గులో అడుగేస్తూ ఆమె పరుపు పక్కగా నడిచాడు.

ఆమె నిద్రపోతోంది. నుదుటి మీద కుంకుమ బొట్టు ఎర్రగా మెరుస్తూంది. పట్టు చీరతోనే పడుకుందామె. పసుపుతో పాదాలూ, చేతులూ పచ్చబడినాయి.

పరుపు వారగా అతను కూర్చున్నాడు. సాలి పురుగు కాళ్ళలా అతని వేళ్ళు ఆమె గొంతు మీదకి పాకుతు న్నాయి.

వేళ్ళు తగలగానే ఆమె కళ్ళు తెరిచి అతని వైపు చూసింది. మృదువుగా నవ్వింది. క్షణంలో ఆమె నవ్వు మాయమైంది. అతని చేతులు ఆమె గొంతును చుట్టే శాయి.

"దీనికి శిక్ష మీరు అనుభవిస్తారు!" అందామె.

అతను పళ్ళు పట పట కొరికాడు.

"ఎవరు శిక్షిస్తారు? నీ బాబా? అతనీ లోకంలో లేడు" అన్నాడతను.

"నేనే తిరిగొచ్చి నాకసి తీర్చుకుంటాను!" అందామె.

"చచ్చేవాళ్లు అలాగే అంటారు!" అంటూ అతనామె గొంతును బలంగా నొక్కాడు.

ఊపిరాడక ఆమె వుక్కిరి బిక్కిరైంది. మరుక్షణంలో ఆమె తల గిజగిజ లాడుతూ వెనక్కి ఒరిగిపోయింది.

అతను ఆమెను వదిలేసి పక్కనే నిలబడి చూశాడు. పట్టుచీర పమిట మీది ఒక రక్తం చుక్క ఆమె నోట్లోంచి పడింది!

ఇప్పుడతను భయపడ్డం లేదు. జేబులోని పాకెట్ తీసి సిగరెట్ వెలిగించి పొగ పీలుస్తూ ఆమెకేసి చూశాడు.

అతను కిటికీ వద్దకు నడిచాడు. ప్రక్క ఇంట్లో లైటు

వెలుగుతోంది. అతను తన గదిలోకి మధ్య తలుపు తెరుచుకుని వెళ్ళాడు. గ్లాసులో మూడౌంతులు విస్కీపోసి సోడా కలిపాడు. గడగడ తాగేశాడు. అలా తాగుతూనే సోఫాలో కూర్చున్నాడు.

టెలిఫోన్ మ్రోగింది. అతను రిసీవర్ని అందుకున్నాడు.

"రాజా!" అందామె.

"అంతా సవ్యంగా జరిగింది. ఓ నిమిషంలో అంతా అయిపోయింది," అన్నాడతను.

"ఈ క్షణంలో నీ మొహం చూడాలని వుంది!" అందామె.

"నువ్వెక్కడున్నావు?"

"లక్ష్మీ మెడికల్ షాపులో, మా ఇంటి పక్క రోడ్డు మీదుంది."

"నేను వస్తున్నాను, రోడ్డుమీద నిలబడి వుండు!"

"అలాగే రాజా!" అని ఆమె రిసీవర్ని పెట్టేసింది.

## 15

లక్ష్మీ మెడికల్ షాపుకు దూరంగా అతను కార్ను ఆపాడు. గబగబా వెళ్ళి ఆమె కారులో కూర్చుని తలుపు మూసింది.

అతను కారును పోనిస్తున్నాడు.

"ఎక్కడికి పోదాం?" అంది జయ.

"మా ఇంటికి! అదిప్పుడు మనిల్లు!" అన్నాడతను.

"శవం ఇంట్లో వుండగా నేనక్కడికి రావడం శుభ సూచకం కాదేమో!" అంది జయ.

ఒక వ్యక్తి ప్రాణాన్ని బలి తీసుకొన్న అతనిలో కొత్త శక్తేదో వుద్భవించినట్లుంది.

"జయా, ఆ ఇంట్లో నువ్వు అడుగు పెట్టడమే అన్నిటి

కంటె శుభప్రదమైనది! నీ సహాయం నాకు కావాలి. తిండితిని జీర్ణించుకొన్నట్లు చంపినవాడు శవాన్ని రహస్యంగా దాచగల్గాలి!'' అన్నాడతను.

కాసేపట్లో గేటు దాటి కారును అతను లోపలకు పోనిచ్చి ఆపాడు. సమీపంలో వున్న ఇళ్ళలో లైట్లు లేవు. ఇద్దరూ కార్లోంచి దిగారు. ఆమె నడుం చుట్టూ అతను చెయ్యిని పోనిచ్చాడు. తాళం తెరిచి ముందు హాల్లోంచి వాళ్లు పైకి వెళ్ళారు. తులసి గదిలోకి ఇద్దరూ ప్రవేశించారు. మౌనంగా పరుపు పక్కనే నిలబడ్డారు.

తులసి తల తలగడపైనుంచి వెనక్కి వాలి వుంది.

''రాజా, ఆమె నీతో పోట్లాడిందా?'' అడిగింది జయ.

అతను సిగరెట్ పొగ వదుల్తూ నవ్వాడు.

''నన్ను ఏమాత్రం ఎదిరించలేదు. ఆఖరి క్షణంవరకూ నా వేపు చూస్తూ నన్ను గొంతు పిసకనిచ్చింది,'' అన్నాడతను.

పన్నెండు దాటింది.. జయతోసహా అతను తోటలోకి వెళ్ళాడు. చీకటి ప్రదేశంలో ఇద్దరూ ఆగారు. అతను గొయ్యి తవ్వడం ప్రారంభించాడు. గోతులో నిలబడి అతను సిగరెట్ కాలుస్తున్నాడు. అతని తల మాత్రం ఆమెకు అస్పష్టంగా కనిపిస్తూంది.

ఏదో విజిల్ వినబడి ఇద్దరూ మౌనంగా వుండిపోయారు. బీటు కానిస్టేబులు రోడ్డమ్మట కదులుతున్నాడు. అతనెందుకో ఇంటి ముందు ఆగి, గేటుమీద లాఠీతో కొట్టి తన ప్రయాణాన్ని సాగించాడు. అతను బాగా దూరమయ్యాక రాజారావు తన పనిని మళ్ళీ కొనసాగించాడు.

తులసి శవాన్ని మోసుకెళ్ళి అతను గోతిలో పడేశాడు. అతను గబగబా గొయ్యిని మట్టితో పూడ్చేశాడు. గోతి

పైన చదునుగా చేశాడు.

అతని ఒంటినిండా చమట కార్తోంది. చేతుల నిండా మట్టి!

"జయా, వుయ్యార్ రియల్లీ ఫ్రీ!" అన్నాడతను.

జయ అతడిని చేతుల్తో చుట్టేసి, అతని పెదిమలను ముద్దెట్టుకుంది.

# 16

వారం రోజులపాటు అతను ఇంట్లో లేడు. బెంగుళూర్ మైసూర్ పట్నాల్లో పర్యటించి తిరిగొచ్చాడు.

కార్లోంచి ఒంటరిగా దిగిన అతని వేపు వంటామె మీనాక్షి ఆశ్చర్యంగా చూసింది.

"మీ వుత్తరం అందింది. మీరు వస్తారని తెలుసుకుని ఇక్కడ వేచి వున్నాను. అమ్మగారెక్కడ?" అందామె.

ప్రొఫెసర్ రాజారావు కళ్ళు తుడుచుకున్నాడు.

"మేం వెళ్తుండగా కారుకి యాక్సిడెంట్ అయింది. ఆమె కార్లోంచి కిందపడి మరణించింది. దహన క్రియలు మైసూరులోనే చేశాను," అన్నాడతను.

అతను చెప్పినది తోటమాలి కూడా విన్నాడు. రాజారావు తాళం తెరిచి లోపలకు వెళ్ళాడు. మేడ మీదున్న బాల్కనీలోంచి కిందకి చూస్తూ నిలబడ్డాడు.

"అక్కడ ఎవరో తవ్వి పూడ్చారయ్యా," అన్నాడు. తోటమాలి.

"నేనే తవ్వి విత్తనాలు నాటడం మర్చిపోయాను" అన్నాడతను.

కాసేపట్లో చీకటి పడింది. రాజారావు స్నానంచేసి వంటామె పైకి తెచ్చిన కాఫీ సేవించి, సిగరెట్ వెలిగించాడు.

అతను జయ ఫోన్ కాల్ కోసం ఎదురు చూస్తున్నాడు కాని ఎంతకూ ఆమె కాల్ రాలేదు. అర్థాకలిగా అతను తొమ్మిదింటికి భోజనంచేసి వంటామెను పంపేశాడు. కింద తలుపులు మూసి పైకి చేరుకున్నాడు. వాన కురుస్తూంది. ఆకాశాన్ని మెరుపులు చీలుస్తూ ప్రకాశిస్తున్నాయి. ఉరుములు భయంకరంగా మ్రోగుతున్నాయి.

విసుగ్గా అతను గ్లాసులో విస్కీ పోసుకుని సోడాకలపి గడగడ తాగేశాడు. వర్షం తగ్గే సూచనల్లేవు. ఇంత వర్షంలో ఆమె తనకు ఫోన్ చెయ్యలేదేమో!

బెంగుళూర్ వెళ్ళే ముందు అతనామెతో అంతా స్పష్టంగా చెప్పాడు.

"జయా, రెండు మూడు నెలలపాటు మనం కలుసుకో వద్దు. అటుపైన మన పెళ్ళి!" అన్నాడతను.

ఎక్కడో పిడుగు పడింది. అతని పడగ్గది కిటికీ తలుపులు టక టక కొట్టుకున్నాయి. అతను మంచి నిషాలో వున్నాడు. డాబా మీదకు వెళ్ళి వర్షంలో వుషారుగా తడుస్తూ నలువైపులా చూశాడు.

ఎవరో నవ్వుతూన్నట్లు వినిపించిందతనికి. అతను వెనక్కి తిరిగాడు. పక్కలకు చూశాడు. ఒక్కళ్ళు కాదు ఎందరో నవ్వుతున్నారు!

ఆకాశాన్ని మళ్ళా మెరుపు చీల్చింది. వెయ్యి రథ చక్రాలు కదులుతూన్నట్లు వురిమింది. గ్లాసులో మళ్ళీ విస్కీ పోసుకుని సోడా కలపకుండా తాగేశాడతను. గొంతును కాల్చుతూ విస్కీ లోపలకు దిగింది!

టెలిఫోన్ మ్రోగింది. జయ. స్వీట్ గర్ల్, ఇంత వర్షంలో కూడా తనకు ఫోన్ చేస్తోంది!

అతను తూలుతూ వెళ్ళి రిసీవర్ని అందుకున్నాడు.

"హలో!" అన్నాడు.

"రాజా, జయని!" అందామె.

"నీ కాల్ కోసం ఎదురుచూస్తున్నాను!"

"రాజా, నీకు బాడ్ న్యూస్ చెప్పాలి!"

"ఏమైంది?"

సమీపంలో పిడుగు పడింది. అతను త్రుళ్ళి పడ్డాడు.

"జయా, టెల్ మీ!"

"నా జీవితం నేను వూహించని విధంగా మలుపు తిరుగుతోంది, నేను పెళ్ళి చేసుకోబోతున్నాను..."

"ఎవర్ని?"

"శ్రీధర్‌ని. అతను ఎమ్మే పాసయ్యాడు. యువకుడు. ఈడుజోడుగా కుదిరిందని నాన్న అతడితో పెళ్ళి నిశ్చయం చేశాడు."

"జయా! జయా!! అర్చాడతను పిచ్చిగా.

"నువ్వు వయస్సులో నాకంటె చాలా పెద్దవాడవు. ఏదో చిరుగాలిమన్ని కొంత కాలంపాటు దగ్గర చేసి అంత రానమైంది. మనమధ్య రగులు కొన్నది ప్రేమకాదు. గుడ్డిగా మనుషుల్లో రేకెత్తే కామవాంఛ! రాజా, గుడ్ బై!"

అటువైపునుంచి క్లిక్‌మన్న శబ్దం వినపడింది. ఎన్నో కంఠాలు నలువేపుల నుంచీ నవ్వుతూ వికటాట్టహాసం చేస్తున్నాయి.

అతను పిచ్చివానిలా భార్య గదిలోకి పరుగెత్తాడు. తులసి పరుపుమీద పడుకున్నట్లు అనిపించింది. అతను అరుస్తూ పరుపుమీద పడ్డాడు.

ఏదో సైరన్ వినపడింది. అతను బాల్కనీలోకి వెళ్ళి కిందకు చూశాడు. పోలీస్ వాను కాంపౌండులో ఆగింది.

కానిస్టేబుల్స్ కిందకి దూకారు. వర్షంలో తడుస్తు న్నారు. ఎవరో ఇన్‌స్పెక్టర్ గబగబా తోటలో అడుగు లేసి ఒక చోట ఆగాడు.

రాజారావు వులిక్కి పడ్డాడు! జయ అంతా వాళ్ళకు చెప్పేసి వుంటుంది.

కానిస్టేబులు గునపాల్తో తవ్వుతున్నారు. కాసేపట్లో వాళ్లు తులసి శవాన్ని పైకి తీసి నేలమీద పడేశారు.

అతను గదిలోకి పరుగెత్తి విస్కీ బాటిల్ని చేత్తో పట్టుకున్నాడు. గబగబా గ్లాసులో పోసుకొని, పాయిజన్ కలుపుకొని త్రాగేశాడు. ఎవరో వీధి తలుపును తట్టారు. అతను మెట్లుదిగి మెల్లిగా తలుపు తెరిచాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ లోపలకొచ్చాడు.

"ప్రొఫెసర్ మీ భార్యను హత్య చేసినందుకు మిమ్మల్ని అరస్టు చేస్తున్నాను," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

అతని మనోఫలకం మీద జయ కనిపించింది. తనని కవ్వించి, కృతిమమార్గాన చెయ్యి పట్టుకునడిపించి, ఆఖరి క్షణంలో అతనికి స్వస్తి చెప్పిన మోసగత్తె!

ప్రొఫెసర్ రాజారావు సూటిగా ఇన్‌స్పెక్టర్ వైపు చూశాడు.

"నేనక్కడ శవాన్ని పాతినట్లు మీకెవరు చెప్పారు" అడిగాడతడు.

"మాకు రిపోర్టిచ్చినామె వాన్‌లోవుంది," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

రాజారావు తూలుతూ బయటకి నడిచాడు. అతని కిరు వైపులా పోలీసులు నిలబడ్డారు. ఇన్‌స్పెక్టర్ వాన్ దగ్గర కెళ్ళాడు.

రాజారావు వాన్ వైపు చూస్తున్నాడు. అందులోంచి ఒక స్త్రీ పాదాలు బయటకు కనిపించాయి. మరు క్షణంలో ఆమె కిందకి దూకింది. పట్టుచీర, మెళ్లో చంద్ర హారం, నుదురు మీద కుంకుమ బొట్టు.

రాజారావు గుండె పిచ్చిగా కొట్టుకుంది, తులసి! తన భార్య తులసి!!

"తులసీ!" అని అర్చాడతను.

పరుగెత్తుకెళ్లి ఆమెముందు పడ్డాడతను. అది అతని ఆఖరి కేక!

ఇన్స్పెక్టర్ నాయర్ అతనివైపు చూశాడు. అను మానంతో అతడిని ముట్టుకు చూశాడు. ప్రొఫెసర్ రాజా రావు మరణించాడు!

ఇన్స్పెక్టర్ నలువైపులా చూశాడు, వాన్లోంచి దిగిన స్త్రీ కోసం! ఆమె ఏమైంది? వర్షం కురుస్తోంది. ఆకాశంలోంచి మెరుపు తళుక్కుమంది.

ఆ కాంతిలో ఇన్స్పెక్టర్ కళ్ళకు ఆమె ఉల్కలా కనిపించి చటుక్కున మాయమైంది.

ఇన్స్పెక్టర్ నాయర్ మరోసారి తన ముందుపడున్న ప్రొఫెసర్ వైపు చూశాడు. విస్కీ బుడ్డి పక్కనే పగిలి పడుంది. వర్షం చినుకులు అతని శవానికి ఆఖరి స్నానాన్ని చేకూర్చుతున్నాయి!

—: ఐపోయింది :—

# దొంగ సొమ్ము

## సుజనశ్రీ

రాజారావు చేతులు స్టీరింగ్ మీద గట్టిగా బిగుసుకున్నయ్.

తెల్లవారుజామున మూడు గంటలు దాటుతోంది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నయ్. కారు వేగంగా పోతోంది.

రాజారావు గుండెల్లో పోటు కొద్దిగా నిమ్మళించినట్టు అనిపించింది. అతడి ఎడమ భుజంలో, గుండెకు పై భాగంలో, బుల్లెట్ దిగబడింది. ఆ గాయంనుంచి రక్తం కారుతోంది.

మధ్యమధ్య రాజారావు తన కుడిచేత్తో ఆ గాయాన్ని అదుముకుంటున్నాడు. అతడి చేయి రక్తసిక్తమయింది. ఆ చేత్తోనే స్టీరింగ్‌ని పట్టుకోవటంవల్ల స్టీరింగ్ వీల్ చుట్టూ

రక్తం అలుముకుంది.

క్షణక్షణానికి అతడిన్ని నీరసం కమ్ముకుంటోంది. ఉండి, ఉండి కళ్ళు బైర్లు కమ్ముతున్నయ్. దగ్గరలో ఎక్కడన్నా డాక్టరు వుంటే, అక్కడికి వెళ్ళామని అతడి ఊహ.

కోటు జేబులోంచి జేబుగుడ్డని తీసి, గాయంలో కుక్కాడు రాజారావు. రక్తస్రావం కొద్దిగా ఆగినట్టనిపించింది. అతడి ప్రక్కనే సీటుమీద పెద్ద లెదర్ బాగ్ నిండా, నోట్లకట్టలు కుక్కి-కుక్కి ఉన్నయ్.

రాజారావు మధ్యమధ్య తన రక్తపంకిలమైన చేత్తో ఆ నోట్లకట్టల్ని తడిమి చూస్తున్నాడు. ఆ చీకట్లో నోట్ల కట్టలమీద రక్తపు మరకలు పడటాన్ని అతడు గ్రహించ లేదు.

అతడి చూపు రియిర్ వ్యూ అద్దంమీద పడింది. అతడి కారు వెంబడే మరో కారు వస్తోంది. ఎవరైనా తనను వెన్నాడటం లేదుకదా అని ఒక్కక్షణం సందేహించాడు రాజారావు.

రెండో కారు, రాజారావు కారుకి సమంగా వచ్చింది. అందులో పోలీసులున్నారు.

బహుశా రాత్రిపూట గస్తీ తిరిగే పాట్రోల్ కారు కాబోలు అనుకున్నాడు రాజారావు.

ఒక పోలీసు, తల బయటకుపెట్టి రాజారావువంక అనుమానంగా చూశాడు. తర్వాత తన ప్రక్కనున్న డ్రైవర్ కి ఏదో చెప్పాడు. పోలీస్ కారు వేగాన్ని పుంజుకుని ముందుకు వెళ్ళిపోయింది.

రాజారావు బరువుగా నిట్టూర్చాడు. మూసివున్న దుకాణాల వరుస దాటుకుని వీధి చివరకు వచ్చాడు. మలుపు తిరిగి, అయిదు అంతస్తుల భవంతి చేరుకున్నాడు. చుట్టూ

తిరిగి వచ్చి, కారుని భవంతి వెనుకగా చెట్లలో ఆపాడు.

కారు దిగి, లెదర్ బ్యాగ్ ని చంకలో ఇరికించుకుని రివాల్వింగ్ గేటులోంచి లోపలకు వెళ్ళాడు రాజారావు.

ఆ భవంతిలో అయిదు అంతస్తులున్నయ్. అన్నిటిలోనూ ఏవేవో కంపెనీల తాలూకు ఆఫీసులున్నయ్. వాటి తాలూకు ఫ్యాక్టరీలూ, గోడౌన్లూ సిటీలో యెక్కడెక్కడో వుంటయ్. వ్యాపారం నడిపేందుకు వీలుగా వాటి తాలూకు ఆఫీసుల్ని మాత్రం, సిటీలో మధ్యగావున్న ఈ భవంతిలో ఏర్పాటు చేసుకున్నారు.

రాజారావు లిఫ్ట్‌లోకి వెళ్ళాడు. ఆ భవంతిలో ఉన్న ఆఫీసులన్నిటికీ ఒకటే లిఫ్ట్. పగలంతా అనేకమంది వస్తూ పోతూ వుంటారని సెల్ఫ సర్వింగ్ లిఫ్ట్ అంటే ఎవరికి వారే ఆపరేట్ చేసుకునేలా లిఫ్ట్‌ని ఏర్పాటు చేశారు.

అక్కడ ప్రత్యేకంగా లిఫ్ట్‌మ్యాన్ ఎవరూ లేక పోవడంవలన రాజారావు రాకను ఎవరూ గమనించలేదు. ఆ బిల్డింగ్ తాలూకు గూర్ఖా గేటవతల తీరిగ్గా బీడీ త్రాగుతున్నాడో, లేక సగం నిద్రలో జోగాడుతున్నాడో సరిగా కనబడటం లేదు.

రాజారావు నాలుగో అంతస్తు చేరుకున్నాడు. నలభై ఆరో నెంబరు ఆఫీసుదగ్గర ఆగాడు. లిఫ్ట్‌నుంచి అతడు నడచినంత మేరా నెత్తుటిబొట్లు, నున్నటి గచ్చుమీద బారుగా పడటాన్ని అతడు గమనించే స్థితిలో లేడు.

జేబులోంచి తాళంచెవి తీసి, తలుపులోకి దూర్చి త్రిప్పాడు. తలుపు తెరుచుకుని లోపలకు వెళ్ళాడు. తూలుతూ వెళ్ళి రివాల్వింగ్ ఛైర్‌లో కూలబడ్డాడు రాజారావు.

తన చంకలోని లెదర్ బ్యాగ్ ని టేబిల్ మీదకు జార విడిచాడు. టేబుల్ మీద బ్యాగ్ పడంగానే, ఆ కుదుపుకు బ్యాగ్ లోంచి రెండు నోట్లకట్టలు గచ్చునేలమీద పడినయ్. ఒకటి టేబుల్ అడుగున మరుగు పడిపోయింది. రెండోది మాత్రం నెత్తురు మరకలతో టేబుల్ దగ్గరగా పడింది.

రాజారావు తన జేబులోంచి రివాల్వర్ ని తీసి చేతిలో రెడీగా పట్టుకుని కూర్చున్నాడు. తనను ద్రోహంచేసి, హత్యచేసే ప్రయత్నంలో తనను రివాల్వర్ తో కాల్చిన మురళీధర్ తనకోసం వెదకుతూ వుంటాడు ఈసరికి. తను ఎక్కడా కనబడక విసుగెత్తి, ఆఫీసుకు వస్తాడు. తలుపు తెరుస్తూనే అతగాడి సీటులో తనను చూసి ఆశ్చర్యపోతాడు. ఎందుకంటే రాజారావు ఇక్కడ వుంటాడని అతడు కలలోగూడ ఊహించివుండడు.

అయితే మురళీధర్ ఆశ్చర్యంలోంచి తేరుకునేలోపలే, తన చేతిలో రివాల్వర్ పనిచేస్తుంది. మురళీధర్ యమసదనానికి చేరుకుంటాడు. అప్పటికి తన కసి, పగ చల్లారుతాయి. ఆ తర్వాత తీరికగా తను చచ్చినా ఫరవాలేదు. ఇదీ రాజారావు ఆలోచన!

రాజారావుకి తను కూర్చున్న మేడ, విష్ణుచక్రంలా గిరగిర తిరుగుతున్నట్టుగా తోచింది. అతడి గుండెలో పోటు ప్రారంభమయింది. మురళీధర్ వచ్చేదాకానన్నా తను ప్రాణాలతో నిలవగలడా అన్న సంశయం కలిగింది.

వెంటనే డాక్టర్ కి ఫోన్ చేద్దామనుకున్నాడు. టేబిల్ మీద ఫోన్ వుంది.

రిసీవరెత్తి చెవిదగ్గర పెట్టుకున్నాడు. రెండోచేత్తో డయల్ లో ఒక అంకె త్రిప్పాడు. మరో అంకె త్రిప్పేం

దుకు అతడి చూపుడు వ్రేలు డయల్ మీద వాలింది. అతడి నరనరాల్లోనూ శక్తి సన్నగిల్లింది. పెద్దరోడ్డు చదును చేసే రోలర్ బండను లాగుతున్నట్టుగా వుంది అతడికి, డయల్ ని త్రిప్పేందుకు!

డయల్ సగంలోనే ఆగిపోయింది. అతడు టేబుల్ మీదకు వాలిపోయాడు. అతడి చేతిలోని రిసీవర్ జారిపోయింది. కుర్చీ ప్రక్కగా, టేబుల్ మీదుగా క్రిందకు వ్రేలాడుతోంది రిసీవర్.

రెండో చేయి చూపుడు వ్రేలు మాత్రం డయల్ లోనే ఇరుక్కుపోయింది. అతడి ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసిపోయాయి.

## 2

ఆరోజు ఆదివారం. దుకాణాలకూ, ఆఫీసులకు సెలవు.

అయినా కాంతారావు తెల్లవారుజామునే స్కూటర్ మీద ఆఫీసుకు బయలుదేరాడు. మర్నాటికల్లా ఇన్ కమ్ టాక్సు లెక్కలు పూర్తి చేయకపోతే, ఇరవై వేల రూపాయలు పెనాల్టీ పడుతుంది, తన బాస్ మీద. అంటే ఆ కంపెనీలో తన ఎకౌంటెంట్ పోస్టు పీకేయటం ఖాయం.

గేట్లో గూర్ఖా కాఫీ త్రాగటానికి వెళ్ళాడేమో, అతడు వస్తే, గేటు తెరచే మనిషిగూడ లేడు. కాంతారావు గూర్ఖావాడ్ని తిట్టుకుంటూ, స్కూటర్ దిగి, గేటు తెరుచుకుని, మళ్ళీ స్కూటరెక్కి లోపలకు ప్రవేశించాడు.

గబగబ అడుగులు వేసుకుంటూ లిఫ్ట్ చేరుకున్నాడు. ఎన్నో ఏళ్ళబట్టి అతడా లిఫ్ట్ లో ఎక్కి దిగుతున్నాడు. లిఫ్ట్ లో నాలుగో నెంబరు బటన్ నొక్కాడు పరధ్యాన్నంగానే!

నాలుగో అంతస్తులో లిఫ్ట్‌లోంచి బయటపడి, తన రూమ్ వేపుగా నడిచాడు. నలభైఆరో నెంబరు గది దాటుకుని నలభైఏడో నెంబరు గదిలో తన ఆఫీసు చేరుకున్నాడు. తన బాస్ గది, అంటే నలభైఆరో నెంబరు గది, తలుపు దగ్గరగా లాగి వుండటాన్ని గమనించి ఆశ్చర్యపడ్డాడు.

బాస్ మురళీధర్ అప్పుడే ఆఫీసుకు తగలడ్డాడా అనుకుంటూనే తలుపు తోసుకుని లోపలకు వెళ్ళాడు.

"గుడ్ మార్నింగ్ సార్!" అన్నాడు ప్రవేశిస్తూ.

టేబుల్ మీదకు వాలిపోయివున్నాడు ఎవరో వ్యక్తి. అతడి క్రాపువల్ల, ఆ వ్యక్తి మురళీధర్ కాదని గ్రహించాడు. మురళీధర్‌ది బట్టతల! అయితే ఈ వ్యక్తి ఎవరని? అతడికిక్కడేం పని?

అతడెవరైతే తనకు ఎందుకులే అనుకుని వెనుదిరగబోయాడు కాంతారావు. టేబుల్ మీద తెరచుకునివున్న లెదర్ బ్యాగ్ అతడి చూపుల్ని ఆకర్షించింది. ఆత్రంగా అతడు టేబుల్‌ని సమీపించాడు.

ఒకవేళ టేబుల్ మీద వాలిపోయివున్న వ్యక్తి దొంగ నాటకం ఆడుతున్నాడేమో అని ఒక్క క్షణం తటపటాయించాడు. చివరకు ఆ వ్యక్తికి శ్వాస ఆడటంలేదని రూఢి చేసుకుని, లెదర్ బ్యాగ్‌ని ఇవతలకు లాగి చూశాడు. గర్భిణీస్త్రీ పొట్ట ఉబికినట్టుగా, సంచీ లావుగా వుంది. దాంట్లో నోట్లకట్టలు కుక్కి, కుక్కి సర్దబడి వున్నయ్.

చచ్చిపోయిన వ్యక్తి, అతడి ప్రక్కనే అపారమైన ధనం! కాంతారావుకి చెమటలు పట్టినయ్. వెంటనే పోలీసులకు తెలియజేస్తేనో? లాభం లేదు! వాళ్ళు వచ్చి తననే హంతకుడి క్రింద జమకడితేనో! తన మాటలు వాళ్ళు నమ్ముతారని ఋజువేమిటి?

కనుక తను రెండో కంటివాడికి తెలియకుండా ఈ లెదర్ బ్యాగ్ ని చంకన పెట్టుకుని ఉడాయిస్తేనో! డబ్బు ఇవ్వగల సుఖసౌఖ్యాలన్నీ అతడి కళ్ళముందు తిరిగినయ్. అతడిలో ఆశాపిశాచం ప్రవేశించింది.

అదృష్టం బాగుండి తను ఎక్కడా చేయి పెట్టలేదు. కనుక తన వేలిముద్రలు పోలీసులకు దొరికే అవకాశం వుండదు.

లెదర్ బ్యాగ్ చేతుల్లోకి తీసుకున్నాడు కాంతారావు. బ్యాగ్ బరువుగా తోచింది. అతడు తన జీవితంలో అంత కరెన్సీని చూసి ఎరగడు.

ఇంత డబ్బుని ప్రక్కనే పెట్టుకుని ఈ వ్యక్తి ఆత్మహత్య చేసుకున్నాడా? ఎందుకని? ఈ డబ్బు దొంగనోట్లు తాలూకా?

ఒక నోట్లకట్ట తీసుకుని పరీక్షగా చూశాడు. దొంగ నోట్ల గురించి అతడికంతగా తెలీకపోయినా, ఆ నోట్లు మంచివేనన్న విశ్వాసం కుదిరింది అతడికి.

లేక ఈ వ్యక్తి ఇంత డబ్బుని ఎక్కడ్నుంచన్నా దొంగిలించి తెచ్చాడేమో! పోలీసులు కానీ, అతడి శత్రువులు కానీ అతడ్ని కాల్చి ఉండవచ్చు. ఆ వ్యక్తి ఇక్కడకు చేరుకుని ప్రాణాలు వదిలాడు.

ఏమయినా ఒకటిమాత్రం ఖాయం! అతడిక్కడకు చేరుకుని ప్రాణాలొదిలిన తర్వాత, అక్కడకు వచ్చిన ప్రథమ వ్యక్తి తనే! తనకంటె ముందు ఇంకెవరైనా వచ్చి వుంటే, ఆ డబ్బు ఈ పాటికి మాయమయిపోయి వుండేది.

కాంతారావు తన జీవితంలో ఎన్నడూ దొంగతనం చేసి ఎరగడు. ఇప్పుడా పని చేయాలంటే కాళ్ళూ, చేతులూ వణుకుతున్నయ్. పోనీ ఆ పని చేయకుండా మాను

కుందామా అంటే, అంత డబ్బుని వదిలి వెళ్ళటానికి అతడి మనసు అంగీకరించటం లేదు సుతరామూ!

అతికష్టంమీద లెదర్ బ్యాగ్ జిప్ లాగి, బ్యాగ్ ని మూయగలిగాడు. బ్యాగ్ చంకలో పెట్టుకుని లిఫ్ట్ లోకి వచ్చిపడ్డాడు. జేబుగుడ్డతో లిఫ్ట్ బటన్స్ మీద తన వ్రేలి ముద్ర లుంటాయేమో అని శుభ్రంగా తుడిచాడు.

లిఫ్ట్ దిగి, బ్యాగ్ స్కూటర్ కేజ్ లో పడేసి, స్కూటర్ స్టార్ట్ చేశాడు. మెయిన్ గేటుగుండా కాకుండా, భవంతి చుట్టూ ప్రదక్షిణంచేసి వెనుకవైపు గేటులోంచి రోడ్డెక్కాడు.

అక్కడే చెట్లమధ్యలో కారు నిలిచివుండడం చూశాడు శాంతారావు. అది చనిపోయిన వ్యక్తిదై ఉండాలను కున్నాడు.

స్కూటర్ వేగాన్ని హెచ్చించాడు. తన నివాసానికి చేరుకున్నాడు.

అతడు మూడంతస్తుల మేడలో పైవాటాలో చివరి భాగంలో వుంటున్నాడు. గబగబ మెట్లెక్కి తన పోర్షన్ లోకి జొరబడి తలుపు మూసుకున్నాడు.

## 3

మిస్ అరుణ బద్ధకంగా బెడ్ మీదనుంచి లేచింది. టేబుల్ మీద గడియారం ఏడుగంటలు చూపుతోంది. ఆమె అదిరిపడింది.

ఎక్కడికో క్యాంప్ వెళ్ళాలని లేడీ ఆఫీసర్ తనను ఆరోజు ఏడున్నరకల్లా రమ్మంది. ఆదివారం డ్యూటీకి వెళ్ళాల్సిరావటం ఒకందుకు బాధ. రెండోది తను మామూలుగా ఎనిమిదయితే కానీ నిద్ర లేవదు!

మిస్ అరుణ స్త్రీ సంక్షేమశాఖ డిప్యూటీ డైరక్టరు ఆఫీసులో సెక్రటరీగా పనిచేస్తోంది. డిప్యూటీ డైరక్టర్

మిసస్ రామతిలకం ఆదివారంనాడు మరో ఊరికి క్యాంప్ వేసుకుంది. ఆమెకు క్యాంప్‌కి కావలసిన ఫైళ్ళు పుటప్ చేయాలి. డ్రాఫ్టులూ, స్టేట్‌మెంట్సూ టైపు చేయాల్సి వుంది.

మర్నాడు తెల్లవారుజామునే లేవటం ఎలాగా అని ఆలోచిస్తుంటే, శనివారం సాయంకాలం కాంతారావు కలిశాడు. తను ఆరుగంటలకే ఆఫీసుకు పోవాల్సివుందని చెప్పాడు అరుణతో.

కాంతారావు, అరుణ ఇద్దరూ ప్రేమించుకున్నారు. త్వరలో పెళ్ళి నిశ్చయం కావల్సి వుంది. వేరువేరుచోట్ల ఉద్యోగాలు చేస్తున్నా, రోజూ ఇద్దరూ కలుసుకుంటూ వుంటారు. పైగా అరుణ నివసించేది, కాంతారావుండే బిల్డింగ్‌కి ఎదురు బిల్డింగ్‌లోనే!

అందుకే కాంతారావు ఆఫీసుకు వెళ్ళేటప్పుడు తనను కూడ లేపమని కోరింది అరుణ. కాంతారావు సరే నన్నాడు.

కానీ కాంతారావు తనమాట నిలబెట్టుకోలేదు. అందుకే ఆమెకు అతగాడిపై కోపం వచ్చింది. కాంతారావు ఫ్లాట్‌కి వెళ్ళి, అతడ్ని ఎడాపెడా వాయించేద్దామన్నంత కోపం కలిగింది.

అద్దంలో చూసుకుని జడ సరిచేసుకుంది. పళ్ళు తోము కుని ముఖం కడుక్కుంది. గదికి తాళం వేసి, విసవిసా కాంతారావు ఇంటికి వచ్చింది.

దబదబ తలుపు బాదింది.

లోపల అతి రహస్యమైన పని చేస్తున్న కాంతారావుకు ఆ చప్పుడు విని గుండె ఆగినంత పని అయింది. ఇంతలోనే పోలీసులు తన నేరాన్ని పసిగట్టారా అని భయంతో

బిగుసుకుపోయాడు.

అంతలో అరుణ కంఠం విని, అతడు తలుపు తెరిచాడు. అరుణ సుడిగాలిలా దూసుకువచ్చింది లోపలకు. కాంతారావు తలుపు మూసి గడియపెట్టి ఆమెవంక అయోమయంగా చూశాడు.

"నన్ను ఆరుగంటలకే లేపుతానని, నీవు ఇంట్లోనే ఇంకా నిద్రపోతున్నావా?" అని అరిచింది అరుణ.

అప్పుడుగాని కాంతారావు తో ట్రుపడుతున్న సంగతిని గ్రహించలేదు ఆమె! అతడు నిద్రనుంచి ఇప్పుడే లేవ లేదనీ, తెలుసుకుంది. బాత్‌రూమ్‌లో గుడ్డలుతుకుతున్నాడేమో అనుకుంది! కాంతారావు చేతులకైన సబ్బు నురుగుని బట్టి!

"ఏమిటీ? ప్రొద్దునే గుడ్డలుతుకుతున్నావా?" అంటూ బాత్‌రూమ్ వేపు పరుగుపెట్టింది అరుణ.

ఈ హఠాత్పరిణామానికి కాంతారావు ఇంకా బెంబేలు పడిపోయాడు. అతడు అరుణను అభ్యంతర పెట్టబోయాడు. కానీ అప్పటికే సమయం మించిపోయింది.

స్టవ్ మీద పెనం కాలుతోంది. కొన్ని వందరూపాయల నోట్లను పెనంమీద వేసి వెచ్చచేస్తున్నట్టుగా తోచింది ఆమెకు.

మరి కొన్ని నోట్లు సర్ఫ్‌లో తడుపబడి ఆరబెట్టబడి ఉన్నయ్. బహుశా వాటినిగూడ పెనంమీద వేస్తే, తడి ఆరిపోయి, నోట్లు పెళపెళ లాడుతయ్ కాబోలు.

"కాంతారావ్! ఏమిటిదంతా? ఈ నోట్లేమిటి? వాటిని ఉతికి, పెనంమీద ఆరబెట్టడం ఏమిటి?" అరుణ అయోమయంగా అడిగింది.

"అరుణా! కొంపదీసి నీ విక్కడ చూసిన విషయాన్ని ఎక్కడా పొక్కకు. నీతో నిజం చెబుతున్నాను! రాత్రి నేను ఎమ్యూజ్ మెంట్ పార్కుకు వెళ్ళాను. స్కిల్ గేమ్స్‌లో నా అదృష్టం తిరిగింది. నేను రెండు వేల రూపాయలు గెలుచుకున్నాను. ఆ డబ్బుతో నేను తిరిగి రాబోతుంటే, ఆ పార్కులోని రౌడీ గ్యాంగ్ కి కన్ను కుట్టి నాతో దెబ్బలాటకు దిగారు. ఆ ఘర్షణలో నా చేతులోని కొన్ని నోట్లు బురదలో పడినయ్. వాటిని శుభ్రం చేస్తున్నాను! అంతే! నా మాట నమ్ము అరుణా!" తడబడే మాటలతో, అప్పటి కప్పుడు ఓ కట్టు కథ అల్లి చెప్పాడు కాంతారావు.

అరుణకు అతడి మాటలు నమ్మ బుద్ధి కాలేదు. అయినా ఇప్పుడు తను అతడితో వాగ్వివాదం పెట్టుకునే స్థితిలో లేదు. ఇంకో అరగంటలో తను తెమలాలి. తనపై ఆఫీసరు క్యాంప్ కి తయారు కావల్సిన పని బోలెడంత ఉంది గదా మరి!

"సరే! నే వస్తాను మరి!" అని లోనికి వచ్చిన దూకుడుగా వెళ్ళిపోయింది అరుణ.

## 4

అరుణ తన మాటల్ని నమ్మలేదని ఆమె చూపుల్ని బట్టే అర్థం చేసుకున్నాడు కాంతారావు. నిజమే మరి! తను చెప్పిన అబద్ధాన్ని మూడేళ్ళ పిల్లవాడు గూడ ఇట్టే పసిగట్టేయ గలడు మరి.

అయితే అరుణ తను చూసిన విషయాన్ని పోలీసులకు రిపోర్టు చేయదని విశ్వాసం మటుకు ఉన్నది కాంతారావుకు.

కాని, నలభై ఆరో నెంబరు గదిలో, మురళీధర్ ఎంటర్ ప్రైజెస్ ఆఫీసులో ఉన్న శవాన్ని పోలీసులు గమనించంగానే, తననుగూడ పోలీసులు ప్రశ్నించ వచ్చు. తన ఇల్లు సోదా చేస్తారు. బాత్ రూమ్‌లో దాచి ఉన్న నోట్ల కట్టల్ని దొరకబుచ్చుకుంటారు.

కనుక వాటిని తను ఎక్కడైనా దాచాలి! అదే ఎక్కడని! రక్తపు మరకల్ని కడిగి, ఆరబెట్టిన నోట్లను గూడ వేరే జిప్ బ్యాగ్‌లో సర్దాడు. దానికి తాళం వేశాడు. పాత లెదర్ బ్యాగ్‌ని కత్తితో చిన్నచిన్న ముక్కలుగా కోసి, డ్రైనేజి గొట్టంలోకి జారవిడిచాడు.

స్కూటర్ మీద బయలుదేరాడు కాంతారావు.

స్కూటర్ కేజ్‌లో సాదా క్యాంప్ బ్యాగ్‌లో దాదాపు లక్షా ఎనభై వేల రూపాయల రొఖ్ఖం ఉంది. దాన్ని ఎక్కడ దాచాలా అని అతడు ఆలోచిస్తున్నాడు.

ఆర్. టి. సి. బస్ స్టాండ్ చేరుకున్నాడు కాంతారావు. అక్కడ గోడమీద పెద్దపెద్ద అక్షరాలతో "మీ సామానులు భద్రపరచుకొనే గది" అని బాణం గుర్తుంది. పాతగుడ్డల సంచీని సామానుల గది, క్లోక్ రూమ్‌లో భద్రపరుచుకున్నారనే అనుకుంటారు గానీ, రెండు లక్షల రూపాయల్ని పాత చింతపండు సంచీలో అక్కడ దాచి పెట్టారని ఎవరూ ఊహించలేరు.

కాంతారావు క్లోక్ రూమ్ కేసి నడిచాడు. కౌంటర్‌లో సంచీని గుమాస్తాకు అందించాడు. అతడు అందించిన రశీదు తీసుకుని బస్ స్టాండు బయటకు నడిచాడు.

ఆ రశీదు గూడ తన దగ్గర ఉంచుకోవడం మంచిది కాదనిపించింది. జేబులోంచి కవరుతీసి దానిమీద తన అడ్రసే వ్రాసుకున్నాడు. క్లోక్ రూమ్ రశీదును కవర్లో

ఉంచాడు. పోస్టాఫీసుకు వెళ్ళి దాన్ని రిజిస్టర్ చేశాడు. మూడు నాలుగు రోజుల తర్వాత అది భద్రంగా తనకు అందజేయబడుతుంది రిజిస్టర్డ్ పోస్ట్‌లో.

# 5

మురళీధర్ ఎంటర్ ప్రైజెస్ ఆఫీసునిండా పోలీసులూ, ఫోటోగ్రాఫరూ అంతా గుమిగూడి ఉన్నారు.

ఎలివేటర్‌లో నెత్తురుబొట్లు ఎండిపోయి కనబడినయ్. అవే మరకలు నాలుగో అంతస్థులో ఎలివేటర్ నుంచి నలభై ఆరో నెంబరు గదివరకూ స్పష్టంగా కనబడుతున్నయ్.

హతుడు రాజారావు దేహంలో రెండు బుల్లెట్లు దిగబడి ఉన్నయ్. అందులో ఒకటి .38 కాలిబర్‌ది. రెండోది .32ది. అంటే ఇద్దరు వ్యక్తులు అతడ్ని కాల్చారన్నమాట! అతడు ఆత్మహత్య చేసుకోలేదని రూఢి అయింది.

"పిస్టల్ గాయాలు తగిలిన వాడు ఆస్పత్రికి పోక ఇక్కడికెందుకు వచ్చినట్టు? బహుశా ఇక్కడకు వచ్చి డాక్టర్‌కి ఫోన్ చేయటానికి యత్నించాడేమో! అంతలోనే అతడి ప్రాణాలు పోయి ఉంటయ్" అన్నాడు ఇన్స్పెక్టర్ రాజేంద్ర.

"అవును సార్!" అని తలూపాడు సార్జంట్ ఆర్ముగం.

మరో కానిస్టేబుల్ టేబుల్ క్రిందా, కుర్చీ క్రిందా పడి ఉన్న నోట్ల కట్టల్ని బయటకు లాగి ఇన్స్పెక్టర్ ముందుంచాడు. అందులో ఒక కట్టమీద రక్తపు మరక లున్నయ్.

"అంటే ఇతడ్ని డబ్బుకోసం హత్య చేయలేదన్నమాట!" సార్జెంట్, రాజేంద్రవంక చూస్తూ అన్నాడు.

మురళీధర్ సెక్రటరీ, స్టెనోటైపిస్ట్ సరితకు కబురు పెట్టారు. సరిత వచ్చింది. చనిపోయిన వ్యక్తి తన బాస్ మురళీధర్ కాడనీ, అతడు రాజారావనీ గుర్తించింది.

"రాజారావు గూడ ఈ ఫరమ్‌లో పార్ట్‌నరా?"

"అవునండీ! మొదట మురళీధర్ గారే ఈ కంపెనీని స్థాపించారు. గత కొద్ది సంవత్సరాల నుంచి విపరీతమైన నష్టం వచ్చింది. అప్పుడు రాజారావు మరికొంత పెట్టుబడిని సమకూర్చాడు."

"మధ్యలో పార్ట్‌నర్‌గా వచ్చాడన్నమాట! రాజారావు ఎప్పుడూ ఆఫీసు దగ్గరే ఉండేవాడా!"

"లేదు! ఆయన ఎన్నడూ ఆఫీసుకు వచ్చి ఎరగడు! మెజెస్టిక్ హోటల్ నుంచి మురళీధర్ కోసం ఫోన్ చేసే వాడు. మురళీధర్ హోటల్‌కి వెళ్లేవాడు!"

"చనిపోయిన రాజారావు గురించి నీ కేమైనా తెలుసా?"

"అతడి నివాసం బీచ్ రోడ్‌లో చివరగా ఉంది. అతడి భార్యపేరు కాంతిమతి. అంతకన్న నాకు మిగతా వివరాలేం తెలీదు."

"పోతే మురళీధర్ ఎక్కడికి వెళ్ళాడో నీకు తెలిసి ఉండాలి! నీ వతని సెక్రటరీని గదా!"

"నిజమేనండి. ఏదైనా ఆఫీసు వ్యవహారా లయితేనే గదా నాకు తెలిసేది. అతడు నిన్న పెందలాడే ఇంటికి వెళ్ళిపోయాడు. సాయంకాలం ఆఫీసుకు రాననీ, తన కేదైనా ఫోన్ కాల్ వస్తే, ఇంటికి డైరక్ట్ చేయమనీ చెప్పాడు." సరిత నిదానంగా బదు లిచ్చింది.

"మురళీధర్ భార్యను గూడా విచారించి వస్తున్నాం! రాత్రి తొమ్మిదివరకు అతడు ఇంట్లోనే ఉన్నట్టు తెలిసింది. ఆ తర్వాత హోటల్ మెజెస్టిక్ నుంచి ఫోన్ వచ్చిందిట. మురళీధర్ హడావిడిగా వెళ్ళిపోయాడు ఇల్లు వదిలి. తిరిగి

ఇంతవరకూ ఇల్లు చేరలేదట!" సార్జంట్ ఆర్ముగం చెప్పాడు.

"అది ఆయనకు పరిపాటే! ఒక్కొక్కసారి ఇటు ఆఫీసులోనూ, అటు ఇంట్లోనూ చెప్పకుండా, నాలుగైదు రోజుల పాటు ఎక్కడెక్కడికో వెళ్ళి రావటం, మురళీధర్ కేం కొత్తకాదు. అందుకే బహుశా మురళీధర్ భార్య ఆరాటం చెందలేదు, ఒక రాత్రికి భర్త తిరిగి రాకపోతే!" అంది సరిత.

"మురళీధర్ చేసే వ్యాపారం ఏమిటో?"

"టేప్ రికార్డర్లూ, ట్రాన్సిస్టర్లూ తయారుచేసే ఫ్యాక్టరీ ఉంది అతగాడికి."

"ఈ ఆఫీసు డూప్లికేట్ కీ రాజారావు దగ్గర కూడా ఉందా?"

"ఉన్నదండీ!"

"మురళీధర్, రాజారావు మధ్య సంబంధం ఎలా ఉండేది?"

"వాళ్ళిద్దరూ కలిసి ఉండగా నేనొక్కసారిమాత్రమే చూడటం తటస్థించింది. ఇద్దరూ చాలా స్నేహంగా కనిపించారు. పైగా నాకు తెలిసినంతమట్టుకూ ఆ ఇద్దరి మధ్యన ఎటువంటి విభేదాలూ లేవనుకుంటాను."

"సరే! ఇక నీవు వెళ్ళచ్చు!"

హైహీల్స్ షూస్‌ని టకటక లాడించుకుంటూ వయ్యారంగా నడుస్తూ వెళ్ళిపోయింది సరిత.

వెళ్ళిపోతున్న సరిత వంకే చూస్తూ ఉండిపోయాడు ఇన్స్పెక్టర్ రాజేంద్ర. ఆమె ఏదో దాస్తున్నదన్న ఊహ కలిగిందతడికి.

# 6

సోమవారం నాడు పోలీసులు ఆఫీసు స్టాఫ్‌ని ప్రశ్నించ సాగారు.

"మిస్టర్ కాంతారావ్! మీరు నిన్న ఆఫీసుకు రాలేదా?" ఇన్స్పెక్టర్ రాజేంద్ర కంఠం ఖంగుమంది.

"అబ్బే! నిన్న ఆదివారం కదండీ! అందుకని నేను ఆఫీసుకు రాలేదు!" అన్నాడు కాంతారావు బుకాయింపుగా.

"మీరు సెలవు రోజుల్లో గూడ తరుచుగా ఆఫీసుకు వస్తుంటారని తెలిసింది. అందుకని అడిగాను."

"అదీ నిజమే ననుకోండి! నేనిక్కడ ఎకౌంటెంట్‌ని అవటంవల్ల అటు లేబర్ డిపార్టుమెంట్, ఇన్‌కమ్‌టాక్స్, సేల్స్‌టాక్స్ లెక్కలు తయారు చేయటంలో పని ఎక్కువే ఉంటుంది. అందుకని అప్పుడప్పుడు సెలవుల్లో గూడ వస్తుంటాను. కానీ నిన్న ఒక స్నేహితుడ్ని రిసీవ్ చేసుకోవటానికి ఆర్. టి. సి. బస్ స్టాండ్‌లో చాలా సేపు వెయిట్ చేశాను. చివరకు స్నేహితుడు రానేలేదు. విసుగెత్తి అలంకార్‌లో మ్యాటినీకి వెళ్ళాను" అని చెప్పాడు కాంతారావు.

అతని సమాధానానికి ఇన్స్పెక్టర్ రాజేంద్ర తృప్తి పడ్డట్టున్నాడు, తర్వాత వ్యక్తికి పిలుపు వచ్చింది.

కాంతారావు ఇన్స్పెక్టర్ గదిలోంచి బయటకు వచ్చి, గుండెలనిండా గాలి పీల్చుకున్నాడు.

మధ్యాహ్నానికి ఆఫీసులో అందర్నీ ప్రశ్నించటం పూర్తయింది. కానీ ఎటువంటి ఆధారాలూ దొరకలేదు, రాజారావు హత్యకు.

పోలీస్ జీప్ బీచ్‌రోడ్ మీద పరుగులు తీసింది. 8-2-74 నెంబరు బంగళా ముందు ఆగింది.

సముద్రపు ఒడ్డున విశాలంగా కట్టబడిన బంగళా అది.

కాలింగ్ బెల్ నొక్కగానే పని మనిషి వచ్చి తలుపు తెరిచింది. వచ్చిన పోలీసు అధికారుల్ని డ్రాయింగ్ రూమ్‌లో కూర్చోబెట్టింది. మేడమీదకు వెళ్ళి అమ్మగార్ని పిలుచుకు వచ్చింది.

చనిపోయిన రాజారావు భార్య కాంతిమతి అందంగా ఉంది. ఎర్రగా, కొద్దిపాటి లావుగా, పిల్లలు లేరేమో, పొంకంగా ఉన్న శరీరంతో ఆకర్షణీయంగా ఉంది.

"చూడండి మాడమ్! మీకీ దుర్వార్తను ఎలా చెప్పాలో తెలియటం లేదు!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర.

కాంతిమతి ముఖం నిశ్చలంగానే ఉంది. "బహుశా నా భర్తగురించే ననుకుంటాను!" అంది నిర్వికారంగా.

"అవును. మీ భర్త రాజారావు నెవరో కాల్చి చంపారు."

పనిమనిషి బోర్నవిటా తెచ్చి ముగ్గురికీ అందించింది. కాంతిమతి కప్పు ఖాళీచేశాక నింపాదిగా అడిగింది. "ఎలా జరిగింది ఈ హత్య?"

"మీ భర్త ఆకస్మిక మరణం గురించి విన్నాక గూడా మీలో ఏ రకమైన ఉద్వేగమూ కలగకపోవడం మాకు ఆశ్చర్యాన్ని కలగజేస్తున్నది" ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర ఆమె ప్రవర్తనకు విస్తుపోతూ అడిగాడు.

కాంతిమతి పిచ్చిదానిలా చిరునవ్వు నవ్వింది.

"అతను ఏనాడైనా ఇలాంటి దుర్మరణం పాలు కావలసిన వ్యక్తే అని నాకు ముందే తెలుసు, కానీ అతడి మరణం ఇంత త్వరగా వస్తుందని ఊహించలేక పోయాను."

"మీ ఊహకు, కారణం చెప్పగలరా?"

"అతడికి లేని దుర్వ్యసనాలు లేవు. పేకాట, త్రాగుడూ, వ్యభిచారం, గుర్రపు రేసులు! కొన్నాళ్ళు ప్రతిరోజూ ఒక ఉంపుడుగత్తెను ఇంటికే తీసుకువచ్చేవారు. ఒకసారి నేనే ఎదురు తిరిగాను. మరోసారి అలాంటిపని జరిగితే, నా భర్తనూ, అతడి విటురాల్నీ కాల్చి చంపుతానన్నాను. దాంతో ఆ బజారు స్త్రీలను ఇంటికి తీసుకురావడం మానేశాడు."

"మీ భర్తను ఆఖరుసారిగా ఎప్పుడు చూశారు?"

"బహుశా రెండు రోజులయి ఉంటుంది."

"ఎక్కడికి వెళ్తున్నదీగూడా చెప్పలేదా?.'

"అలా చెప్పే అలవాటు ఆయనకూ లేదు, అడిగే అలవాటు నాకూ లేదు."

ఆమెతో మాట్లాడి నందువల్ల ఇంక ఏం ప్రయోజనం ఉండదనుకున్నాడు రాజేంద్ర. కుర్చీలోంచి లేస్తుండగా కాంతిమతి అడిగింది. "వారి అంత్యక్రియలకు ఏర్పాట్లు చేయాలనుకుంటాను. శవాన్ని ఎప్పుడు అప్పజెబుతారు?"

"పోస్ట్‌మార్టమ్ అదీ చేయాల్సి ఉంటుంది! ఆ తర్వాత నే శవం మీకు అప్పగించబడుతుంది!" భర్త చావును అతి సామాన్యంగా, అతి నిర్లక్ష్యంగా ఎంచిన కాంతిమతి ప్రవర్తనకు ఆశ్చర్యపోయాడు రాజేంద్ర.

# 7

కాంతారావు పేపరు తిరగేస్తున్నాడు ఆత్రంగా. ఆ రోజు లోకల్ పత్రికలో రాజారావు హత్య గురించిన సమాచారం ప్రచురింపబడి ఉంది. మురళీధర్ రాజారావులు కలసి ఏదో అక్రమ వ్యాపారం సాగిస్తున్నట్టుగా పోలీసులు అనుమానిస్తున్నారట. హత్య చేయబడిన రాజా

రావు పార్ట్‌నర్ మురళీధర్ వస్తే మరికొన్ని రహస్యాలు బయటపడవచ్చనీ, అతడికోసం పోలీసులు అన్వేషిస్తున్నారని ఉంది. ఇంతవరకూ ఎవరూ అరెస్టు చేయబడలేదనీ గూడ ప్రచురింపబడింది.

ఆ ప్రకటనలో లక్షల డబ్బు గురించి సమాచారమేమీ లేకపోవటం కాంతారావుకు ఆశ్చర్యాన్ని కలిగించింది, హాతుడివద్ద ఇరవై వేల రూపాయలు దొరకటం మూలాన్న. డబ్బుకోసం ఈ హత్య జరగలేదని పోలీసులు అభిప్రాయ పడుతున్నట్టుగా గూడ ఉంది.

పేపరు మడిచి టేబుల్ మీద పడేశాడు. అల్మరా తెరచి బీర్ సీసా అందుకున్నాడు కాంతారావు. గ్లాసు సగానికి వంచుకుని తాగేశాడు.

అంతలో తలుపు తెరుచుకుని అరుణ వచ్చింది లోపలకు.

"ఏమిటి డార్లింగ్! రెండు రోజుల్నుంచి మరీ అదోలా ఉన్నావ్! ఆఫీసు వదలంగానే వచ్చి నన్ను కలుసుకునే వాడివి కదా! అటువంటిది నన్ను అసలే మర్చిపోయినట్టున్నావే!"

"మనసేం బాగోలేదు. అంతే!" కాంతారావు పొడిగా అన్నాడు.

"అవును! మనసు ఎలా బాగుంటుంది? కళ్ళు చెదిరి పోయేటంతటి డబ్బు, గుండె లవిసిపోయే హత్య!" విసురుగా అంది అరుణ.

"పేపర్లో విశేషం గురించేనా నీవు మాట్లాడుతూంట?" కాంతారావు అసలు విషయాన్ని దాటేశాడు.

"మీ బాస్ మురళీధర్ ఏమయినట్టు? అతడు గానీ ఈ హత్య చేయలేదు గదా? పాపం, అతడి భార్య చాలా

ఉత్తమురాలు. ఒకసారి వాళ్ళింటికి వెళ్ళి ధైర్యం చెప్పి వస్తే బాగుంటుంది'' అంది అరుణ.

''అవును! మురళీధర్ ఈ హత్యచేసి వుండాలి. లేదా హంతకుడెవరో అతడికి తెలిసన్నా వుండాలి!''

''అసలు అతడూ ప్రాణాలతో వున్నాడో లేదో?'' అరుణ భయంగా చూసింది.

''అలా ఎందు కనుకోవాలి!'' కాంతారావు అరుణ కళ్ళల్లోకి చూశాడు.

''అన్నట్టు అరుణా! పోలీసులు నిన్నేం ప్రశ్నలడగ లేదు కదా?'' అని అడిగాడు కాంతారావు. అతడి కళ్ళల్లో భయం, ఆతృత, ఆశలన్నీ ఒకేసారి కన్పించినయ్.

''లేదు! నా దగ్గరకు పోలీసులెవరూ రాలేదు! ఎందు కలా అడుగుతున్నావ్?''

''మరేం లేదు! ఆదివారం ఉదయం నా గదిలో చూసిన విషయాన్ని మరిచిపో! పొరబాటునగూడ ఎక్కడా, ఎవరితోనూ నోరు జారకు!''

''నాకా మాత్రం తెలీదా ఏం?'' అంటూ అరుణ చిరు నవ్వు నవ్వింది.

# 8

ఇన్స్పెక్టర్ రాజేంద్ర అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. అతడికి ఒకప్రక్కగా గోడకానుకుని నిలబడి వున్నాడు ఒక వ్యక్తి. అతడూ ఖాకీ డ్రెస్‌లోనే వున్నాడు. కానీ అతడు మునిసిపల్ ట్రక్కు డ్రైవర్.

''ఆదివారం ఉదయం హత్యజరిగిన భవంతికి కొద్ది దూరంలో నేను ట్రక్కుని ఆపి, రోడ్డుమీద నిలబడ్డాను. చెత్తకుండీలోని చెత్తను ఎత్తి ట్రక్కులోకి వేస్తున్నారు తోటీలు. అప్పుడో వ్యక్తి స్కూటర్ మీద ఆ భవంతిలోకి

కళ్ళాడు. గేటు తెరిచే నాధుడుగూడ లేకపోతే, అతడే వచ్చినట్టు స్కూటర్ దిగి, గేటు తెరుచుకున్నాడు.

"అందువల్లే అతడ్ని బాగా గమనించినట్టున్నాను నేను. గేట్‌మాన్ కాఫీ అయినా త్రాగివచ్చేందుకు వ్యవధి ఇవ్వకుండా, ఏదో కొంపలు మునిగినట్టుగా, సరిగా తెల్లారకుండానే ఆఫీసుకు వచ్చిన ఆ వ్యక్తిని చూసి నాకు ఒళ్ళు మండింది. తరువాత ఈ హత్య సంగతి పేపర్లో చదివాను. అప్పుడే నాకు స్ఫురించింది. ఆ వ్యక్తికీ, ఈ హత్యకూ ఏదైనా సంబంధం ఉండచ్చేమో అని! అందుకే ఉన్నపళాన మీ దగ్గరకు పరుగెత్తుకువచ్చాను సార్!" డ్రైవర్ ముగించాడు.

"మంచిపని చేశావ్! ఇంతకీ నీవు చూసిన స్కూటర్నీ దానిమీది వ్యక్తినీ వర్ణించగలవా?" రాజేంద్ర అడిగాడు.

ట్రక్కు డ్రైవర్ ఆ వ్యక్తి గురించి వివరించాడు. అతడి వర్ణన కాంతారావుకు సరిగ్గా సరిపోతున్నది.

కానీ కాంతారావు తను ఆదివారంనాడు ఆఫీసుకే వెళ్ళలేదంటున్నాడు మరి!

ట్రక్ డ్రైవర్ వెళ్ళిపోయాడు. టేబుల్ మీద టెలిఫోన్ 'రంయ్'న మ్రోగింది.

"హలో! ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర మాట్లాడుతూంట!"

"గుడ్ మార్నింగ్ రాజేంద్ర! నేను సెంట్రల్ ఎక్సయిజ్ ఇన్స్‌పెక్టర్‌ని! నిన్నరాత్రి హోటల్ మెజెస్టిక్‌లో ఇద్దరు వ్యక్తులవద్ద పెద్దమొత్తంలో "హీరాయిన్" దొరికింది. కాని ఆ వ్యక్తులు పరారయారు. శనివారం రాత్రి ఆ ఇద్దరు వ్యక్తులూ, ఇంకో ముగ్గురూ కలిసి రహస్య సంభాషణలు జరిపారట! అప్పుడే రెండు జట్ల మధ్య మత్తుపదార్థం "హీరాయిన్", పెద్దమొత్తంలో డబ్బూ చేతులు మారాయట!"

"ఆ ముగ్గురు వ్యక్తులు ఎవరో గుర్తించారా?"

"వారిలో ఇద్దరు పురుషులు, ఒక స్త్రీ ఉన్నారట. ఒక వ్యక్తి వర్ణన చనిపోయిన రాజారావుకు సరిపోతోంది. పేపర్లో చనిపోయిన రాజారావు ఫోటోని చూసి గుర్తించాడు హోటల్ బేరర్!"

"అలాగా?" మిగతా ఇద్దరూ?"

ఆ యువతి బహుశా రెండో వ్యక్తికి సెక్రటరీ అయి ఉంటాలన్నాడు. కానీ మిగతా వాళ్ళ ఆచూకీ లేదు!"

"అన్నట్టు మీకు దొరికిన నిషిద్ధ మత్తు మందు "హీరాయిన్" విలువ ఎంత వుంటుందో చెప్పగలరా?"

"సుమారు లక్షన్నర ఉండచ్చు!"

"మైగాడ్! లక్షన్నర!" రాజేంద్ర నోరు వెళ్ళబెట్టాడు. హతుడి దగ్గర ఇరవయ్ వేల రూపాయలు మాత్రం దొరికినయ్. అయితే మిగతా లక్షా ముప్ఫయ్ వేలను ఎవరో కాజేశారన్నమాట!

ఫోన్ పెట్టేసి ఆలోచనలో పడ్డాడు రాజేంద్ర.

రాజారావు, మరో అతను అతడి సెక్రటరీ హోటల్ మెజెస్టిక్ కి వెళ్ళారు. వాళ్ళకు కూడా మరో ఇద్దరు కలిశారు. రెండు జట్ల మధ్య నోట్ల కట్టలూ, హీరాయిన్ మార్పిడి జరిగి వుంటుంది.

రాజారావు అతడి వెంట వున్నవారు బయటకు చేరుకున్నాక రాజారావుని ఎలాగైనా కడతేర్చి ఆ డబ్బుని అతడి వెంట ఉన్న వ్యక్తి అతడి సెక్రటరీ కాజేయాలని ప్లాన్ వేసి ఉంటారు.

రివాల్వర్ రంగంలోకి దూకి ఉంటుంది. రాజారావు డబ్బుతో ఎలాగో తప్పించుకుని పారిపోయి మురళీధర్ ఎంటర్ ప్రైజెస్ ఆఫీసులో దూరి తల దాచుకుని ఉంటాడు.

అక్కడే అతడికి రక్తస్రావం అధికంకాగా రాజారావు అక్కడికక్కడే ప్రాణాలు వదిలి వుండాలి!

మరి ఆ డబ్బంతా ఏమైంది? తమకు హంతకుడివద్ద దొరికింది ఇరవై వేలు మాత్రమే.

తన ఆలోచన ప్రకారం, మురళీధర్ హంతకుడు అయి వుండాలి! అలాగే కాంతారావు డబ్బుని కాజేసి ఉండాలి.

అంత డబ్బు చూశాక ఎవరికి మాత్రం ఆశ కలగదు? ఆ డబ్బు క్రింద హత్యా నేరం దాగి ఉందని తెలిసీ గూడ, ప్రాణాలకు తెగిస్తారు కొందరు.

## 9

సుబ్బయ్యా, రామయ్యా మద్రాసు చూడ్డానికి వచ్చారు. పగలంతా సిటీలో తిరిగారు. ప్రొద్దుగూకాక బీచ్ చేరుకున్నారు.

ఆకాశంలో పౌర్ణమి చంద్రుడు నిండుగా ప్రకాశిస్తూన్నాడు. వాళ్ళకు దగ్గరలో బోట్ క్లబ్ కనబడింది.

"ఒరేయ్ సుబ్బిగా! వెన్నెల్లో బోటులో తిరుగుతుంటే ఎలాగుంటుందంటావ్?"

"తస్సదియ్యా! యమగా ఉంటుంది! పద పోదాం!"

ఇద్దరూ బోట్ క్లబ్‌లోకి దూరారు. చలికాలం అవటం వలన, రాత్రిళ్ళు ఎవరూ బోటులో తిరగరు. మూడు నాలుగు బోట్లు ప్లాట్ ఫారానికి కట్టివేయబడి ఉన్నయ్.

వాచ్ మెన్ బోటు అద్దె వసూలు చేసుకుని వాళ్ళను లోపలకు వదిలాడు. "చివరగా ఉన్న బోటులో ఎక్కండి" అని చెప్పాడు.

సుబ్బయ్యా, రామయ్యా బోటులోకి దిగారు. అందులో ఎవరో వ్యక్తి బోర్లా పడుకుని ఉన్నాడు.

"ఒరేయ్! ఈ బోటులో ఎవడో పడుకుని తీరిగ్గా నిద్రపోతున్నాడు!" అన్నాడు సుబ్బయ్యా.

"యహే! చూస్తావేం? ఒకటిచ్చి లేపక. వాడి దొంగ యేషాలు మన దగ్గరా!" అని అరిచాడు రామయ్య.

సుబ్బయ్య పడుకుని ఉన్న వ్యక్తి మీదకు వంగి, అతడ్ని తట్టి లేపటానికి ప్రయత్నించాడు.

ఆ వ్యక్తి ఒళ్ళు చల్లగా, ఐస్‌లాగ తగిలింది. పైగా అతడి శరీరం బిగుసుకుపోయి ఉంది.

ఇద్దరూ పరుగెత్తుకుంటూ వెళ్ళారు. వాచ్‌మెన్‌ని లాక్కొచ్చారు.

"మనుషుల్ని చంపి, బోట్‌లో దాచిపెడుతున్నావా ఏం?" అని అతడ్ని దబాయించారిద్దరూ.

మరో పది నిముషాల్లో పోలీసులు చేరుకున్నారు అక్కడికి. ఆ చనిపోయిన వ్యక్తి మురళీధర్ అని నిర్ధారణ చేయబడింది.

ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర అతడి కోసమే ఆత్రంగా కని పెట్టుకుని ఉన్నాడు, మురళీధర్ వస్తే, కొంతవరకు ఈ కేసు తేమలచ్చు అని. కానీ ఇప్పుడు మురళీధర్ కూడా హత్య చేయబడ్డాడు. అతడి గుండెల్లో .38 బుల్లెట్ దొరికింది. అతడు బహుశా శనివారం రాత్రికానీ, ఆదివారం వేకువగాని హత్య చేయబడి ఉండాలని అంచనా కట్టబడింది.

# 10

సరిత బెడ్ మీద పడుకుని ఉంది. ఆమె శరీరం అర్ధనగ్నంగా ఉంది. ఆమె ప్రక్కనే బెడ్ మీద కూర్చుని ఉన్నాడు లక్ష్మణరావ్.

లక్ష్మణరావు సరితకు ప్రియుడు. అతనేదో ప్రైవేట్ కంపెనీలో సేల్స్‌మన్‌గా ఉన్నాడు.

"డార్లింగ్! ఎప్పుడన్నా నీ జీవితంలో లక్ష రూపా యలు చూశావా?" సిగరెట్ పొగని అతడి ముఖంమీదకు వూదుతూ అడిగింది సరిత.

"పదివేలు ప్రోగుచేశాక నిన్ను పెళ్ళి చేసుకుందామను కుంటుంటే, మనిద్దరి సేవింగ్స్ కలిపినా ఇంతవరకు అయిదు వేలు కూడా పోగు కాలేదు."

"లక్షా ముప్ఫయి వేలున్నయ్ ఒకచోట! మనం తెగించి ఆ డబ్బుని మన సొంతం చేసుకోవాలి!"

"చాల్లే చతురు మాటలు! ఏ స్టేట్ బ్యాంకికో కన్నం వేస్తే ఇంకా ఎక్కువే దొరుకుతుంది గదా!"

"నేను చెప్పేది బ్యాంకిని కొల్లగొట్టేటంత ప్రమాద కరమయిందేం కాదు!

"మా బాస్‌ని రాజారావు కాల్చి చంపేసి, డబ్బుతో పారిపోయి మురళీధర్ ఆఫీసులోనే దాక్కొని ఉంటాడు. అక్కడే ప్రాణాలు విడిచాడు రాజారావు. ఆదే ఆఫీ సులో పని చేసే కాంతారావు ఆదివారం ఆఫీసుకు వెళ్ళా డేమో! శవం ప్రక్కన డబ్బు చూసి, దాన్ని కాజేసుకు పోయి ఉంటాడు" లక్ష్మణరావు జుట్టులోకి వేళ్ళు పోనిస్తూ అంది సరిత.

"కాంతారావు ఆదివారాలు గూడ ఆఫీసుకు పోతుం టాడా?" లక్ష్మణరావు అడిగాడు.

"వాడి కదో జబ్బు! ఆఫీసు రోజుల్లో పని ఎగ్గొట్టి పెత్తనాలు చేస్తుంటాడు. ఆదివారాల్లోనూ, సెలవు దినా ల్లోనూ వచ్చి పెద్ద ఆరిందలాగ, ఆఫీసులో తనొక్కడే కష్టపడుతున్నట్టుగా, పని చేస్తుంటాడు."

"పోనిద్దూ! లేనిపోని గొడవ మన కెందుకు? పోలీసుల కీవిషయం తెలిసిందంటే, కాంతారావుతోపాటు మని

ద్దరం కూడా జైలు కెళతాం!''

"ఛీ! ఏం మగాడివి నీవు! మనిషి మాత్రం ఆరడుగుల పొడవు, రెండొందల పౌన్ల బరువు ఉన్నావ్! నీవాట్టే శ్రమపడక్కర్లేదు. కాస్త మనిషి సహాయంగా, మగ తోడుగా నా ప్రక్కన నీ వుండు. మిగతా పనులన్నీ నేను చేసుకు పోగలను!''

"సరే! నీ ఇష్ట ప్రకారమే చేస్తాను. ఇప్పుడేం చేయాలి మనం? నీ పథకం ఏమిటో చెప్పు!''

"మొదటి పద్ధతి! చనిపోయిన రాజారావు భార్య చేత కాంతారావుని బెదరించటం! దాంతో కాంతారావు కొంత కాళ్ళబేరానికి వచ్చి రాజీ పడచ్చు!''

"ఆ పథకం పారకపోతే, రెండో మార్గం ఏమిటి?''

"అది తర్వాత చెబుతాను! ముందు మనం బీచ్ రోడ్లో రాజారావు బంగళాకు పోవాలి.''

"లేడికి లేచిందే పరుగు! డార్లింగ్! మరొక్కసారి!'' అంటూ లక్ష్మణరావు ఆమె మీదకు వాలిపోయాడు.

"చాల్లే! అవతల లక్ష రూపాయలు చేయి జారి పోతుంటే, తీరిగ్గా లవ్వాడుకుందామంటావా? పద! పద!'' అంటూ సరిత విసుక్కుంటూ బయటికి నడిచింది.

# 11

రాజారావు భార్య శాంతిమతి ఆశ్చర్యపోయింది. "ఏమిటీ? లక్షా ముప్ఫయి వేలే? నీవు చెప్పేది నిజమేనా?''

"ముమ్మాటికీ నిజం! ఆ డబ్బు కోసమే ఎవరో మీ వారిని హత్య చేశారు. న్యాయంగా ఆ డబ్బుకు మీరే వారసులు. దాన్ని ఈ కాంతారావే కాజేశాడు!'' సరిత మళ్ళీ నొక్కి చెప్పింది.

"అయితే ఇంకేం? వెంటనే పోలీసులకు తెలియజేస్తే

పోలా? వాళ్ళే కాంతారావుని అరెస్టు చేసి ఆ డబ్బు నా కప్పగిస్తారు కదా?''

''అదే పిచ్చి పని అంటాను! నిజానికి ఆ డబ్బు నల్ల మందు అమ్మకంలో వచ్చింది. నల్లమందు అమ్మకం చట్ట విరుద్ధం కనుక, ఈ విషయం తెలిసిన వెంటనే పోలీసులు ఆ డబ్బుని ప్రభుత్వపరం చేస్తారు. అప్పుడు నష్టపోయేది మీరే!''

''కాంతారావు నివసించే బిల్డింగ్ లో టెలిఫోన్ ఉంది, ఎవరో ఆఫీసర్ వాటాలో! కాంతారావ్ ని ఫోన్ లోకి పిలిపించండి'' అని సరిత వంగి ఆమె చెవిలో ఏదో చెప్పింది.

కాంతిమతి ముఖం మీద చిరునవ్వు వెలిసింది. ఆమె సోఫాలోంచి లేచి ప్రక్క గదిలోని టెలిఫోన్ దగ్గరకు నడచింది.

''అవునూ! ఈవిడగారి బెదిరింపులకు లొంగిపోయి ఆ కాంతారావు డబ్బు తెచ్చిస్తాడే అనుకుందాం! అప్పుడు మాత్రం మనకు ఒరిగే దేముంది? కాంతిమతికి లక్ష రూపా యలు లభిస్తయ్. శ్రమ మనది, ఫలితం ఆమెకూనా?'' మౌనంగా కూర్చున్న సరితను గమనిస్తూ ఉన్న లక్ష్మణ రావు అడిగాడు.

''అందుకే నీకు కండ ేగానీ, మెదడు లేద నేది! ఆడబ్బు కాంతిమతి చేతికి వచ్చి రాకుండానే, ఆమెను ఏమార్చి ఆ డబ్బుని మనం కాజేస్తాం! తెలిసిందా?''

''నిజంగా నీ బుర్ర మ్యూజియంలో ఉండాల్సిందే!'' అని లక్ష్మణరావు మెచ్చుకున్నాడు.

కాంతిమతి ఫోన్ ఎత్తి డయల్ చేసింది. కొద్ది క్షణాల్లో కాంతారావు ఫోన్ లోకి వచ్చాడు.

"హలో కాంతారావుగారా! నేను కాంతిమతిని మాట్లాడుతున్నాను, రాజారావు భార్యను."

"నమస్కారమండీ! మీ భర్తగారి అకాల మరణానికి చాలా చింతిస్తున్నాను!" కాంతారావు ఓదార్చబోయాడు.

"ఆ విషయాలు తర్వాత! నాకు న్యాయంగా చెందవలసిన దాన్ని నీవు తస్కరించావ్! మర్యాదగా ఇంకో గంటలో తెచ్చిస్తావా లేక పోలీసులకు రిపోర్టు చెయ్యమంటావా?" కాంతిమతి కంఠం తీవ్రంగా ఉంది.

కాంతారావుకి గుండె ఆగినంత పని అయింది. అయినా తమాయించుకున్నాడు. "మీరనేదేమిటో నా కర్థం కావటం లేదు. మీకు చెందవలసిన దేమిటి? నేను తీయడం ఏమిటి?" అంటూ బుకాయించాడు.

"మిస్టర్! అలా బుకాయించి లాభం లేదు! కావాలంటే పదివేలో, ఇరవై వేలో నీవు ఉంచుకుని మిగతాదన్నా నాకు అందజెయ్యి! అనవసరంగా జైలుపాలయి, నిండు జీవితాన్ని నాశనం చేసుకోకు!"

"ఏం బెదిరిస్తున్నావా? నాకేం తెలీదని చెప్పానుగా! పోలీసులకే రిపోర్టు ఇస్తావో, ప్రెసిడెంటుతోనే మొర పెట్టుకుంటావో నీ ఇష్టం!"

"మిస్టర్ కాంతారావ్! మరోసారి ఆలోచించుకుని చెప్పు!"

"ఆలోచన లేదు ఏం లేదు! గుడ్ బై!" అంటూ ఫోన్ పెట్టేశాడు కాంతారావు.

కాంతిమతి తెల్ల ముఖం వేసుకుని తిరిగి వచ్చింది గదిలోకి. నీరసంగా సోఫాలో కూలబడింది. "లక్ష రూపాయిలూ చేజారిపోయినట్టేనా?" అని వాపోయింది.

"మీరలా టెంబేలు పడకండి. ఇంకో గంటలో కాంతా రావ్ని ఇక్కడికి రప్పించకపోతే నా పేరు సరితకాదు" అంటూ కూర్చున్న చోటునుంచి లేచింది సరిత.

# 12

కాంతారావు విచారంగా వెనక్కి వచ్చి తన బెడ్ మీద వాలిపోయాడు.

ఆదివారం తను ఆఫీసుకెళ్ళి రావటం మూడో కంటి వాడికి తెలియదని అనుకుంటున్నాడు ఇంతవరకూ! అటు వంటిది ఇన్ని రోజుల తర్వాత కాంతిమతి డబ్బు గురించి ఫోన్ చేయటాన్ని అతడు నమ్మలేక పోతున్నాడు.

అయినా ఆ విషయం కాంతిమతికి ఎలా తెలిసింది? ఆమె కెవరు చెప్పి ఉంటారా సంగతి?

తెల్లారాక ఆ డబ్బుకి సంబంధించిన ఇది రెండో సంఘటన.

ఉదయమే అరుణ తన దగ్గరకు వచ్చింది మరో దుర్వార్తతో.

"నిన్న సాయంకాలం పోలీస్ ఇన్స్పెక్టర్ నా దగ్గరకు వచ్చాడు. శనివారం రాత్రి నుంచి, ఆదివారం ఉదయం వరకూ కాంతారావు ఎక్కడున్నదీ తెలుసా అని అడిగాడు నన్ను!" అంది అరుణ.

కాంతారావు కూర్చున్న చోటనే ఎగిరి పడ్డాడు.

"నిజంగా? నీవేం సమాధానం చెప్పావ్?" ఆత్రంగా అడిగాడు కాంతారావు.

"శనివారం రాత్రంతా నీవు నా గదిలో గడిపావని చెప్పాను. ఆదివారం ఉదయం పదిగంటలకు నీ వాటాకు తిరిగి వెళ్ళిపోయావని చెప్పాను."

"పెళ్ళి కావలసిన యువతివి! నీవు చెప్పదగినదేనా అది?" కాంతారావు ఎగిరి పడ్డాడు.

"నీ కోసమే అలా చెప్పాను! ఇన్స్పెక్టర్ కూడ అడిగాడు. పెళ్ళి కాకుండా నచ్చినవాడితో సంచరించటమేనా అని. మనిద్దరం ప్రేమించుకున్నట్టూ, త్వరలో నే పెళ్ళాడబోతున్నట్టూ చెప్పాను! దాంతో అతడు తృప్తి పడి, నా మాట నమ్మినట్టు కనిపించాడు."

"కొంపతీసి ఆ డబ్బు గురించి ప్రస్తావన చేయలేదు గదా?"

"ఛ! ఛ! మరీ అంత తెలివి తక్కువదానిలా ప్రవర్తిస్తానా? అవును గానీ కాంతారావ్! నీవు జూదమాడతావని నాకు తెలియదే! అంత డబ్బూ ఎమ్యూజ్మెంట్ పార్కులో గెలిచావంటే నమ్మలేకుండా ఉన్నాను!" అరుణ చిరు కోపం చూపిస్తూ అడిగింది.

"నిజమే! ఆ డబ్బుని నేను దొంగిలించిన మాట వాస్తవమే! కానీ నేనే హత్య చేయలేదు. రాజారావు హత్యతోనూ, మురళీధర్ దుర్మరణంతోనూ నాకెటువంటి ప్రమేయం లేదు. నన్ను నమ్ము అరుణా! ఇదంతా నీ కోసమే, అదే, మన కోసమే చేశాను!"

కాంతారావు నెమ్మదిగా ఆదివారం ఉదయం తను ఆఫీసుకు వెళ్ళి చూసినదాన్నీ, చేసిన పనినీ వివరించి చెప్పాడు.

అంతా విని అరుణ సానుభూతిగా చూసింది. "కానీ ఆ డబ్బుకి మనం న్యాయమైన వారసులం కాదు! పరాయి డబ్బు కోసం ప్రాకులాడటం మనకు తగదు డార్లింగ్!"

"దానికి మనం వారసులం కాదు, నిజమే! నీవు చెప్పే దానికి నేనూ ఒప్పుకుంటాను. మరయితే ఆ ధనం ఎవరికి

చెందాలి? రాజారావు చనిపోయాడు. అతడి వెనుకే వెళ్ళాడు మురళీధర్. ఆ ధనాన్ని అన్యాయంగా, అక్రమ మార్గాల్లో వాళ్ళిద్దరూ సంపాదించారు కనుక ముఖ్యంగా అది వారి భార్యలకు చెందదు. చివరకు దాన్ని ప్రభుత్వ పరం చెయ్యాల్సిందేనా? కానీ చూస్తూ చూస్తూ ఆ పని చెయ్యటానికి ప్రాణం ఒప్పటం లేదు.

"అంతేకాదు. ఇంత దూరం కథ నడిచాక, ఇప్పుడా ధనాన్ని ప్రభుత్వానికి అప్పజెబితే ఏం జరుగుతుందో తెలుసా? డబ్బు చోరీ చేసిన నేరంతో బాటుగా, రాజారావు, మురళీధర్‌లను హత్య చేసిన నేరాన్ని మన మీదే మోపుతారు!"

"నిజమే! అయితే ఇప్పుడేమిటి దారి?" అరుణ అడిగింది.

"పోలీసులు హంతకుల్ని పట్టుకునేదాకా, మనం బయట పడకుండా ఉండడమే!"

"ఏమో! నాకు భయంగా ఉంది బాబూ! లేనిపోని కష్టాల్ని కొనితెచ్చుకుంటున్నామేమో అని!" అంది అరుణ అతన్ని పెనవేసుకుంటూ.

"రోటిలో తల దూర్చి రోకటి పోటుకు భయపడడం ఎందుకు? పరిణామం ఎలా ఉంటుందో వేచి చూద్దాం!" ఆమెను తన కౌగిట్లో ఇముడ్చుకుంటూ పలికాడు కాంతారావు.

## 13

"ఒక పెళ్ళికాని అమ్మాయి తన ప్రేమికుడితో ఒక రాత్రీ సగం పగలూ గడిపానని నిర్భయంగా చెప్పిందీ అంటే, ఏదో నిగూఢ రహస్యాన్ని కప్పిపుచ్చటానికి ఆమె అలా చెబుతున్నదనుకోవాలి!" రాజేంద్ర సార్జెంట్

ఆర్ముగం వంక చూస్తూ అన్నాడు.

"అంతే సార్! ఆ యువతి అలా చెప్పిందంటే, వాస్తవంగా దానికి విరుద్ధంగా జరిగి ఉండాలి!" ఆర్ముగం తలూపాడు.

"తరువాత మనం అలా ఎందుకు ఆరా తీస్తున్నదీగూడ అడగలేదు ఆ అమ్మాయిని. దానర్థం ఏమిటి? ఆమెను విచారించటానికి పోలీసులు వస్తారనీ, వారు వేసే ప్రశ్నలకు ఎలా బదులు చెప్పాలనే విషయమై, ముందే ఆమెకు తర్ఫీదు ఇవ్వబడిందన్నమాట!

"అనుకోకుండా కాంతారావు ఆ డబ్బుని చూసి, కన్నుపట్టి, ఆ ధనాన్ని కాజేసి ఉంటాడు. అంతేకాదు. అతడికి తెలీని విషయం మరోటి ఉంది! రాజారావుని హత్య చేసిన వ్యక్తికి ధనం దొరకక పోవడంతో అతడూ దానికై అన్వేషణలో ఉండి ఉంటాడు. అప్పుడు కాంతారావు మీద గూడ హంతకుడి కన్ను పడిందంటే..."

"కాంతారావు గూడ హత్య చేయబడడం ఖాయం సార్! కనుక అటు డబ్బు కోసం, ఇటు మరో హత్య జరగకుండా ఆపటం కోసమూ మనం కాంతారావుని కనిపెట్టుకుని వుండాలి!" ఆర్ముగం సంతోషంగా అన్నాడు. ఈ పద్ధతిలో తేలిగ్గా హంతకుడు పట్టుబడడం ఖాయం.

# 14

మిసెస్ రాజారావునుంచి వచ్చిన టెలిఫోన్ కాల్ గురించే ఎటూ తేల్చుకోలేకుండా వున్నాడు కాంతారావు.

రాజారావు భార్య కాంతిమతిని తను ఎరగడు. కనుక ఆ కంఠస్వరం ఆమెది అవునో, కాదో గుర్తించలేదు తను.

ఒకవేళ ఇదీ పోలీసుల పన్నాగమేమో! తనను ట్రాప్ చెయ్యటానికి ఇన్‌స్పెక్టరే ఎవరైనా స్త్రీద్వారా బెదిరించి

చూశాడా? తెల్లవారి లేస్తే ఎన్నోరకాల నేరస్థుల్ని వివిధ పద్ధతుల్లో దొరకబుచ్చుకుంటుంటారు పోలీసులు.

మరి తనో? ముప్ఫయ్యేళ్ళ జీవితంలో చట్టవిరుద్ధమయిన పని చేయటం ఇదే మొదలు తనకు. అలాంటిది, తన మనసులో రేగే కల్లోలాన్ని యెంతగా బయటకు కనబడనీయకుండా చేద్దామనుకున్నా, తన మనసుని చదివేవుంటారు పోలీసులు.

తను ధనాన్ని కాజేసినట్టు కాంతిమతి నిజంగానే కనుక్కోగలిగిందా? ఆమెకెలా తెలుసు డబ్బుగురించి. ఒకవేళ ఆమే ఈ ధనంకోసం తనభర్తనే హత్యచేసిందా? లేక చేయించిందా?

అసలింత ఆలోచన దేనికి? రాజారావు బంగళాకు ఫోన్ చేస్తే సరి! కాంతిమతి పలుకుతుంది. నిజంగా ఈ ఫోన్ కాల్ ఆమే చేసిందో లేక ఇన్‌స్పెక్టర్ వేరెవరితో నన్నా చేయించాడో ఇట్టే తేలిపోదూ!

కాంతారావు బెడ్ మీదనుంచి లేచాడు. అదే అంతస్తులో ఉన్న ఆఫీసర్‌గారి వాటాలోకి వెళ్ళి టెలిఫోన్ డైరక్టరీ తిరగేశాడు. రాజారావు ఇంటినెంబరు, ఫోన్ నెంబర్ దొరికింది. ఆ నెంబరుకు ఫోన్ చేశాడు.

"హలో! నేను కాంతారావుని మాట్లాడుతూంట! మిసెస్ రాజారావున్నారాండీ!"

అవతలవైపునుంచి స్త్రీ నవ్వు విన్పించింది.

"మిస్టర్ కాంతారావ్! నీకు ఒకగంట గడువు పెట్టాను. అందులో అప్పుడే అరగంట అయిపోయింది. నీవు డబ్బు తీసుకునిరా వెంటనే. మళ్ళీ మళ్ళీ ఫోన్ చేసినా నేను పలకను! తెలిసిందా?" గర్వంగా అంది కాంతిమతి.

"మీరు దేన్నిగురించి మాట్లాడుతున్నారో నా కర్థం కావటం లేదు. మళ్ళీ మళ్ళీ మీకు ఫోన్ చేసి మీకు శ్రమ ఇవ్వను. మీరు మరోసారి నన్ను బెదిరింపచూస్తే, నేనే నేరుగా పోలీసులకు ఫోన్ చెయ్యాల్సి వుంటుంది!"

అవతలివైపు ఫోన్ పెట్టేసినట్టుగా, క్లిక్ అని ఫోన్ కట్ అయింది.

కనుక ఒకవిషయం తేటతెల్లమయింది. తనకు డబ్బు గురించి ఫోన్ చేసింది, కాదు చేయించింది ఇన్‌స్పెక్టర్ మాత్రం కాదు. నిజంగా, రాజారావు భార్య కాంతిమతే ఫోన్ చేసింది.

ఆమెకు ఈ ధనం విషయం ఎలా తెలిసి ఉంటుంది? కనీసం అంత డబ్బు ఉన్నదని ఊహించిందా? అంటే ఆమెకు ఈ హత్యలతో ప్రమేయం ఉండి తీరాలన్నమాట!

మళ్ళీ ఎవరో తలుపు తట్టారు. పోలీసులు రాలేదుకదా అని సంశయిస్తూ తలుపుతీశాడు కాంతారావు.

వాకిట్లో పోస్ట్‌మెన్ నిలబడివున్నాడు. "నమస్తే సార్! మీకు రిజిస్టర్డ్ లెటర్ వుంది!" అన్నాడు.

సంతకంపెట్టి కవరు తీసుకున్నాడు కాంతారావు. అది తను వ్రాసుకున్నదే! బస్ డిపో క్లోక్‌రూమ్ రశీదు ఉంది అందులో.

దాన్ని తాకుతూనే లక్షన్నర రూపాయిల్ని తాకినంత ఆనందం పొందాడు అతడు.

## 15

సరిత కారేసుకుని అరుణ ఆఫీసుకు వెళ్ళింది.

"హలో అరుణా! కాంతారావ్ కనుపించాడా ఎక్కడున్నాడు?" ఆతృతగా అడిగింది సరిత.

"అదేం అలా అడుగుతున్నావ్? అత డాఫీసుకు రాలేదా?" అరుణ ఆశ్చర్యంగా చూసింది.

"ఆఫీసుకు పోలీసులు తాళాలువేసి సీళ్ళు వేశారు. ఇంకో రెండుమూడు రోజులవరకూ మాకు ఆఫీసుకు వెళ్ళే పనిలేదు!" అంటూ రహస్యం చెప్పేదానిలా ముందుకు వంగి అరుణ చెవిదగ్గరగా నోరు పెట్టింది. "రాజారావు భార్య కాంతిమతి అతడ్ని పోలీసులకు పట్టిస్తానని చిందులు త్రొక్కుతోంది. మనం ఎలాగైనా ఆమెను శాంత పరచాలి. ఆమె త్వరపడి పోలీసుల దగ్గరకు పోకుండా ఆపాలి."

"ఇంతకీ కాంతారావు చేసిన నేరం ఏమిటో?"

"నాకుమాత్రం ఏం తెలుసు? కాంతారావూ, నేనూ ఒకే ఆఫీసులో పనిచేసేవాళ్ళ మవటంవల్ల అతడి భద్రత కోసమే నేనూ పరుగెత్తుకొచ్చాను. నీవుగూడ నాతో వస్తే మంచిది. ఇద్దరం కాంతిమతిని శాంతించేలా చేయాలి. తర్వాత కాంతారావునిగూడ అక్కడికే రప్పించి అసలు విషయమేమిటో ఆరా తీద్దాం! అతడి నేరం ఏమిటో, దాన్ని ఎలా సర్దాలో ఆ విషయమై నీవూ కాంతారావుకి నచ్చచెప్పచ్చు!" సరిత వివరించింది.

"కానీ ఆ కాంతిమతి ముక్కు మొగం ఎరగనే? ఆమె నా మాట వింటుందా?"

"ప్రక్కన నేనున్నాను గదా! కాంతారావుకి కాబోయే భార్యగా నిన్ను పరిచయం చేస్తాను సరా! కాల యాపన చేస్తే పోలీసులు రంగంలోకి రావచ్చు! కనుక నీవు త్వరపడాలి!"

మరో ఆలోచన లేకుండా అరుణ సరిత వెనుకే వచ్చి కారులో కూర్చుంది. కారు బయలుదేరింది.

# 16

ఫోన్ మ్రోగింది. కాంతారావు లైన్లోకి వచ్చాడు. "హలో! ఎవరండీ మాట్లాడేది?" అనడిగాడు.

"నేను సరితను మాట్లాడుతున్నాను. మేమిప్పుడు రాజారావు బంగళాకు వెళుతున్నాం. కాంతిమతి నీకోసం ఆతృతగా వేచివుంది. త్వరలోనే నీవూ రావాలి!"

"ఏమిటిదంతా? కాంతిమతి నాకోసం చూడాల్సిన పనేముంది? ఆమెకు నాతో ఏం పని?"

"లక్షా ముప్ఫయివేలు! అర్థమయిందా?"

"ఏమిటో! నీవు చెప్పేదాంట్లో ఒక్క ముక్కగూడా అర్థం కాలేదు."

"అర్థం అవుతుందిలే! మాతోబాటు నీ ఫ్రెండ్‌ని తీసుకు వెడుతున్నాం! ఎవరో తెలుసా? మిస్ అరుణ! ఆమె ప్రాణాలు నిలవాలంటే వెంటనే డబ్బుతీసుకుని రాజారావు బంగళాకు రా!"

కాంతారావు అదిరిపడ్డాడు. చివరకు కాంతిమతి ఇంతవరకూ తెగించిందా? తనకు ప్రాణప్రదమైన అరుణను కిడ్నాప్ చేసి తీసుకు వెడుతున్నారా?

"ఇదిగో సరితా! అరుణకేదైనా ప్రమాదం జరిగిందో మీ అందర్నీ యమపురికి పంపి తీరతాను!" కోపంగా అరిచాడు ఫోన్‌లో కాంతారావు.

"అనవసరంగా మేం ఆమె దేహం మీద చెయ్యి వెయ్యం. కానీ గంటలోపల లక్షాముప్ఫయివేలతో నీవు రాకపోతే, ఆపైన మా పూచీ లేదు." ఠక్కున ఫోన్ పెట్టేసిన శబ్దం వినిపించింది.

రెండు హత్యలు, లక్షపైగా దోపిడీ! ఈ రెంటిలో ఒకదానితో తనకు ప్రమేయం ఉంది. కాదు, కాదు. తను మెడవరకు దిగబడిపోయినాడు, డబ్బు చోరీలో. ఇప్పుడు

తనతోబాటు అరుణకూడ ఈ ఊబిలోకి లాగబడింది. తనేమైనా ఫరవాలేదు. అమాయకురాలైన అరుణను ఎలా గైనా రక్షించాలి.

సరితతో మాట్లాడాక కాంతారావు అరుణ ఇంటికీ, ఆఫీసుకీ తిరిగాడు అదుర్దాగా, ఆమెనెలాగైనా రక్షించు కోవాలని.

కాని అప్పటికే ఆమె సరితతో వెళ్ళిపోయిందని తెలుసు కుని హతాశుడయ్యాడు.

టైమ్ చూసుకున్నాడు కాంతారావు. సాయంత్రం అయిదున్నర దాటింది. ఒక నిశ్చయానికి వచ్చినవాడిలా క్లోక్ రూం రసీదు జేబులో వేసుకొని నడిచాడు.

స్కూటర్ రాజారావు బంగాళాముందు ఆగింది.

బంగళాలో లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నయ్. బంగళా ఆవరణ అంతా చిమ్మచీకటిగా వుంది.

బంగళా లోపల ప్రశాంతంగా ఉంది, అసలు మనుష్యు లున్నారా లేరా అన్నట్టుగా.

కాంతారావు స్కూటర్ దిగి తలుపుదగ్గరకు వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాడు.

ధఢాల్న తలుపు తెరుచుకుంది. ఎదురుగా సరిత, కాంతిమతీ, లక్ష్మణరావు ముగ్గురూ నోరు తెరుచుకుని అతడికేసే చూస్తున్నారు.

"ఓ! సుస్వాగతం కాంతారావ్!" అంది సరిత నవ్వుతూ.

"అతడు మళ్ళీ ఒట్టిచేతుల్తో వచ్చినట్టున్నాడు!" అంది కాంతిమతి.

"మిస్టర్ కాంతారావ్! డబ్బెక్కడ?" గర్జించింది సరిత.

"ముందు నేను అరుణని చూడాలి! ఆమెకేం ప్రమాదం జరగలేదని నమ్మకం కలగాలి నాకు!" తొణక్కుండా పలికాడు కాంతారావు.

"అరుణ సుఖంగా వుంది. లక్ష్మణరావ్! లైబ్రరీరూమ్ తలుపు తెరువు!" అంది సరిత.

లక్ష్మణరావు వెళ్ళి తలుపు తెరిచాడు. లోపల్నుంచి అరుణ, బోనులోంచి బయటకుదూకే ఎలకలా, గదిలోంచి బయటకు దూకింది. ఆమె భయంతో, విచారంతో ఏడుస్తున్నది.

"ఇప్పటికైనా నా మాటలు నమ్ముతావా? ఇంతకీ డబ్బెక్కడ?"

"బస్ డిపో క్లోక్ రూమ్‌లో వుంది. ఇదిగో రశీదు. వెళ్ళి తెచ్చుకోండి" అంటూ రసీదు కాంతిమతికి అందించబోయాడు.

"ఆగు! అది నా డబ్బు! దానికోసం మొదటినుంచీ ప్లాన్ వేసింది నేను. రాజారావుని చంపి, ఆ డబ్బంతా స్వంతం చేసుకోమని మురళీధర్‌ని ప్రోత్సహించింది నేను! శనివారంనాడు రాజారావు, మురళీధర్‌లు ఏదో పెద్దఎత్తున వ్యాపారం సాగించబోతున్నారనీ, దాని విలువ సుమారు రెండులక్షలరూపాయి లుంటుందనీ నాకు తెలుసు. ఇప్పుడా డబ్బు న్యాయంగా నాకు చెందాలి!" సరిత వారించింది కాంతిమతిని.

"అంటే రాజారావుని కాల్చింది..." కాంతిమతి భయంగా చూసింది.

'మురళీధర్, నేనూను! ఇద్దరం కాల్చాం! రాజారావు పారిపోతూ నన్ను కాల్చాడు. కాని అది మురళీధర్‌కు తగిలి అతను అక్కడికక్కడే మరణించాడు."

సరిత తన నిజస్వరూపాన్ని బయటపెట్టింది.

"నీవు! నీవు! ఆడదానివి కాదు! పచ్చి నెత్తురుత్రాగే పిశాచానివి!" అంటూ కాంతిమతి పిడికిళ్ళు బిగించి సరిత మీదకు పోబోయింది.

లక్ష్మణరావు జేబులోంచి పిస్టల్ తీశాడు. "ఆగు అక్కడే! కాలు కదిల్చావంటే ప్రాణాలు తోడేస్తాను!" అన్నాడు.

"గుడ్! అసలీ పిచ్చిదాన్ని గదిలో పడేసి తాళం వెయ్యి!" అంది సరిత.

లక్ష్మణరావు ఆమెను లాక్కెళ్ళి మరో గదిలోకి నెట్టి తాళం వేశాడు.

"ఇక నీ సంగతి చెప్పు కాంతారావ్! మర్యాదగా ఆ రసీదునిలా ఇవ్వు. లేదా అరుణని నీ కళ్ళెదుటే ఘోరంగా మానభంగం చేయిస్తాను!"

సరిత చేతిలో రివాల్వర్ పుచ్చుకుని కోపంగా చూస్తున్నది. లక్ష్మణరావు కిటికీలోంచి రోడ్డుమీదకు చూస్తున్నాడు.

ఇదే అదనుగా భావించి కాంతారావు కాలెత్తి సరిత చేతిలోని రివాల్వర్‌ని తన్నేసి, తను వెళ్ళి లక్ష్మణరావుకి ఢీకొన్నాడు.

లక్ష్మణరావు చేతిలోని పిస్టల్ ఎగిరిపడింది దూరంగా. అతడూ బ్యాలెన్స్ తప్పి క్రింద పడ్డాడు.

"యూ డెవిల్! నీ కెంత పొగరు?" అంటూ లక్ష్మణరావు లేచి కాంతారావు పొట్టలో గుద్దాడు.

కాంతారావు పిడికిలి బిగించి అతడి గడ్డంక్రింద కొట్టాడు బలంగా.

లక్ష్మణరావు నోటంట నెత్తురు వచ్చింది. అతడు ఎగిరి కాంతారావు మీదకు దూకాడు. కాంతారావు ప్రక్కకు తప్పుకున్నాడు. లక్ష్మణరావు వెళ్ళి టేబుల్ మీదుగా, కిటికీమీద పడ్డాడు.

సరిత తన చేతికందినదాన్ని తీసుకుని కాంతారావుని కొట్టబోయింది.

అంతలో లక్ష్మణరావు అరిచాడు. "సరితా! పోలీసులు?"

సరిత ఒక్క క్షణం అచేతనంగా నిలబడిపోయి, వెంటనే ఇంటి వెనుక వేపు పరుగెత్తింది. కాని కాంతారావు ఆమె మీదకు దూకి గట్టిగా పట్టుకున్నాడు.

అంతలో పోలీసులు చుట్టుముట్టి సరితను, ఆమె ప్రియుడు లక్ష్మణరావుని బంధించారు. కాంతిమతి విడిపించబడింది.

కాంతారావు బస్ డిపో క్లోక్ రూమ్ .రసీదుని ఇన్‌స్పెక్టర్ రాజేంద్ర చేతిలో పెడుతూ, "ఈ డబ్బు న్యాయంగా ప్రభుత్వానికి చెందాలి. అత్యాశకు పోయి ఒక బలహీన క్షణంలో ఈ డబ్బును తస్కరించాను. కాని అన్యాయార్జితం మాకు అనర్థాలను తెచ్చిపెట్టింది." అన్నాడు పశ్చాత్తాప హృదయంతో.

—: ఐపోయింది :—

# గుర్రాల దొంగలు

ఏ. వీ. మోహన్రావ్

సూర్యుడు కొండల్లోకి పోవటం చూచాడు పాల్. ప్రక్కనున్న రాంసింగ్ తో "చీకటి పడుతున్నట్లుంది, వెనక్కి వెళ్ళిపోదామా?" అడిగాడు.

"నీ యిష్టం. ఇవాళ మనకు ఒక్కటీ చిక్కలేదు. ప్రొద్దుట్నుంచి గాదాపు అరవై మైళ్ళు పైనే తిరిగినట్లున్నాం ఈ కొండల్లో" అన్నాడు రాంసింగ్.

"ప్రతిరోజూ దొరుకుతాయా? అయినా మనం వచ్చి ఇరవై దినాలు కాలేదు. దాదాపు పదింటిని పట్టుకున్నాం. జాగ్రత్తగా పట్టుకెళ్ళి అమ్ముకుంటే మూడు నాలుగు లక్షలకు తగ్గకుండా వస్తుంది" అన్నాడు పాల్.

పాల్ ఇండియాలోనే పేరు పొందిన హార్స్ ట్రైనర్.

అతనికీ గుర్రాలకూ తెలియని అనుబంధముంది. అతని చిన్నతనమంతా ఒక మహారాజుగారి గుర్రాల శాలలో, పని చెయ్యడంలోనే గడచిపోయింది. జాతి గుర్రాలను కడగటం, నీళ్ళు పట్టడం, గడ్డి వెయ్యడం, జబ్బులొస్తే డాక్టర్ల దగ్గరకు తోలుకెళ్ళి వైద్యం చేయించడం అలాంటి పనులన్నీ చేసేవాడు. వాటికొచ్చే జబ్బులూ, ఆ జబ్బులకు వాడే మందులూ మొత్తం అతనికి కంఠోపాఠంగా తెలుసు.

రాంసింగ్ ఆ కొండల్లో వున్న పెద్ద పల్లెలో వుండే మనిషి. పదివేల చదరపు మైళ్ళు విశాలంగా వున్న ఆ కొండల నడుమ భీకరమైన అరణ్యాలు, చిన్న చిన్న ఎడారులు, సెలయేళ్లు, వాగులు, రెండు పెద్ద నదులూ వున్నాయి. లెక్కలేనన్ని క్రూరమృగాలున్నాయి. రాంసింగ్‌కు ఆ ప్రదేశమంతా కొట్టిన పిండి. దానికితోడు అడుగుల్ని చూచి, అవి ఏ జంతువులో చెప్పగల దిట్ట. ఆ జాడల్ను పట్టుకుని ఎంత దూరమైనా తరుముకొనిపోయి ఆ జంతువులను చూపించగల నేర్పు వుంది.

పాల్ ఆ వూరు వచ్చి, గెంగ్రోజులున్నాడు. ఊళ్లో జనమంతా అతన్ని వెలివేసినట్లు చూశారు. మొత్తం ఇరవయి గుడిసెలకు మించి లేవక్కడ. ఆ వూరికి నాయకుడు నారాయణసింగ్ అని తెలుసుకున్నాడు.

అతనెందుకు వచ్చిందీ చెప్పాడు పాల్.

విని నవ్వాడు నారాయణసింగ్.

"ఎందుకు నవ్వుతున్నావు?" అడిగాడు పాల్.

"ఈ అరణ్యాల్లోకి వెళ్ళిన మనిషెవ్వరూ ప్రాణాలతో తిరిగి రాలేదు. నువ్వు గుర్రాల్ని పట్టుకుంటామని వచ్చావనంటున్నావ్. అవి అడవి గుర్రాలు. సింహాలకన్నా క్రూరమైనవి. అవంటేనే మాకు భయం!" అన్నాడు.

నారాయణసింగ్ గిరజాల జుట్టూ, నడుం చుట్టూ లావు పాటి తోలు బెల్టూ, తుపాకీ, బుల్లెట్లు నింపి అడ్డంగా వేసుకున్నా తోలుపటకా మనిషి భయంకరంగా వున్నాడు.

"నాకు భయం లేదు. రోజుకు వంద రూపాయలిస్తాను. నా వెంట ఎవరైనా వస్తారా?" అడిగాడు పాల్.

"ఎవ్వరూరారు అంతకు రెట్టింపిచ్చినాసరే!" అన్నాడు నారాయణసింగ్.

ఆరోజు సాయంత్రం పల్లెకు పడమరగా వున్న కల్లు దుకాణానికి వెళ్ళాడు పాల్. ఊళ్ళోవున్న పెద్దవాళ్ళంతా అక్కడ చేరివున్నారు. అందరూ మట్టి ముంతలు ముందెట్టుకుని గంజాయి త్రాగుతున్నాయి.

పాల్ కూడా రెండు ముంతలు కల్లు తెచ్చుకుని వాళ్ళకు దూరంగా కూర్చున్నాడు.

మిగిలినవాళ్ళు త్రాగుతూ పాల్‌ను చూచి నవ్వుకుంటూ ఏదేదో చెప్పుకోసాగారు. వాళ్ళల్లోంచి ఒకతను, పొట్టిగా వున్న మనిషి లేచి వచ్చాడు పాల్ ముందుకు.

తన ముందున్న ముంతల్లోంచి ఒకటి తీసి అందించి "త్రాగు" అన్నాడు పాల్ అతన్ని.

ముంత అందుకుని కూర్చుంటూ "మనిషి కోసం చూస్తున్నావటగా?" అడిగాడు ఆగంతకుడు.

"అవును!" అన్నాడు పాల్.

"నేనొస్తాను నీతో."

"నీ పేరు?"

"రాంసింగ్!"

"నీకీ చుట్టు ప్రక్కలున్న అడవి, కొండలు బాగా తెలుసా?"

"ఈ పల్లెలో సుందరసింగ్ తర్వాత నన్నే చెప్పుకుంటారు ఆ విషయంలో" అన్నాడు రాంసింగ్.

"సుందరసింగ్ ఎవరు?" అడిగాడు పాల్.

దూరంగా కూర్చున్న గుంపులోంచి లేచిన ఒక ముసలతన్ని చూపించాడు రాంసింగ్. పాల్ అతన్ని తేరిపార చూశాడు.

"ఎప్పుడు వెళ్దాం అడవిలోకి?" అడిగాడు రాంసింగ్.

"రేపు వుదయాన్నే వెళ్దాం!" అన్నాడు పాల్.

అలా జరిగింది వాళ్ళ పరిచయం.

గుర్రాల్ని వెనక్కి మళ్ళించారు. ఒకదాని వెనుక ఒకటి మెల్లగా నడుస్తున్నాయి.

ఇరవై దినాలు అడవంతా కలయ తిరిగిన పాల్‌కు, ఎంతో ఉత్తేజంగా వుంది. గుర్రం కనుపించగానే దాన్ని పట్టుకోనేందుకు పడ్డ శ్రమ తలుచుకుంటే అతనికి ఆశ్చర్యం వేసింది. రాంసింగ్ నలిగిపోయిన ఆకుల్ని, ఊగుతుండే కొమ్మల్ని, కదలిపోయిన రాళ్ళను పలకరించి మాట్లాడి, తాము వెంటనే గుర్రం ఏ త్రోవన పరుగెత్తిందీ పసిగట్టి చెప్పేవాడు. పాల్ ధైర్యంగా ఆ త్రోవ వెంట వెళ్ళేవాడు.

అడవిలో తిరిగే గుర్రాలు భయంకరంగా కనుపించాయి పాల్‌కు. వాటి వేగం, వాయువేగాన్ని మించి వున్నట్లు తోచింది. ఒక్కో గుర్రం పట్టుకోనేలోపల అడవంతా త్రిప్పి, ప్రాణాలు తోడేసేది. కొండల్ని సునాయాసంగా ఎక్కటంలోనూ, కొండచరియలపైనుంచి వంపల, వేల అడుగులు క్రిందికి జర్రున జారిపోటంలోనూ, నదులు దాటటంలోనూ, వాటి నేర్పు గమనించి బిత్తరపోయాడు పాల్.

"పాల్ సాబ్!" పిలిచాడు రాంసింగ్.

"ఏమిటి రాంసింగ్?" అడిగాడు పాల్.

"మేము ఎన్నేళ్ళనుండో ఇక్కడుంటున్నాం. ఈ అడవిలోని ఈ గుర్రాలకు ఇంత విలువ వుందనీ, వీటివల్ల ప్రయోజనం వుందనిగానీ మాకు తెలియనే తెలియదు. మా అవసరాలకు ఒకటో రెండో అతి కష్టంపైన పట్టి తెచ్చుకోవడం తప్ప, వాటితో వ్యాపారం చెయ్యవచ్చునని ఎవ్వరికీ తెలియదు" అన్నాడు రాంసింగ్.

"ఇప్పుడు నువ్వు తెలుసుకొన్నావుగా? ఇకపైన ఒక పని చేద్దాం! నువ్వు గుర్రాల్ని పట్టి నా దగ్గరకు తీసుకురా. వాట్ని అమ్మి వచ్చిన డబ్బు చెరిసగం తీసుకుందాం. నీకు అవసరమయిన పెట్టుబడి నేను పెడ్తాను."

"అలాగే! మీరు ఈ గుర్రాలతో ఏం చేసేది నాకు చెప్పారు. మరెవ్వరికీ చెప్పకండి!" అన్నాడు రాంసింగ్.

"ఏం?" అడిగాడు పాల్.

"నారాయణసింగ్ ముఠా పోమరులు. దొంగలు. కష్టపడి పనిచేసే రకం కాదు. తుపాకితో మిగిలిన వాళ్ళను బెదిరించి పొట్ట నింపుకునే రకం. వాళ్ళకు తెలిస్తే ఈ గుర్రాలను పట్టుకోనివ్వరు. పైపెచ్చు మనం కష్టపడి పట్టుకొచ్చిన గుర్రాల్ని కూడా తమవేనంటారు" అన్నాడు రాంసింగ్.

"అలాంటి విపత్తులు ఎదురు చూచే తగిన ప్రయత్నంలో వచ్చాను. నా దగ్గర కావలసినంత అమ్యూనిషన్ వుంది. మంచికి ప్రాణాలిస్తాను. వంచించాలని చూస్తే ప్రాణాలు తీస్తాను. అయినా నే చెప్పిన రహస్యం నీలోనే వుంచుకో!" అన్నాడు పాల్.

గుర్రాలు మెల్లిగా కదులుతున్నాయి. అదలించి పరుగెత్తించడం యిద్దరికీ ఇష్టంలేదు. ప్రొద్దుట్నుంచి తిరిగి తిరిగి బాగా అలసి వున్న వాట్ని ఇంకా అలిసేట్లు జెయ్యడము అన్యాయమని తెలుసు వాళ్ళకు.

పాల్ తన మకాం ముందు ఆగాడు.

"ప్రొద్దున్నే వస్తాను సార్!" అన్నాడు రాంసింగ్.

"అలాగే!" అంటూ గుర్రం దిగాడు.

రాంసింగ్ గుర్రం అక్కడికి రెండుమైళ్ళ దూరంలో వున్న పల్లెవేపు పరుగెత్తిపోతుంటే కాసేపు చూస్తూ నిల్చున్నాడు పాల్. తన గుర్రాన్ని తీసుకెళ్ళి, గుడిసెకు వెనుక వేపునున్న మిగిలిన గుర్రాలతోపాటు కట్టేసి వచ్చాడు.

బట్టలు విప్పాడు. తుపాకులు తీసి ఒక మూలన పెట్టాడు బూట్లు కూడా విప్పుకున్నాడు. ఫోల్డింగ్ కాట్ సర్దుకుని వేసుకుని కూర్చున్నాడు.

పెద్ద చెక్కపెట్టె తెరచి, అందులోంచి రెండు బిస్కెట్ల పాకెట్లు తీసి మంచంపైన పెట్టుకుని మెల్లగా తినసాగాడు.

అందాకా తను సేకరించిన గుర్రాల్ని గురించే ఆలోచించసాగాడు. ప్రతి ఒక్కటీ జాతి గుర్రం. వాటి స్పీడు విమానాల్ని మించి వుంది. కొంచెం తర్ఫీదు ఇచ్చి రేసుల్లో వదిలిపెడితే, ప్రతి పందెం తప్పక గెలుస్తాయన్న నమ్మకం కలిగింది.

కనీసం డజను గుర్రాలనన్నా పట్టుకోవాలని వచ్చాడు. పది దొరికాయి. మరో రెండు దొరగ్గానే, అన్నింటినీ జైపూర్ తీసుకొచ్చి అక్కడ్నించి రైలుద్వారా బొంబాయి చేర్చే ఏర్పాట్లు చెయ్యాలనుకున్నాడు.

బిస్కెట్లు తినడం పూర్తయింది.

విస్కీ సీసా తెరచి, ఒక్క గుటకలో మొత్తం త్రాగాడు. రివాల్వరు నిండా గుండ్లు పెట్టి, దాన్ని తల క్రింద పెట్టుకుని పడుకున్నాడు.

పగలంతా తిరిగి తిరిగి అలసి వుండటం, ఆపైన విస్కీ త్రాగడంతో, వెంటనే కళ్లు మూసుకుపోయాయి. అతని శరీరం గాఢ నిద్రలోకి వొరిగిపోయింది.

గుర్రాలు మాత్రం సకిలిస్తూ, పచ్చిగడ్డి తింటూ, ఎగురుతూ పడుతూ, వాటి యిష్టంవచ్చినట్లు అల్లరి చెయ్యసాగాయి.

## 2

పాల్‌కు మెలకువ వచ్చింది. కళ్ళు తెరచి చూశాడు. ఎండ తను తయారు చేసుకున్న గుడిసె కిటికీలోగుండా లోన పడుతోంది. లేచి కూర్చున్నాడు. అంతకు ముందు వరుసగా మూడు దినాలనుండి వినిపించిన గుర్రాల సకిలింపులు వినిపించలేదు. ఒకదాన్నొకటి రాచుకున్నప్పుడు వినవచ్చే సరసరలు కూడా వినరాలేదు.

'గుర్రాలన్నీ తనలాగే నిద్రపోతున్నాయా?' మనసులోనే అనుకున్నాడు పాల్. లేచి వెళ్ళాడు చూద్దామని గుడిసె వెనుక భాగానికి.

గుండె గుభిల్లుమంది. కళ్ళు బైర్లు క్రమ్మాయి. ఒక్క గుర్రం కూడా లేదు. వాటిని కట్టడానికి తను నాటిన కొయ్యలు మాత్రం వున్నాయి వెక్కిరిస్తూ. తెంపుకొని పోయి వుంటాయాని ఆలోచించాడు. త్రాళ్ళు తెగి వుంటే వాటి మొదళ్ళు కొయ్యలకు కట్టిన భాగం వేపు మిగిలి వుండాలి. అలాలేవు. కట్లు విప్పుకుని పోయినట్లున్నాయి.

ఇరవై దినాలుగా నిద్రాహారాలు లేకుండా, అడవంతా తిరిగి తిరిగి, ఏరి ఎన్నిక చేసి పట్టుకొచ్చిన గుర్రాలు మాయం కావడం అతన్ని నిలువునా కుదుపి వేసింది. మెదడు పని చెయ్యనారంభించింది.

అంతకు ముందు సాయంత్రం తనకూ, రాంసింగ్ కు జరిగిన సంభాషణ గుర్తొచ్చింది. ఈ గుర్రాల ఉపయోగం అతనికి తప్ప మరెవ్వరికీ తెలీదు. అతనే తను నిద్రపోతున్నప్పుడు వచ్చి గుర్రాలకట్లు విప్పి దొంగిలించుకుపోయి వుండాలనుకున్నాడు పాల్.

స్త్రరున గుడిసెలోపలకు వచ్చాడు. రెండు తుపాకులు తీసుకున్నాడు. రెండు వందల రౌండ్లు తూటాలు పేర్చుకున్నాడు తోలు పటకాకు. రివాల్వరు బొడ్లో దోపుకున్నాడు.

నమ్మకద్రోహం చేసిన రాంసింగ్ ను తిన్నగా యముడి దగ్గరకు పంపి తన గుర్రాల్ని తిరిగి తన గుడిసెకు తోలుకు రావాలని కృతనిశ్చయుడైనాడు పాల్.

వెలుపల కొచ్చి ఎర్రగుర్రం ఎక్కి, కాళ్ళతో ప్రక్క టెముకలపైన అదలించినట్లు కొట్టాడు. ఒక్కమారు సకిలించి, ముందుకాళ్ళు రెండూ పైకెత్తి నిటారుగా నిలబడింది గుర్రం. ఆ తర్వాత కాళ్ళు రెండూ నేలపైన వేగంగావేసి, పెద్ద పెద్ద అడుగుల్లో వేగంగా పల్లెవేపు సాగిపోయింది.

రాంసింగ్ మిగిలిన వాళ్ళతో చేరిపోయి తన పైకి దండెత్తే ప్రమాద ముందని తెలుసు పాల్ కు. అయినా మొండిగా అవసరమైతే అందరితో తలపడేందుకు సిద్ధమయినాడు. ప్రాణాలు పోతాయేమోనన్న భయంగానీ,

అంతమందితో పోరాడటం కష్టమన్న ఊహాగానీ, అతనికి రాలేదు.

వెతికి వెతికి పట్టుకున్న జాతి గుర్రాలు పదీ గుర్తుకు రాసాగాయి. వాట్ని తిరిగి సంపాదించాలన్నదే అతని ధ్యేయం. ఎర్ర గుర్రం పది నిముషాల లోపలే చేరిపోయింది పల్లెకు. గుర్రాన్ని తిన్నగా ఊరి మూల వున్న కల్లు దుకాణం వద్దకు పోనిచ్చాడు. కొందరు ఆడవాళ్లు భయ పడుతూ లోనికి వెళ్ళారు. పిల్లలు దోవలోంచి తప్పుకు న్నారు.

కల్లు దుకాణం ముందు కళ్ళెం లాగిపట్టి, క్రిందకు దుమికాడు పాల్. పాక వెలుపల నారాయణసింగ్, అతని ముఠా మరో నలుగురు గుండెలు విరుచుకొని నిల బడి వుండటం గమనించాడు. వాళ్ళపై నుండి దృష్టి మరల్చి రాంసింగ్ కోసం కళ్ళతోనే వెతకసాగాడు. అతను కనుపించలేదు. ఏమయినాడా అని ఆలోచిస్తూ, దుకాణంలోకి వెళ్ళాడు.

కల్లు ముంతల్లో నింపుతున్న ముసలతను పాల్‌ను చూడ గానే భయపడుతూ లేచి వణకసాగాడు.

"ఎందుకలా అదరిపడుతున్నావ్?" అని అడిగాడు పాల్.

"ఆ ముఠా నిన్ను చూడలేదా?" అడిగాడతను.

"ఏ ముఠా?" తెలియనట్లు అడిగాడు పాల్.

"నారాయణసింగ్ ముఠా!" చిన్నగా రహస్యం చెప్పి నట్లుగా అన్నాడు ద్వారం వంక బిక్కు బిక్కుమని చూస్తూ.

"నేను రావడం చూశారు. చూస్తే ఏం?"

"నీ కోసం కాచుకుని వున్నారు. రాగానే చంపాలను కుంటున్నారు. నువ్వు ఇటు ప్రక్కగుండా వెళ్ళిపో!" మళ్ళీ మెల్లిగా చెప్పాడతను.

"రాంసింగ్ రాలేదా ఇవాళ?" అడిగాడు పాల్.

"వాడినడిగి లాభం లేదు! నన్నడుగు చెపుతాను" వెనుక నుండి మాటలు వినిపించాయి. పాల్ కల్లు ముంతతో రక్కున తిరిగాడు వెనక్కి. నారాయణసింగ్ కనిపించాడు.

"నీకు తెలుసా?"

"తెలుసు."

"ఎక్కడున్నాడు?!'

"పైకి పంపాను. నువ్వూ వెళ్తావా?" కళ్ళు చింత నిప్పుల్లా చేసుకుని అడిగాడు నారాయణసింగ్.

"అంటే..." అర్థంగాక అడిగాడు పాల్.

"కాల్చి చంపాను రాత్రే!"

"చంపారా? ఎందుకు?"

"మా మాట విననందుకు. మా త్రోవకు అడ్డు రావాలని ప్రయత్నించినందుకు!" అన్నాడు నారాయణసింగ్.

పాల్ ఆ ఒక్క మాటలోనే జరిగిందంతా అర్థం చేసుకొన్నాడు. రాంసింగ్ వ్యక్తిత్వానికీ, విశ్వాసానికీ, త్యాగానికీ మనస్సులోనే జోహారు లర్పించాడు. అతన్ని చంపి, తన గుర్రాలను కాజేసిన ఈ ముఠాపై పగ తీర్చుకోవాలన్న తపన గుండెల్ని మండించింది.

"నువ్వు మనిషివి కావు, రాక్షసుడివి. రాంసింగ్ లాటి మనిషిని చంపడం నువ్వు చేసిన పెద్ద నేరం. కష్టపడి పట్టుకొచ్చుకున్న నా గుర్రాల్ని అపహరించడం రెండో నేరం.

నిన్ను..." అంటూండగానే నారాయణసింగ్ తుపాకీ పైకెత్తాడు పాల్ పైకి.

అసంకల్ప ప్రతీకార చర్యలా పాల్ చెయ్యి రక్కున రివాల్వర్ వైపు వెళ్ళింది.

"చెయ్యి ముందుకు కదిలిందా కాల్చిపారేస్తాను. ఎక్కడ్నుంచో వచ్చి, మా అనుమతి లేకుండా, మా అడవిలో గుర్రాల్ని తోలుకెళ్ళాలని ప్రయత్నం చేసినందుకు నిన్నూ, సాయం చేసినందుకు రాంసింగ్‌నూ చంపాలని తీర్మానించుకున్నాం!" అన్నాడు నారాయణసింగ్.

పాల్‌కు పరిస్థితి అర్థమయింది. ద్వారానికి అడ్డంగా నిలుచున్నాడు నారాయణసింగ్. ముందుదెబ్బ ఎవరిదయితే వాళ్లదే పైచెయ్యి అవుతుందని తెలుసతని. ఇలాంటి సమయంలో, ఒక్క క్షణం ఆలోచించాడు. కల్లుముంత ఒక్క వుదుటున నారాయణసింగ్ మొహానికి గురిచూసి కొట్టి, కూర్చున్నాడు. నారాయణసింగ్ తుపాకి ప్రేల్చాడు. అది వెళ్ళి, పాల్ ఎడం భుజంలో దూరింది. కొరివిపెట్టి కాల్చినట్లు మంటపుట్టింది పాల్‌కు.

పాల్ కూర్చునే రివాల్వర్ ప్రేల్చాడు నారాయణసింగ్ పైకి, అతని చేతిమణికట్టుకు తగిలింది గుండు. తుపాకీ క్రిందపడింది. నారాయణసింగ్ "అమ్మో!" అంటూ నేలపై వ్రాలాడు.

ఆ అరుపు వినగానే వెనుపలున్న అనుచరులు లోనికి రావటానికి ప్రయత్నించడం పాల్ కంటబడింది. గుమ్మానికి అడ్డంగా నారాయణసింగ్ ఆకారం పడిపోవడంతో అతనికేమయిందో చూచేందుకన్నట్లు, అతనిపైకి వంగారు.

అదే అదనుగా భావించాడు పాల్. వెనుక గుమ్మం

గుండా గుడిసె వెలుపలికొచ్చి, ఎర్రగుర్రానెక్కి అదిలించాడు.

గుర్రం దౌడందుకుంది. తుపాకీ గుండు తగిలిన ప్రదేశంనుండి రక్తం కారసాగింది. లెక్క చెయ్యకుండా ముందుకు పోనిచ్చాడు గుర్రాన్ని, తిన్నగా గుడిసె దగ్గరకు జేరాడు. లోపల్నుంచి డబ్బా, ఆహారం, బ్రాందీ సీసాలు, సిగరెట్లు, మొదలైన అవసర సామగ్రినంతా గుర్రంపై వేశాడు.

అక్కడింకా క్షణంవున్నా ప్రమాదమని తెలుసతనికి. నారాయణసింగ్ ముఠా, వెంటాడి వస్తారు. వాళ్లకుచిక్కకుండా ముందు పారిపోయి ఆ తర్వాత వచ్చి వాళ్లపైన చావుదెబ్బ తియ్యాలనుకున్నాడు.

దూరంగా గుర్రాల డెక్కల చప్పుడు వినిపించింది. పాల్ మళ్ళీ గుర్రమెక్కి ఆడవి వేపుపరుగెత్తించాడు.

# 3

పాల్ గుర్రం వేగంగా పోసాగింది.

అంతకుముందు రాత్రి ఆ ప్రాంతంలో వర్షం కురిసినట్లు చెట్ల ఆకులపై నుండి కొద్దికొద్దిగా నీళ్ళు నేలపైకి బొట్లు బొట్లుగా రాలుతున్నాయి. నేల తడిసి మెత్తబడి వుంది. పాల్ వంగి చూశాడు. గుర్రపు అడుగుల ముద్రలు అచ్చుగుద్దినట్లు పడుతున్నాయి. అవి చూడగానే భయం పట్టుకుంది.

రాంసింగ్ అంతకుముందు చెప్పిన విషయాలు గుర్తొచ్చాయి. అడుగుజాడల్ని కనిపెట్టి, గుర్రాల్నికానీ, మనుషుల్నిగానీ, మరే జంతువులనుగానీ, పసిగట్టడంలో సుందర్ సింగ్ ఆరితేరిన దిట్ట. తన్ను వెంటాడుతున్న నారాయణ సింగ్‌తో బహుశా అతడు కూడా వుండి వుంటాడు.

గుర్రం వేస్తున్న అడుగుల ముద్రల్ని బట్టి ఎంత అమాయకుడైనా వెంబడించి రాగలడు. వాళ్ళకు తనకూ మధ్యనున్నది కొద్ది దూరం మాత్రమే. అదీ గుర్రాల వేగాల్ని బట్టికాదు. వాళ్ళకన్నా తను కొంత ముందు బయలుదేరడం. ఆ ముఠావాళ్ళ గుర్రాలు కాస్త వేగం అందుకున్నాయంటే తనపని చెల్లు.

ఆలోచించ సాగాడు పాల్. గుండు తగిలిన ప్రాంతం కారంజల్లిన పుండులా అప్పుడప్పుడూ మండుతూంది. బాటకు కుడివేపున ఎత్తైన కొండలున్నాయి. ఎడంవేపు ఆకొండల అడుగుల లోతున లోయ వుంది. దానిలోనికి వెళ్ళే మార్గం దాదాపు ఇరవై మైళ్ళ అవతల వుంది.

కొండలెక్కి పోదామనుకున్నాడు పాల్. కానీ పైకి ఎక్కటంలో వేగం ఆగిపోతుంది. ఈలోగా నారాయణ సింగ్ ముఠా వచ్చే అవకాశం వుంది. ముందుకు పోతూనే ఆలోచించసాగాడు.

లోయలోకి జారిపోదామనుకున్నాడు. చదునైననున్నని బండల్లాంటి కొండచరియలున్నాయి. అక్కడక్కడా చిన్న చిన్న చెట్లున్నాయి. గుర్రంతోపాటు ఆ చరియ పైగా జారిపోవడం అతికష్టం. గుర్రం కాళ్ళకు పట్టు దొరకదు. అది తడబడి చుట్ట చుట్టుకుని క్రింద మీదయి, తనూ, గుర్రం కూడా నుగ్గు నుగ్గయ్యే ప్రమాదముంది.

ఎర్ర గుర్రాన్ని ఎగాదిగా చూశాడు. మంచి ఫారమ్‌లో వుంది. అది అడవి గుర్రం కావడంవల్ల, సునాయాసంగా గుట్టలుదాటుతూ, పొదల్ని తప్పించుకుంటూ ముందుకు పోసాగింది.

పాల్ వెనక్కి తిరిగాడు. దూరంగా సన్నగా గుర్రాల డెక్కల చప్పుడు వినవచ్చింది. అది నారాయణ

సింగ్ ముఠాయేనని తెలుసుకున్నాడు. అంటే వాళ్లు సరయిన దోవన, వేగంగానే, తరుముకుంటూ వస్తున్నట్లుగా వుందనుకున్నాడు. ఈ మారు వాళ్ళకు చిక్కితే తుపాకీ గుండ్లతో తూట్లు వేస్తారని తెలుసు.

ప్రమాదమయినా, లోయలోకి పోవడానికే నిశ్చయించుకున్నాడు. గుర్రాన్ని బాటలోంచి ఆపించి కుడివేపునున్న కొండగుట్ట లెక్కించి వందగజాలు పోయాడు. ఆ తర్వాత ఆపి, బాటపై గుర్రం డెక్కలు పడకుండా రాతిపైనుండి బాట మీదుగా గుర్రాన్ని కొండచరియపైకి దూకించాడు గుర్రాన్ని, దమ్ముపట్టి.

గుర్రం దూకింది. కానీ దాని కాళ్ళకు పట్టు చిక్కలేదు. తిరగబడి దొర్లబోయి కూడా తమాయించుకొని పొజిషన్ నిలబెట్టుకుని ఇరవైగజాలు జర్రున జారింది. అక్కడు చిన్న పొద అడ్డొచ్చింది. దానిపైన కాళ్లు పెట్టి నిలుచుంది క్షణం.

అక్కడ్నుంచి లోయలోకి చూశాడు పాల్. ఇంకా చాలా దూరం వుంది. ప్రమాదకరంగా వుందా కటింగు. తలెత్తి పైకి చూశాడు. గుర్రం తల క్రిందులవకుండా ఎలా వచ్చిందాని ఆశ్చర్యపోయాడు. గుర్రం విపరీతమైన శబ్దం చేస్తూ ఊపిరి తీసుకోసాగింది.

ఎక్కువసేపు అక్కడుండటం ప్రమాదమని తెలుసు పాల్‌కు. వెనుకనుండి తరుముకొస్తున్న నారాయణసింగ్ ముఠా, క్షణాలు గడిచేకొద్దీ దగ్గరవు తుంటారని కూడా తెలుసు.

కళ్లెంతో బిగబట్టాడు పాల్ భగవంతుడిపైన భారం వేసి గుర్రాన్ని మోకాళ్ళతో డొక్కల్లో పొడిచాడు. అది ఓసారి గాల్లోకి కాళ్ళుపైకెత్తి సకిలించి ముందు కురికింది.

బండమీద కాళ్ళు నిలుపుకోలేక, పడిపోయినట్లే వొంగి పోయింది. నాలుగు కాళ్ళూ వాలుగా ముడిచి, ఎత్తు తగ్గించుకొని, స్తరన జారిపోసాగింది లోయలోకి.

అంతదూరం జారడానికి పట్టుమని పదినిముషాలుకూడా పట్టలేదు. దాని లాఘవానికి, నేర్పుకూ, తెలివికీ విస్తు పోయాడు పాల్. చిన్నగా లోయలోకి చేరుకుంది.

చుట్టూ చూశాడు పాల్. గుర్రాన్ని అదిలించి ముందుకు పోనిచ్చాడు. అరమైలు దూరం పోయాక, గుర్రం నోట్లోంచి నురుగు కారడం గమనించాడు. అంటే దానికి బాగా దాహమవుతుందని తెలుసుకున్నాడు. చుట్టూ నీళ్ల గుట్టలాంటి దేదైనా కనుపిస్తుందేమోనని అంతకు ముందు నుండి వెతుకుతూనే వున్నాడు. కానీ అలాంటిదేదీ కనుపించలేదు. తనకూ దాహమవుతూనే వుంది.

కొంతదూరం పోయాక కుడివేపు కొండక్రిందుగా ఒక చోట కొంతమేర ఖాళీస్థలం కనుపించింది.

గుర్రాన్ని అటు కదలించాడు. కొండ క్రిందికి వెళ్ళగానే అక్కడో చిన్న నీళ్ళ గుంట కనుపించింది. అతని కళ్ళు ఆనందంతో మెరిశాయి. మెల్లిగా క్రిందకు దిగాడు. గుర్రం తిన్నగా వెళ్లిపోయింది నీళ్లకోసం. దిగిన స్థలంలోనే కూలబడ్డాడు పాల్.

భుజం దగ్గర గుండు తగిలిన భాగం మండటం ఎక్కువయింది. శరీరం నీరసించడంతో తనకు జ్వరం తగులు తూందని తెలుసుకున్నాడు.

కళ్లు నొప్పులు పుట్టాయి. గుర్రం పడుకుని తల నీళ్లలో పెట్టి త్రాగుతూంది.

ప్రాకుతూ గుర్రం దగ్గరకు వెళ్ళాడు పాల్. జీను

క్రిందనున్న సంచీలోంచి, రెండు దుప్పట్లు తీసుకున్నాడు. వాటితో తిరిగి వెనక్కి పాక్కుంటూ వెళ్ళి, కొండ క్రిందుగా ఒక దుప్పటి పరచుకుని రెండోదాన్ని తలమునకా కప్పుకున్నాడు. చలికి అందాకా వొణికి పోతున్న శరీరం కాస్త తట్టుకున్నట్లయింది. మత్తుగా నిద్రలోకి జారుకున్నాడు.

# 4

పాల్ కళ్లు తెరచి చూచేసరికి చుట్టూ చీకటి పేరుకుని వుంది.

దగ్గరలో గుర్రం పడుకుని తనకేసి చూస్తూ వుంది. తెలియని వేడి ఏదో ఆ ప్రదేశాన్నంతా ఆవరించినట్లువుంది ఎర్రటి వెలుగు కూడా కనుపించింది.

వెనక్కి తిరిగి చూశాడు. ఎండిన పుల్లలు మండుతున్నాయి. భుజంపైన గాయంనొప్పి కూడా అంత ఎక్కువగా తెలీలేదు. తడుము కొన్నాడు పాల్. కట్టు తగిలింది. తలవొంచి చూసుకున్నాడు.

పాతగుడ్డ చేతిచుట్టూ కట్టబడి వుంది.

నిర్మానుష్యమైన అరణ్యంలో, ప్రాణాలు తీసేందుకు తరుముకొస్తున్న హంతకులకోసం ఎదురుచూసిన తనను ఆదరించిందెవరాని చుట్టూ చూశాడు పాల్. ఎవ్వరూ కనుపించలేదు.

ఆశ్చర్యమేసింది. స్పృహలేని స్థితిలో తను పడివున్నప్పుడు ఆ మనిషి ఎవరో వచ్చి వెళ్లి వుండాలనిపించింది. అంతలోనే మరో అనుమానం కూడా కలిగింది. అడవుల్లో కొరివి దయ్యాలుంటాయి. ఒక వేళ ఇదంతా వాటి పనేమోననుకున్నాడు. పాల్‌కు దయ్యాలంటే భయమేమీ లేదు.

కనీసం ఆ దయ్యమైనా కన్పిస్తే, కృతజ్ఞత తెలియ బరచా లనిపించింది.

ఎర్రగుర్రం హాయిగా ఎర్రగా మండుతున్న మంట దగ్గరగా చేరి పడుకుని చలిని కాచుకుంటూవుంది. పాల్ దాని కోసం చూశాడు. మామూలు మనిషెవ్వరూ చెయ్యని సాహసం చేసింది అది తన్ను కాపాడేందుకు. తల్లికన్న మిన్నగా పూజించాలనీ, బిడ్డకన్నా ఎక్కువగా ప్రేమించాలనీ, అవసరమైతే ప్రాణాలైనా పణంగాపెట్టి దాన్ని కాపాడుకోవాలనీ అనిపించింది.

గాజులశబ్దం వినిపించింది దగ్గరలో.

తలెత్తి చూశాడు పాల్.

ఒక స్త్రీ ఆకారం లీలగా కనుపించింది. కళ్లు నులుముకుని మోచేతిపైన బరువంతా వేసి కాస్తపైకి లేచి చూశాడు. అనుమానం లేదు. ఆమె తనవేపే వస్తూందని నిర్ధారణ చేసుకొన్నాడు. దగ్గరకంటా వచ్చి నిలుచుందామె తదేకంగా చూస్తూ.

ఆమె రూపం మనోహరంగా వుంది. రెండు జడలు వేసుకుంది. ఆ రెండూ భుజాలపైనుంచి ముందుకు రెండు రొమ్ముల పైన పడివున్నాయి. ఆ రొమ్ముల ఎత్తు ఆ జడలకున్న గంటల్లాంటి వాటి ఊపుల్నిబట్టి ఊహించగలిగాడు. కళ్ళు విశాలంగా వున్నాయి. చిన్ననోరు. పొడవుపాటి ముక్కు. సన్నటి నడుము, అపురూపసుందరి అని లోలోపలే అనుకున్నాడు.

"ఎలా వుంది?" అడిగింది. ఆ గొంతులో మార్దవం లేదు.

"ఏది?" తెలీనట్లు అడిగాడు పాల్.

"గాయం!" ప్రక్కనే కూర్చుంటూ చెప్పింది.

"నొప్పి తగ్గింది. నువ్వెవరు?"

"ఎవరైతే నీ కెందుకు. అసలు నువ్వెవరు? నిన్నెవరు కాల్చారు? ఎందుకు కాల్చారు? అడవిలో ఎందుకు తిరుగుతున్నావ్?" వర్షంలా కురిశాయి ప్రశ్నలు.

అందాకా జరిగింది క్లుప్తంగా చెప్పాడు. విని వింతగా చూసింది అతనికేసి.

"వాళ్లెంతమంది వున్నారు!"

"ముగ్గురులా వుంది!"

"వాళ్లల్లో సుందరసింగ్ వున్నాడా?" అడిగింది ఆమె.

"అంటే వయసు మళ్ళిన ముసలతన్ని గురించేనా నువ్వడిగేది?"

"అవును అతన్ని గురించే..." అందామె.

"ఉన్నాడు." అన్నాడు పాల్ పడుకునే.

"అయితే నువ్వు వాళ్లనుండి తప్పుకోవడం అసాధ్యం, ఆ సుందరసింగ్ ఎటువంటి జాడలైనా నాగుపాములా వాసన చూసి పసిగట్టగలడట. అతను వెంటాడుతున్నాడంటే నీకు చావు రాసిపెట్టినట్లే!" అందామె నిరాశగా.

"చావంటే భయంలేదు నాకు. బ్రతకాలన్న కోరికా లేదు. అయితే చచ్చేముందు వాళ్ళను చంపిగాని చావను. నేను అష్టకష్టాలుపడి పట్టుకొన్న గుర్రాల్ని అపహరించడంగాక, అడిగినందుకు ఇలా నా పైన దౌర్జన్యం చేయబోయిన వాళ్ళను ఊరకే వదిలెయ్యడం మగతనం కాదనిపిస్తోంది!" అన్నాడు పాల్.

ఆ మాట వినగానే ఆమె కళ్ళలో మెరుపు మెరిసింది.

"నీకు నేను సాయం చేస్తాను." అందామె.

"నువ్వా? సాయం చేస్తావా? ఆడవాళ్ళసాయం అవసరం లేదు నాకు. నేను పగతీర్చుకోగలను." అన్నాడు పాల్.

ఆ మాటలకు ఆమె అహం, దర్పం దెబ్బతిన్నాయి.

"ఆ ఆడవాళ్ళే నీ ప్రాణాలు ఈ పాటికి పోకుండా కాపాడింది. నిన్నూ, నీ గుర్రాన్నీ, ఈ రహస్య స్థలానికి చేర్చి, గాయానికి కట్టుగట్టి చలికి గడ్డకట్టుకొని పోకుండా మంట వేసింది వెళ్ళింది కూడా ఆడదే! ఈ ఆడదే!" అంటూ కోపంగా చెప్పింది తన్ను తాను చూపించుకుంటూ.

పాల్ కు తను తొందరపడి మాట జారినందుకు, ఆమె మనస్సు నొప్పించి నందుకు బాధ కలిగింది.

"సారీ! తొందరలో అలా అనేశాను. నా ఉద్దేశ్యం నీ గురించిగాదు!" అని చెప్పాడు తప్పించుకుందామని.

"డోంట్ వర్రీ! వొంట్లో ఎలా వుందో చెప్పు!" అందామె.

పాల్ ఆమె ఇంగ్లీషు మాట్లాడటం విని నోరు వెళ్ళబెట్టాడు ఆశ్చర్యంగా.

"యెందుకలా ఆశ్చర్యపోతున్నావ్?" అడిగింది ఆమే మళ్ళీ.

"నీకు ఇంగ్లీషు వచ్చా?"

"వచ్చు!"

"ఎక్కడ నేర్చుకున్నావ్?" అడిగాడు పాల్.

"జయపూర్ లో."

"అక్కడ మీ వాళ్లెవరన్నా వున్నారా?"

"లేరు. ఒకప్పుడు నా భర్త వుండేవాడు. ఆయనతో

కాపురం చేశాను. ఆయనే నేర్పారు కొద్దిగా ఇంగ్లీషు ముక్కలు.'' అందామె.

''ఇక్కడికెందుకొచ్చావ్?'' అడిగాడు పాల్.

''పగతీర్చుకుందామని.''

''ఎవరి మీద.''

''నా భర్తను చంపిన రాక్షసులపైన...''

''ఎవరా రాక్షసులు?''

''నిన్ను తరుముతున్న ముఠాయె. ఆ సుందరసింగ్ నా భర్తను వేటాడాడు, ఆ నారాయణసింగ్ తుపాకీతో కాల్చిచంపాడు,'' అంది. అంటూంటే ఆమె కళ్ళు కక్షతో కసితో, కోపంతో నిప్పుకణాల్లా మారిపోయాయి.

''ఎందుకు చంపారు?''

''మా నాన్న, తమ్ముడు ఇక్కడే వుండేవాళ్ళు. నేను పెళ్ళి చేసుకుని వెళ్ళాక మా నాన్న పెంచుతున్న గొర్రెల మందల్లోంచి దొంగతనంగా కొన్నింటిని రోజూ కాజెయ్య సాగారు. ఆయన వీళ్లని హెచ్చరించను వెళ్ళాడు. వెళ్లిన మనిషి తిరిగి రాలేదు. మా తమ్ముడు పసికుంక. పట్టుమని పదేళ్ళు కూడా లేవు. వాడు నడుచుకుంటూ వచ్చాడు నా దగ్గరకు. నా భర్తకు కోపం వచ్చింది. నారాయణసింగ్ పై పగ తీర్చుకుంటానికి వద్దన్నా వినకుండా వచ్చాడు. ఆయన్ను కూడా దొంగతనంగా చాటునుండి కాల్చి చంపారు. ఆ తర్వాత నేను వచ్చేశాను. మా తమ్ముడూ నేనూ వుంటున్నాము ఇక్కడికి దగ్గర్లోనే. సమయంకోసం ఎదురుచూస్తూ వున్నాం.'' అందామె.

ఆమె విషాదగాథ విన్నాక పాల్ అవాక్కయి కూర్చున్నాడు కొన్ని క్షణాలు.

"ఎన్నాళ్లయింది జరిగిదంతా?" అడిగాడు పాల్.

"రెండేళ్ళయింది!"

"నువ్వు వచ్చి ఇక్కడే వుంటున్నట్లు వాళ్లకు తెలీదా?"

"తెలుసు!"

"మరి నీ జోలికి రావడంలేదా?"

"రారు! వాళ్ళతో తియ్యగా మాట్లాడి పంపించేస్తుంటాను. ఒకటో రెండో గొర్రెల్ని కూడా అప్పుడప్పుడూ తోలిపెడుతుంటాను. ఇప్పటిదాకా తగిన సమయం చిక్కలేదు. సమయం చిక్కితే వాళ్లను మట్టుబెట్టి నా ప్రతీకారం తీర్చుకోవాలని చూస్తున్నాను" అందామె. తొణుకు బెణుకు లేకుండా.

పాల్ ఆమె పట్టుదలకూ, అది సాధించడానికి తీసుకున్న పథకానికీ, వహిస్తున్న ఓర్పుకూ పొంగిపోయాడు.

"నీచేత చచ్చేందుకు బహుశా ఇద్దరూ వుంటారనుకోను. నాతో జరుగుతున్న పోరాటంలోనే ఒకరో లేక ఇద్దరూనో చస్తారు. నేను చావబోయే ముందు కనీసం ఒకరినన్నా చంపుతాను." అన్నాడు పాల్.

"అలాగుండాలి మగాడంటే! నువ్వు నాకు నచ్చావ్ అయితే ఎందుకిలా పారిపోతున్నావ్ వాళ్ళనుండి. ధైర్యముగా నిలబడలేదేం?" అడిగిందామె.

"నన్ను వాళ్ళు పిస్తోలుతో కాల్చారు. చూశావుగా. గాయమైంది. చాలా రక్తం పోయింది. నీరసంగా కూడా వుంది. కాస్త ఓపిక వచ్చేదాకా వాళ్ళనుండి దూరంగా వెళ్ళాలనుకున్నాను. కుదుటపడగానే యెదుర్కొందామనుకున్నాను. నా జాడలు చిక్కకుండా వుండాలని

గుర్రాన్ని ఆ కొండపైనుంచి ఏటవాలుగానున్న రాతి చరియమీదుగా దూకించుకొచ్చాను. అందువల్లే వాళ్ళు వెనకబడిపోయి వుంటారు. నా జాడ చిక్కివుండదు.'' అన్నాడు పాల్.

''ఆ సుందర్ సింగ్ సంగతి నీకు తెలీదు. కాసేపు ఎటు పోయిందీ అర్ధంగాక తికమకపడ్డా ఆ తర్వాత ఊహి స్తాడు. మట్టిలో కూరుకొనిపోయిన చిన్న రాతిబెడ్డ కది లినా చాలు, అతను పసిగడతాడు. నీ ప్రోగ్రాం ఏమిటి?''

''ఏమీ లేదు! ఇంకాస్త ఓపిక వచ్చేదాకా ఇక్కడే విశ్రాంతి తీసుకుంటాను.'' అన్నాడు పాల్.

ఆమె అనుమానంగా చుట్టూ చూసింది.

''ఇక్కడొద్దు! నా వెంట రా! గుడిసెకి తీసుకుపోతాను. అక్కడే వుండు యివాళంతా. ఆ తర్వాత ఆలోచిద్దాం!'' అంది.

''వద్దు! నావల్ల నువ్వు ఆపదలో చిక్కుకోవడం నా కిష్టంలేదు. ఇక్కడే వుంటాను. ఫరవాలేదు.'' అన్నాడు పాల్ ఆమె వెంట పోవడం యిష్టంలేక.

''నీ మంచికోరి చెప్తున్నాను. వెంటరా! నీ గుర్రాన్ని మాత్రం ఇక్కడే వదిలేసి పోదాం! అది గడ్డి తిని తిరు గుతూ ఉంటుంది. నువ్వు కుదుటపడ్డాక వెళ్ళిపోదూ గానీ!'' అందామె.

''నీ పేరు చెప్పలేదు! నా పేరడుగలేదు. నేను మంచి వాణ్నా, దుర్మార్గుణ్నా తెలుసుకోకుండా వెంట రమ్మం టున్నావ్ ఇంటికి.'' అన్నాడు పాల్.

''నా పేరు లీనా! జ్వరంతో బాధపడే నువ్వు మంచి వాడివాయినా, చెడ్డవాడివయినా ఒకటే! రా పోదాం!'' అంటూ లేచి నిలుచుంది.

పాల్ కూడా సిగరెట్లు, బిస్కెట్లు, రివాల్వర్లు తీసుకుని లేచాడు. రెండడుగులు వేశాడు. కానీ వెళ్ళ స్వాధీనంలో లేక నిలబడలేకపోయి, ఠక్కున కూలిపోయాడు.

లీనా వెనక్కి తిరిగి చూసింది. వెళ్ళి అతన్ని లేవదీసి, ఒక చెయ్యి తన భుజంమీదుగా వేసుకుని, పాల్ నడుంను చుట్టి పట్టుకొంది. అతని బరువునంతా తనపై వేసుకుని నడవసాగింది ముందుకు.

అందమైన ఆమె శరీరం తగలగానే అంతకు ముందు దాకా జ్వరంతో కాగి చల్లారిన నరాలు, కండలు, మళ్ళీ వేడెక్కసాగాయి. అలాంటి అనుభూతిని ఆశించడంగానీ, ఆలోచనలు బుర్రలోకి తెచ్చుకోవటంగానీ అనుచితమని తెలిసినా మనస్సును అదుపులో పెట్టుకోలేకపోయాడు.

కొండ క్రిందనుండి దాదాపు రెండు ఫర్లాంగులు నడిపించింది లీనా పాల్ ను. ఆ తర్వాత చిక్కటి చెట్లలోగుండా మరికొంతదూరం తీసుకెళ్ళింది. ఆ చెట్లలోపల చిన్నగుడిసె కనుపించింది పాల్ కు. అక్కడో ఇల్లు వుందని కనిపెట్టడం ఎవ్వరికీ సాధ్యంగాదు.

పాల్ ను గుడిసెలోకి చేర్చి, వెదురుబొంగులతో తయారు చేసిన మంచంపైన పడుకోబెట్టింది లీనా. గొర్రెపాలు మట్టి కుండలో పోసి పొయ్యిపైన పెట్టి వచ్చి కూర్చుంది ఎదురుగా మరో మంచంపైన.

"మీ తమ్ముడేడీ?" అడిగాడు పాల్.

"అడవిలోకి పోయివుంటాడు. ఇక్కడ లేడు." అంది లీనా.

"నారాయణసింగ్ ముఠా అతన్ని చూసి వెంట వస్తే..." తన అనుమానం వ్యక్తంచేశాడు.

"ఎందుకు?"

"నా జాడేమైనా నీకు తెలుసేమో కనుక్కునేందుకు."

"రానీ!" అంది నిర్లక్ష్యంగా.

"నేను ఇక్కడ వుండటం చూస్తే అందర్నీ నిలువునా కాల్చిపారెయ్యరూ..."

"చూద్దాం!" అంది లీనా.

లీనా లేచివెళ్ళి పొంగిన పాలను గ్లాసులో పోసి తెచ్చింది. త్రాగమంటూ అందించింది. పాల్ అందుకొని త్రాగసాగాడు. అమృతంలా వున్నాయనిపించాయి పాలు.

పాల్‌కు లీనాని చూస్తుంటే మతి స్వాధీనం తప్పిపోతున్నట్లుగా వుంది. తన్ను తను కంట్రోలు చేసుకోలేక పోతున్నాడు. అంతకుముందు ఎంతోమంది స్త్రీలు తారసపడ్డారు కానీ ఎవ్వరూ తనకు తగినవాళ్ళుగా తోచలేదు. ఈమెమాత్రం మనస్సును కలవరపరుస్తున్నట్లుగా ఫీలయినాడు.

అడవిలో క్రూరమృగాల మధ్య, అంతకన్నా క్రూరమైన ప్రకృతి, పరిసరాలు, మనుషులమధ్య, ధైర్యంగా జీవించగలుగుతూన్నది కాబట్టే పాల్‌కు ఆమెపైన ఎనలేని అభిమానం, అనురాగంలాంటివి పుట్టుకొచ్చి వుండాలి. అతనికి అలాంటి జీవితమంటే ఇష్టం.

# 5

తలుపు తోసుకుని పన్నెండేళ్ళ కుర్రాడు లోనికొచ్చాడు.

"అక్కా! అక్కా! ఆ రాక్షసులు తారసపడ్డారు!" అన్నాడు రాగానే.

"ఎవర్రా?" అడిగింది లీనా నిమితంగా.

"ఇంకెవరు? నారాయణసింగ్, వాడి ముఠా!" చెప్పాడు ఆ కుఱ్ఱాడు.

పాల్ అసంకల్పంగా నే రివాల్వరు చేతికి తీసుకున్నాడు.

"నిన్నేమన్నా అడిగారా?" అడిగింది లీనా.

"తుపాకీదెబ్బ తిని, గుఱ్ఱంమీద పారిపోతున్న మనిషి నెవరన్నా చూశావా, అని అడిగాడు సుందరసింగ్. లేదన్నాను."

"తర్వాత."

"ఆ నారాయణసింగ్ గాడు ఆ మనిషిని వెంటాడి వేటాడేందుకు తాము వచ్చామనీ, ఇప్పటిదాకా చూడకుంటే, వెళ్ళి వెతికి జాడ తెలుసుకొనివచ్చి చెప్పన్నాడు."

"చెప్పకుంటే!"

"కాల్చి పారేస్తానన్నాడు."

"రాస్కెల్! ముందు వాడ్ని కాల్చిపారెయ్యాలి. అప్పుడుగాని సగం పీడ వదలదు." అంది లీనా కోపంగా.

"లీనా!" పిలిచాడు పాల్.

ఏమిటన్నట్లు అతనికేసి చూసింది.

"నేను ఇక్కడుండను. వెళ్ళిపోతాను. వాళ్లు ఇటొస్తారేమో?" అన్నాడు పాల్.

మాట పూర్తి గాకముందే దూరంగా గుఱ్ఱాల డెక్కల చప్పుడు వినిపించింది. ముగ్గురూ మౌనంగా ఊపిరి బిగబట్టుకొని విన్నారు.

"వస్తున్నారు వాళ్ళు!" అంది లీనా.

"రానీ! తాడో పేడో ఇప్పుడే తేల్చేస్తాను." పాల్ తుపాకి పైకెత్తాడు.

"వద్దు! నువ్వు నాతో రా!" అంటూ ఆమె పాల్ ను గుడిసె వెనక్కి నడిపించుకు పోయింది, పదిగజాలు

పోయాక పెద్ద చెట్టొకటి చూపించి "పైకెక్కి ఆ కొమ్మల్లో దట్టంగావున్న ఆకులమధ్య కూర్చో! వాళ్ళు వెళ్ళాక వచ్చి పిలుస్తాను." అంది లీనా.

పాల్ మారుమాట చెప్పకుండా చెట్టెక్కాడు చకచక కోతిపిల్లలా. కొమ్మల్లోకి వెళ్ళి కూర్చున్నాడు. లీనా పైకి చూసింది. అతను కనుపించలేదు. నిబ్బరంగా గుడిసెలోకొచ్చింది.

గుర్రాల చప్పుడు దగ్గరగా వినవచ్చింది. రెండు నిముషాల తర్వాత నారాయణసింగ్ గుడిసెముందు నిలబడి "లీనా! లీనా!" పిలిచాడు.

"ఎవరు?" అంటూ వెలుపలికొచ్చింది లీనా.

"మేము!" అన్నాడు సుందరసింగ్. అతని కళ్ళు పరిసరాల్ని పరిశీలిస్తున్నాయి. చెవులు వింత శబ్దాలకోసం రిక్కించుకున్నాయి. నరవాసన చూసే పులిలా అతని ముక్కుపుటాలు పెద్దవి అవుతూ అదిరిపడుతున్నాయి.

"అర్ధంతరంగా ఇలా వచ్చారేం?" అడిగింది లీనా.

"ఒక మనిషిని వేటాడుతూ వచ్చాం. అతను అందకుండా పారిపోతున్నాడు. ఇటెవరన్నా క్రొత్త మనిషెవరన్నా వచ్చారా?" అడిగాడు నారాయణసింగ్.

"లేదే! ఎవ్వరూ నాకు కనుపించలేదు." అంది లీనా.

"మాకు బాగా ఆకలిగా వుంది. తినేందుకేమయినా వుంటే పెట్టరాదూ!" అడిగాడు సుందరసింగ్.

"ఏమీ లేనట్లుంది. అయినా చూసొస్తాను!" అంటూ లీనా లోనికి వెళ్ళింది.

"ఓమారు లోపలకూడా చూస్తే బాగుంటుంది." అన్నాడు సుందరసింగ్.

"నీ ముసలిబుద్ధి పోనిచ్చుకున్నావు గాదు. వాడు ఇటొచ్చి ఉంటే లీనా పట్టి మనకు అప్పగించేది కదా?" అన్నాడు నారాయణసింగ్.

"ఏమో? చూచినందువల్ల తప్పు లేదుగా?"

"సరే పద!" అన్నాడు నారాయణసింగ్.

ముగ్గురూ లోనికి నడిచారు. వాళ్ళ వెంట వున్న మూడో మనిషి పేరు ప్రేంసింగ్. అతనికి స్వంతమైన వ్యక్తిత్వమంటూ లేదు. యంత్రంలాంటి మనిషి. నారాయణ సింగ్ చెయ్యమన్నదల్లా చెయ్యడం తప్ప స్వతంత్రంగా ఏమీ చెయ్యడు.

"ఇంట్లో ఏమీ లేదు! పాలున్నాయి త్రాగుతారా?" అడిగింది లీనా.

సుందరసింగ్ మంచం ప్రక్కనున్న లోటాకేసి చూశాడు. వెళ్ళి దాన్నందుకొన్నాడు. వేడిగా తగిలింది.

"ఇవ్వు! త్రాగుతాం!" అంటూ గ్లాసు అందించాడు సుందరసింగ్.

లీనా అందుకుంది. పాలు తెచ్చి ఆ గ్లాసులోనే పోసి ఒకరి తర్వాత ఒకరికి ఇచ్చింది. ముగ్గురూ త్రాగారు.

"నీకున్నాయా? మొత్తం మేమే త్రాగామా?" అడిగాడు సుందర్ సింగ్ నవ్వుతూ.

"మీరు త్రాగండి. నాకు అవసరం లేదు!" అంది లీనా.

ఆ జవాబుతో సుందరసింగ్ కు అనుమానం కలిగింది. పాల గ్లాసు అడుగున కొద్దిగా పాలు కనిపించాయి. లీనా గ్లాసు తీసుకొని వెళ్ళబోయే ముందు బహుశా ఆమె త్రాగి వుంటుందేమోనన్న అనుమానంతో అడిగాడు. కానీ ఆమె తనకు అవసరం లేదని చెప్పింది. అంటే ఆ గ్లాసులో పాలు త్రాగింది ఎవరు?

పాల్‌ను తాము వెంటాడి వచ్చారు. ఉన్నట్టుండి తప్పించుకుని వెళ్ళాడు. ఆ తర్వాత ఎంత వెతికినా అతని జాడగానీ, గుర్రం జాడగానీ చిక్కలేదు. అంటే అతన్ని లీనా కలుసుకొని, కాపాడుతానని మాటిచ్చిందేమోనను కున్నాడు సుందర్ సింగ్. అయితే అతన్ని ఎక్కడన్నా దాచి వుండాలి! ఎక్కడ దాచి వుంటుందా అని ఊహించ సాగాడు.

సుందరసింగ్ గుడిసె వెలుపలకొచ్చి, నాలుగుప్రక్కలా పాల్ గుర్రం కోసం తేరిపార చూశాడు. దాని జాడ లేదు. అంతలో నారాయణసింగ్ కూడా వెలుపలకొచ్చి నిలుచున్నాడు.

"ఏమిటి మామా వెతుకుతున్నావ్?" అడిగాడు నారాయణసింగ్.

తన ఆలోచనలు, అనుమానాలు విపులంగా చెప్పాడు సుందరసింగ్.

"ఏం చేద్దాం?" అడిగాడు నారాయణసింగ్.

"మనమీ ప్రదేశంపైన ఒక కన్ను వేసి వుంచాలి!" అన్నాడు సుందరసింగ్.

"ఎలా?"

"మనకెటూ ఆకలిగా వుంది. వంటచేసి భోజనం పెట్ట మని అడుగుదాం! ఆమె కాదనలేదు. వంట కావటానికి రెండు గంటలు పడుతుంది! ఈలోగా చుట్టుపక్కల అన్ని ప్రదేశాలు వెతుకుతాను పాల్‌గాడి ఆచూకీ కోసం!" అన్నాడు సుందర్ సింగ్ మళ్ళీ.

"అలాగే!" అన్నాడు నారాయణసింగ్.

ప్రేంసింగ్ ద్వారా లీనాకు చెప్పి పంపాడు భోజనం సంగతి. ఆమెకు చిర్రెత్తుకొచ్చింది. అయినా కాదనే

మార్గంలేక ఒప్పుకుంది. వెంటనే పనిలో మునిగిపోయింది.

ముగ్గురూ మూడు వేపులా వెళ్ళి వెతకడం ప్రారంభించారు. గుడిసె వెనుక వున్న చెట్లవేపు వెళ్ళాడు సుందరసింగ్. చాలా దట్టంగా, ఎత్తుగా వున్నాయి చెట్లు. ఒకటీ రెండూ కాదు. వందలున్నాయి. ఆ చెట్ల క్రింద ఆకుల నీడలవల్ల కన్ను పొడుచుకున్నా కనుపించనంత చీకటిగా వుంది. సుందరసింగ్ తలెత్తి పైకి చూశాడు కానీ ఎవరైనా మనిషి సులభంగా ఏదో ఒక చెట్టెక్కి దాక్కోవడం సాధ్యమన్న విషయము అతనికి అర్థమైంది. పైకి ఎక్కి వెతికే అవకాశం లేదు.

ఎందుకయినా మంచిదని తుపాకీ తీసి పైకి గురిపెట్టాడు సుందరసింగ్. నాలుగు రౌండ్లు కాల్చి చూస్తే పైనెవరన్నా మనిషి వుంటే భయపడి క్రిందకు దిగిరావడమో, లేక అదృష్టం బావుంటే ఏదో ఒక గుండు తగిలి చావడమో జరుగుతుందని ఆలోచించాడు. అంతలో ప్రేంసింగ్ కూడా వచ్చాడక్కడకు. అతనికీ తను చెయ్యదలచుకున్నది చెప్పాడు. తనూ నాలుగు రౌండ్లు పేలుస్తానన్నాడు ప్రేంసింగ్.

ఇద్దరూ కలిసి కాల్పులు మొదలు పెట్టారు. నిశ్శబ్దం చీల్చుకుంటూ ప్రేలిన తుపాకి గుళ్ళ శబ్దంతో ఆ ప్రాంతమంతా దద్దరిల్లిపోయింది.

లీనా చేస్తున్న పని వదిలేసి పరుగెత్తుకుపోయింది గుడిసె వెనుక వేపుకు. ఆమె గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. సుందరసింగ్, ప్రేంసింగ్ ఇద్దరూ చెట్ల కొమ్మల్లోకి తుపాకులు ఎక్కుపెట్టి నిలుచుని వుండటం గమనించింది.

అలా కాల్చవద్దని చెప్పాలనుకుంది ముందు. అలా చెప్పగానే తన్ను ఆ ముసలి నక్క అనుమానిస్తాడని తెలుసు. అపకుంటే అవిరామంగా కాలుస్తూనే వుంటా రేమో! ఏదో ఒక గుండు పొల్కకు తగిలితే...ఇక ఆ పైన ఆలోచించలేకపోయింది.

"ఎందుకిలా ఆత్రతగా వచ్చావ్?" అడిగాడు సుందర సింగ్.

"మీలో మీరు కాల్చుకుని ఛస్తున్నారేమోనని" అంది రొప్పుతూ తడుముకోకుండా.

"లేదు."

"మరి ఎందుకిలా ఆకాశంలోకి కాలుస్తున్నారు?"

"కూరలోకి పిట్టలేమయినా దొరుకుతాయేమోనని" అన్నాడు సుందరసింగ్.

"ఈ చెట్లపైన పిట్టలుంటాయా? ఇన్నేళ్ళు అడవిలో తిరిగి ఆ మాత్రం తెలీదా నాకు? నేనేదో ఆ పారిపోయిన మనిషికి సాయం చేశాననీ, అతన్ని ఎక్కడో దాచి వుంచాననీ నీ అనుమానం. నీ యిష్టం. ఆ మనిషి కను పించేలోగా వున్న గుండ్లన్నీ ఖర్చు చేసుకోండి. ఆ తర్వాత అతను కాలుస్తుంటే మీరు చేతులు అడ్డుపెట్టి ఆపి, ప్రాణాలు కాపాడుకుందురుగానీ..." అంది లీనా.

ఆ మాటలు ప్రేంసింగ్ తల్లోకి ఎక్కాయి. అతను కోపంగా సుందరసింగ్ కేసి చూశాడు. ఇద్దరూ తుపా కులు క్రిందకు దించారు. లీనా తిరిగి గుడిసెవేపు నడిచింది.

"ముసిలోడికి ఆలోచన వుండదు" అన్నాడు ప్రేం సింగ్.

"మాటి మాటికీ ముసిలోడినని నన్ను నువ్వు ఎగతాళి

చెయ్యవద్దు. నేను లేనిది క్షణం జరగదు మీకు'' అన్నాడు సుందరసింగ్.

''నువ్వు ఛస్తేగానీ మాకు శని వదలదు!'' అంటూ గుడిసె వేపు వెళ్ళిపోయాడు ప్రేంసింగ్.

అక్కడే నిలుచుని కోపంగా చూశాడు సుందరసింగ్. ప్రేంసింగ్ మీద అతనికి చాలా దినాల్నుంచి కోపంగా వుంది, తన కూతుర్ని బలవంతం చెయ్యబోయిన విషయం తెలిసినప్పటినుండీ. నారాయసింగ్ కు భయపడి, పగ దీర్చుకునే ప్రయత్నం ప్రతిదఫా వాయిదా వేయసాగాడు

గుడిసెకున్న కిటికీలోంచి చిన్న సందుగుండా ఇద్దర్నీ గమనించసాగింది లీనా. వాళ్ళ మాటలు కూడా వినిపించాయి ఆమెకు. వాళ్లల్లో వాళ్ళకు ముసలం పుడితే ఒకరో ఇద్దరో చావటం తధ్యమనిపించింది. అందుకు ఏం చెయ్యాలాని ఆలోచించసాగింది.

ప్రేంసింగ్ తత్వం ఆమెకు తెలుసు. ఆడవాళ్ళను చూస్తే ఆంబోతులా మారతాడు. నారాయణసింగ్ ఏదైనా సహిస్తాడుగానీ, ఆడవాళ్ళ పైకి అక్రమాలు మాత్రం ఒప్పుకోడు. అతనికి భయపడి అదుపులో పెట్టుకుంటాడు ప్రేంసింగ్ తన ఆలోచనల్ని.

లీనాకు ప్రేంసింగ్ కున్న బలహీనత నుపయోగించి అతన్ని మట్టుబెట్టాలనిపించింది. అప్పుడు ఇద్దరు మాత్రమే మిగులుతారు. పాల్ సులభంగా ఎదుర్కోగలుగుతాడు.

## 6

ముగ్గురూ లోపలొచ్చి కూర్చున్నారు. వాళ్ళకు కొంత దూరంలో వున్న పొయ్యి దగ్గర కూర్చుని వంట చెయ్య సాగింది లీనా.

పొయ్యి మండేందుకు ఊదినట్లే పూదుతూ, రెండు మూడుసార్లు తల వెనక్కి త్రిప్పి చూసింది ప్రేంసింగ్ వైపు. అతను ఆమెనే చూస్తూండటంతో ఇద్దరి చూపులూ కలుసుకున్నాయి.

లీనా ప్రేంసింగ్‌ను కవ్వించాలన్న ఊహతో, ఉక్క బోస్తున్నట్లు విసుక్కుంటూ పైట జార్చేసింది.

అందమైన, నున్నని తెల్లని వీపు భాగం చూడగానే ప్రేంసింగ్ రెచ్చిపోయాడు.

ఓరగంట లీనా అతని అవస్థ, ఉబలాటం కనిపెట్ట సాగింది.

ప్రేంసింగ్ లేచి గుడిసె వెలుపలకు వెళ్ళాడు. సుందర సింగ్, నారాయణసింగ్ సిగరెట్లు కాలుస్తూ కూర్చు న్నారు మౌనంగా.

ఐదు నిముషాల తర్వాత లోనికొచ్చి "మామా! ఆ చెట్లలో ఎవరో మనిషి పరిగెత్తినట్లు శబ్దం వినిపించింది నాకు. చూద్దాం రా!" అన్నాడు.

"పద!" అంటూ లేచారు ఇద్దరూ.

ముగ్గురూ వెలుపలికి వెళ్ళారు.

లీనాకు అర్థమైంది జరగబోయేదేమిటో. వాళ్ళు వెలు పలకు వెళ్ళగానే చిన్న రివాల్వరు తెచ్చి బాడీలో దోపు కుంది. పొయ్యిలో మండుతున్న కట్టెలమధ్యనో పొడవాటి కత్తీ కూడా దోపింది.

చెవులు రిక్కించి మనిషి అడుగుల శబ్దం కోసం విన సాగింది. పది నిముషాలపాటు ఏ విధమైన శబ్దం వినిపించ లేదు. ఆ తర్వాత ఎవరో వేగంగా గుడిసెవేపు పరుగెత్తు కొంటూ వస్తున్న చప్పుడైంది. కుడి చెయ్యి పొయ్యిలో దోపి వుంచిన కత్తి మీద పెట్టింది.

ప్రేంసింగ్ లోనికొచ్చి వికటంగా నవ్వాడు మధ్యగా నిలుచుని.

"ఏమిటా పిచ్చి నవ్వు?" తల కొంచెం తిప్పి అడిగింది లీనా.

"వాళ్ళిద్దర్నీ అక్కడ వదిలేసి వచ్చాను" అన్నాడు ఆనందంగా.

"ఎందుకు?"

"నిన్ను పొందేందుకు."

"మాటలు తిన్నగా రానీ! లేకుంటే..."

"వయ్యారాలు పోయిందిగాక ఇప్పుడు ఇలా మాట్లాడుతున్నావేంటి?" అడిగాడు అడుగులు ఆమె వేపు ముందుకు వేస్తూ.

"ఆగు!" అరుస్తూ లేచి నిలుచుంది. కుడిచేతిలో వున్న కత్తి పైకెత్తింది. "అడుగు ముందుకు వేశావంటే చంపుతాను" అంది.

"చంపుతావా?" అంటూ సింహంలా ఆమె పైకి లంఘించి కుడిచేతిలో వున్న కత్తిని లాక్కున్నాడు.

పెద్ద గావుకేక పెట్టింది లీనా. ఎడం చేతిలో వున్న రివాల్వరును గురిపెట్టాలని ప్రయత్నించింది. కానీ ప్రేంసింగ్ ఆమె చేతిని సరయిన విధంగా అమరనీయకుండా అటూ ఇటూ తిప్పసాగాడు. తనలో బలాన్నంతా కూడగట్టుకొని ఆమె ప్రేంసింగ్‌తో పోరాడసాగింది. పెద్దగా అరుపులు పెడుతూనే వుంది.

"ప్రేంసింగ్! ఆమె నొదులు!" అప్పుడే లోనికొచ్చిన నారాయణసింగ్ అరిచాడు.

ప్రేంసింగ్ వొదలలేదు. అలాగే పెనుగులాడసాగాడు.

"మర్యాదగా వదలు. నా సంగతి నీకు తెలుసు. నా కళ్ళ ముందు ఇలాంటివి జరగడం నేను సహించను" అన్నాడు నారాయణసింగ్. కామోద్రేకంతో వున్న ప్రేంసింగ్ కు అతడి మాటలు తల కెక్కలేదు.

నారాయణసింగ్ కోపంగా తుపాకీ పైకెత్తి ట్రిగ్గర్ నొక్కాడు. వరుసగా మూడు తూటాలు ప్రేంసింగ్ గుండెలో దూరాయి. నెత్తురు పిచికారీతో చిమ్మినట్లు వెలుపలకు చిమ్ముకొచ్చింది. గిలగిల కొట్టుకుని తల వాల్చే శాడు ప్రేంసింగ్.

అతని శవాన్ని భుజాన వేసుకుని వెళ్ళిపోయాడు నారాయణసింగ్. సుందరసింగ్ కూడా అతన్ని అనుసరిం చాడు.

వాళ్ళు బాగా దూరం వెళ్ళిపోయారని నిర్ధారణ చేసు కొని లీనా వెళ్ళి, పాల్ ను పిలిచింది. అతను చెట్టుదిగి క్రిందికి వచ్చాడు. జరిగింది చెప్పింది.

ఆమె చెప్తూంటే తదేకంగా గమనిస్తూ విన్నాడు. మాటలు ముగించాక దక్కున రెండు చేతులూ ఆమె చుట్టూ వేసి గట్టిగా కౌగలించుకున్నాడు. ఆమె గిలగిల తన్నుకుంది. అయినా పట్టు వదలలేదు పాల్. తల కొద్దిగా త్రిప్పి, మోచేతి క్రింద గట్టిగా కొరికింది కండ వూడేట్లు. ఆమె చుట్టూ వున్న చేతుల్ని వెనక్కు లాక్కున్నాడు పాల్. "నాపైన నీకు ఇష్టం లేకుంటే ఇంత సాహసం ఎందుకు చేశావ్? కౌగలించుకుంటే ఎందుకని త్రోసేస్తు న్నావ్?" నిలదీసి ప్రశ్నించాడు పాల్.

"నాకు నీపైన ప్రేమ లేదు. వాళ్ళపైన పగ వుంది. అందుకే చేశాను" అంది లీనా.

"కానీ, నాకు తగిన జోడీవి నువ్వనిపిస్తూంది" అన్నాడు పాల్.

"అయితే నీ దోవన నువ్వు వెళ్ళు" అంది లీనా.

"అంతేనా?" అన్నాడు పాల్.

"అంతే! దయ తలచడం, సాయం చెయ్యడం నాదే తప్పు!"

"అలాగా! వెళ్తున్నాను" అంటూ వెనక్కి చూడకుండా అంతకు ముందు తన గుర్రాన్ని వదలివేసిన కొండ చరియ క్రిందకు నడక మొదలెట్టాడు. రాతి బొమ్మలా పాల్ వెళుతున్న వైపే చూస్తూ నిలుచుంది లీనా.

మగణ్ణి చంపినవాళ్ళపై పగ తీర్చుకోకుండా మరో మగాడి కోసం వెతికే తెగువ తనకు లేనందుకు గర్వ పడిందా క్షణంలో లీనా!

# 7

పాల్ క్రిందకు దిగుతుండగా, చరియ పైభాగంలో గుంట త్రవ్వి ఫ్రేంసింగ్ శవాన్ని అందులో వేసి మట్టి తోస్తూ వున్న సుందరసింగ్ చూశాడు. వెంటనే చేస్తున్న పనిని ఆపి, నారాయణసింగ్ దగ్గరకు వెళ్ళాడు. అతన్ని చెయ్యి పట్టుకు లాక్కొచ్చి చూపించాడు.

"ఇంతదాకా ఎక్కడున్నట్లు?" అడిగాడు నారాయణ సింగ్.

"లీనా దాచి వుండాలి, అటువేపునుండే వచ్చాడు!" చెప్పాడు సుందరసింగ్.

"వాడు ఎటునుండి వచ్చాడో వెళ్ళి చూచిరా! ఇంక తప్పించుకోవడం అసాధ్యం! ఈలోగా నేను మన గుర్రాలను తెస్తాను!" అన్నాడు నారాయణసింగ్.

సుందరసింగ్ కాళ్ళతో, చేతుల్తో గబగబ మట్టంతా

గుంటలోకి తోసి బయలుదేరాడు. నేలపైన కూర్చుని నిదానంగా పరిశీలించసాగాడు. బూట్ల వత్తిడికి నేలలోకి కూరుకుపోయిన చిన్న రాళ్ళనుబట్టి ముందుకు వెళ్ళాడు ఆ జాడల వెంటే. అవి అతన్ని లీనా గుడిసె వద్దకు చేర్చాయి.

లీనా లోపల్నుంచే గమనించింది సుందరసింగును. అతను ఏం చేస్తున్నదీ ఆ తర్వాత జరగబోయ్యేదీ వూహించింది. అక్కడుంటే క్షేమకరం కాదని, గుడిసె వెనుక ద్వారంగుండా చెట్లలో పడి, తిరిగి ముందుకొచ్చి అట్నించి అటే పాల్ను అంతకు ముందు కలుసుకున్న ప్రదేశం వైపు నడక సాగించింది.

సుందరసింగ్ గుడిసెలోకి దూరాడు. ఎవ్వరూ కనుపించలేదు. లీనా పేరు పెట్టి పెద్దగా పిలిచాడు. ఆమె పలకలేదు. పిట్ట జారిపోయిందని తీర్మానించుకొని నారాయణసింగ్ కోసం వెనక్కి బయలుదేరాడు.

"ఏమైంది?" అడిగాడు నారాయణసింగ్.

"ఆమె వెళ్ళిపోయింది."

"బహుశా ఆ పాల్‌గాడి దగ్గరకే వెళ్ళి వుండాలి! గుర్రమెక్కి వెళ్దాం!" అన్నాడు నారాయణసింగ్.

"ఆమెను లొంగదీసుకోవడం అంత సులభం కాదు. మరేదన్నా మార్గం ఆలోచించాలి!" అన్నాడు సుందరసింగ్.

"తుపాకీకి కాక మనిషి మరి దేనికి లొంగుతాడు?"

"వాళ్ళ దగ్గరా వున్నాయి తుపాకీలు. వాట్ని మనపైన ప్రయోగించకుండా వుండే విధానం చూడాలి!"

"ఏమిటా విధానం?"

"లీనాకో తమ్ముడున్నాడు. వాడంటే ఆమెకు ప్రాణం. మనం వాణ్ణి దొరకబుచ్చుకుంటే ప్రాణాలకు భయం పెట్టవచ్చు."

"నా కర్మం కాలేదు."

"పాల్‌ను మనకు అందిస్తే, ఆమె తమ్ముడ్ని ప్రాణాలతో వదిలేద్దామని చెప్దాం. అలా చెయ్యకుంటే కాల్చి పారేస్తామని బెదిరిద్దాం!" అన్నాడు సుందరసింగ్.

"అలాగే! వాడెక్కడున్నాడు?" అడిగాడు సుందర సింగ్‌ను.

గొర్రెలను కాపలా కాస్తున్న లీనా తమ్ముడ్ని చూపించాడు. మారు మాట్లాడకుండా నారాయణసింగ్ గుర్రాన్ని అటు వేపు కదిలించాడు. పది నిముషాల్లో ఆ కుర్రాడ్ని గుర్రంపైన కూర్చోపెట్టుకుని వచ్చేశాడు.

నారాయణసింగ్, సుందరసింగ్ ఇద్దరూ కొండ క్రింది భాగానికి ప్రయాణం మొదలెట్టారు.

గాలి పీలుస్తూ వాసనల కోసం వెతకసాగాడు తన ముక్కు పుటాలతో సుందరసింగ్. పచ్చికట్టెలు కాలుతున్న వాసన గాలిలో కలిసి కొద్ది కొద్దిగా రావటం పసిగట్టాడు.

"వాళ్ళీ ప్రాంతాల్లోనే వున్నారు!" అన్నాడు సుందర సింగ్.

"ఎలా చెప్పగలవ్?"

"చలి కాచుకునేందుకు వేసిన మంట తాలూకు వాసన వస్తూంది."

మరో రెండు నిమిషాల్లో కొండ క్రిందిభాగం చేరుకున్నారు. అక్కడ వాళ్ళకు పాల్, లీనా కనుపించిలేదు. గుర్రం కూడా లేదు. కానీ కాల్చి పారేసిన సిగరెట్ పీకలు, చలి కాచుకునేందుకు వేసిన మంట కనుపించాయి.

"జారిపోయారా?" అన్నాడు నిరుత్సాహంగా నారాయణసింగ్.

"ఎవరు?" అడిగాడు లీనా తమ్ముడు.

"నోరు మూసుకో! అనవసరంగా వాగకు!" గద్దించాడు నారాయణసింగ్.

సుందరసింగ్ గుర్రం దిగి ఆ ప్రాంతమంతా పరిశీలించాడు. దక్షిణం వేపుగా గుర్రపు డెక్కలు కనుపించాయి వాటివెంట ప్రయాణం చెయ్యసాగారు. కొండ దాటాక పెద్ద ఇసుకపర్రు కనుపించింది. పాల్ గుర్రపు అడుగులు స్పష్టంగా అందులో కనుపించాయి. వాటి వెంట గుర్రాల్ని పరుగెత్తించారు. అరగంట పోయాక కుడివేపు చిన్న నీళ్ళ గుంట దగ్గర ఎర్ర గుర్రం కనుపించింది.

"అక్కడే వున్నారు!" అన్నాడు సుందరసింగ్.

ఆ గుంట చుట్టూ పొడవుపాటి ఎత్తైన తాటిచెట్లున్నాయి.

రెండు గుర్రాల్ని అటుకేసి నడిపించారు. నారాయణసింగ్ దిగాడు గుర్రం. లీనా నీళ్ళ దగ్గరగా నిలుచునుంది.

"అతన్ని కాపాడాలనుకున్నావ్. ప్రేంసింగ్‌ను నాచేత చంపించావ్. పారిపోదామని బయలుదేరావ్. నా సంగతి అర్థమైందా? ఎక్కడున్నా వెతికి వేటాడగలను" అన్నాడు నారాయణసింగ్.

"మీరు దొంగలు, హంతకులు. అందుకే నాకు అసహ్యం. మిమ్మల్ని మట్టుబెట్టడానికే అలా చేశాను" అంది లీనా.

"అందుకే నీ కళ్ళ ముందు మీ తమ్ముడ్ని చంపేందుకు పిల్చుకొచ్చాను" అంటూ తన వెనక్కు లాగిపెట్టుకున్న లీనా తమ్ముడ్ని కాళ్ళ ముందుకు లాగాడు.

లీనా బిక్కచచ్చిపోయింది.

"వాడు పసివాడు వదిలెయ్యి" అంది లీనా.

"వదలను" అన్నాడు నారాయణసింగ్ పాల్ కోసం

చుట్టూ చూస్తూ.

నిశ్శబ్దాన్ని చీల్చుకుని నిప్పులు కురిపిస్తూ తాటిచెట్టు మొదట్లోంచి తుపాకీ గుండు తిన్నగా వచ్చి సుందరసింగ్ గుండెలో తగిలింది. చావుకేక వేస్తూ పక్కన కూలిపోయాడు. మరో గుండు నారాయణసింగ్ కూర్చున్న గుర్రానికి తగిలింది. పిచ్చెక్కినట్టు పరుగు తీసింది. ఆ పరుగులో నారాయణసింగ్ ను కూడా విసరివేసింది నేలపైకి.

లీనా తన దగ్గరున్న రివాల్వర్‌తో మరో రెండు రౌండ్లు కాల్చింది నారాయణసింగ్ వైపు. అతని తల నేల వాలిపోయింది. చెట్టు పైనుంచి దిగివచ్చాడు పాల్.

"నీ పథకం బాగా పని చేసింది. ఎంత పరుగెత్తినా మనం వాళ్ళని తప్పించుకోలేమని తెలుసు." అన్నాడు పాల్.

"నా కోరిక తీరింది. వస్తాను!" అంది తమ్ముణ్ణి దగ్గరకు లాక్కుంటూ.

"నాకు ఎటూ పోవాలని లేదు. నీతో వుండామని వుంది మనిద్దరం కలిస్తే అడవిని పరిపాలించగలం. నిన్ను పెళ్ళి చేసుకుంటాను. ఇప్పుడు దుర్మార్గులెవ్వరూ లేరు. కాబట్టి మన వ్యాపారం గూడా బాగా జరుగుతుంది!" అన్నాడు పాల్ అర్థింపుగా.

లీనా ఒక్కక్షణం పాల్ వైపు తదేకంగా చూసింది. చిన్నగా నవ్వి "నాకూ అభ్యంతరం లేదు!" అంది లీనా సిగ్గుతో తల వంచుకుంటూ. లీనా తమ్ముడు ఇద్దరి మధ్యా వచ్చి చేయి చేయి కలిపి పట్టుకున్నాడు. ముగ్గురూ ఆనందంగా తమ గుడిసె వేపు కదిలారు.

—: ఐపోయింది :—




## (18వ భాగము)

మళ్ళీ తుపాకులు గురి చేశాం ఇద్దరం.

కనీసం ఇద్దరన్నా చనిపోయి వుండాలనుకున్నాను.

వాళ్ళూ బాణాలు వదలటం మొదలెట్టారు. ఒకటి నా చెవి ప్రక్కనుంచి 'ఝుంయ్' మని దూసుకుంటూ మాకు వెనుకవేపు వున్న నీళ్ళలో పడింది. ఇంకొకటి డెల్లా ప్రక్కన పెట్టుకున్న సంచీలోకి వచ్చి దూరింది.

ఈ బాణాలు చాలా ప్రమాదకరమైనవన్న విషయం నాకు తెలుసు. వాటి మొనలకు విషం పూస్తారు. అవి గనుక శరీరానికి తగిలాయంటే క్షణంలో చావు తప్పదు

జాగ్రత్తగా వుండమని డెల్లాను హెచ్చరించాను.

ఇద్దరం కాల్పులు నిర్విరామంగా కానిచ్చాం.

సగం మందికి పైగానే చనిపోయారు. మిగిలిన డింగీలు ముందుకు రావడం మాని వెనక్కి పోతున్నట్లు, చీకట్లోనే పసిగట్టాను.

మా దగ్గర తూటాలు అయిపోయాయి. డింగీలు తిరుగు ముఖం పట్టడంతో కాస్త ధైర్యం వచ్చింది.

"ఈ గండం గడిచినట్లుంది" అంది డెల్లా.

"ఆఁ! గట్టెక్కే మార్గమే ఆలోచించాలి." అన్నాను.

"చిన్నగా వెళ్ళి కొండ వద్దకు చేరుకుందాం. మన అదృష్టం బావుంటే ఏదన్నా స్టీమరు రావచ్చు. దాంట్లో చెక్కేద్దాం" అంది డెల్లా.

"తొందరపడి పోవడం ప్రమాదం. వాళ్ళింకా అక్కడే వున్నా వుంటారు. మనం యీ డింగీలో సముద్రం దాట లేమని తెలుసుకొన్నారు. మనకున్న మార్గమల్లా అక్కడ నుండి ఏదన్నా స్టీమరు పట్టుకోవడం అని కూడా తెలుసు" అన్నాను.

"అయితే ఏం చేద్దాం?"

"భగవంతుడిపైన భారం వేసి ఈ డింగీలోనే ముందుకు వెళ్దాం!" అన్నాను.

"ఇంత పెద్ద సముద్రాన్ని, ఈ డింగీతో దాటి ప్రాణాలతో గట్టు చేరతామనేనా నీ నమ్మకం?" వింతగా చూస్తూ అడిగింది డెల్లా.

"ప్రయత్నిద్దామనుకుంటున్నాను. మనం చావాలని రాసిపెట్టి వుంటే తప్పించుకోలేం. నీకు ధైర్యంగా వుంటే చెప్పు, వెళ్దాం" అన్నాను.

కాసేపు మౌనంగా చుట్టూ వున్న చీకటిని, కనుమాపు మేరదాకా కనుపిస్తున్న సముద్రాన్ని తదేకంగా చూస్తూ

కూర్చుంది డెల్లా. నోటమాట రాలేదు. తెలిసీ తెలిసీ మృత్యువు దగ్గరకు పోతున్నట్లుగా నాకూ అనిపించింది. కానీ అంతకన్నా వేరే దారేది కనుపించలేదు.

"ఏమంటావ్?" హెచ్చరించాను డెల్లాను.

"నీ యిష్టం!" అంది మెల్లగా.

డింగీని బరువు సరిగ్గా వుండేట్లు సంచుల్ని సర్ది, నేను కూడా సర్దుకొని కూర్చున్నాను. తెడ్లుతీసి మెల్లిగా కదపడం ప్రారంభించాను. మెల్లగా నీటి తెరను చీల్చుకుంటూ కదలసాగింది మా డింగీ.

డెల్లా కూడా తెడ్లు వేసేందుకుసద్యుక్తురాలైంది. వద్దని వారించాను. ఇద్దరం ఉన్న శక్తినంతా ఒకేసారి ఖర్చు చేసుకోవడం నా కిష్టం లేదు. ఒకరి తర్వాత ఒకరు తెడ్లు వెయ్యడం మంచిదనిపించింది. ఒకరు అలిసిపోయేలోగా మరొకరు బలం పుంజుకోవచ్చు.

సముద్రం పైన తెల్లవారింది. ఎర్రటి సూర్యకిరణాలు నీలం రంగు నీళ్ళపైబడి, పసుపు రంగు కాంతిని చుట్టూ పరిచాయి. ఆ దృశ్యం మనోహరంగా వుంది. డెల్లా నిద్రలో వుండిపోయింది. వెలుతురు తెలుపెక్కింది. కను చూపు మేరదాకా కళ్ళు చీల్చుకుని చూశాను.

నీళ్ళు తప్ప మరేం కనుపించలేదు. మాకాశ్రయం ఇస్తుందనుకొన్న కొండ కూడా కనుపించలేదు. అంటే దానినుండి మేము చాలాదూరం వచ్చేసి వుండాలను కున్నాను.

"ఇనుప కటకటాల ఇరుకు 'ఖైదు' మనిషి సృష్టించాడు. గోడలులేని, ఓడలు దొరకని ఈ ఖైదు ప్రకృతి సృష్టించింది మాకు" అనుకున్నాను.

డెల్లా కళ్ళు తెరిచింది. ఇద్దరం సముద్రపు నీళ్ళు పుక్కిలించి ఉమ్మి, సంచీలో తెచ్చుకొన్న ఆహారం కొద్దిగా తిన్నాం. కాస్త విస్కీ కూడా పుచ్చుకుని సిగరెట్లు వెలిగించాం. మావద్ద మిగిలిన ఆహారం మరో రెండు దినాలకు సరిపోతుంది. ఆ తర్వాత ఆకలికి చావక తప్పదు.

"ఈ ఆహారం అయిపోయేలోగా మనం గట్టుజేరుకుంటామా?" అడిగింది డెల్లా సిగరెట్ దమ్ములాగి వదుల్తూ.

"ఆఁ! జానపద కథల్లోలాగా ఏదైనా పక్షి ఆకాశంలో ఎగురుకుంటూ వచ్చి, మనల్నిద్దరినీ ఎక్కించుకొని పోతే తప్ప, గట్టెక్కే అవకాశం కనుపించడంలేదు!" అన్నాను తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో.

"మా ఇంటినుండి బయలుదేరిన క్షణాలు అంతమంచివి కావు. అంతా కష్టాలే! బాధలే!!" అంది డెల్లా.

"నాకూ అంతే!" అన్నాను.

"ప్రతి సముద్రంలోనూ అమెరికాదేశపు నౌకాదళాలు కాపలాగాపెట్టి వున్నారని పేపర్లో చదివా నొకసారి. అలాంటి వేమన్నా ఈ సముద్రంలో వుండే అవకాశం లేదా?" ప్రశ్నించింది డెల్లా.

నాకూ ఆ విషయం గుర్తొచ్చింది. చాలాసార్లు నేను కూడా చదివాను. సముద్రజలాల్ని కాపలాకాస్తూ, విరోధి కూటమికి చెందిన నౌకలు రాకుండా చాలా పెద్ద బలగాన్ని ప్రతి సముద్రంలోనూ పెట్టారు అమెరికన్లు. ఆ బాపతు నౌక లేవన్నా కనుపించే అవకాశం వుంది. ఆ ఆశ నాలో క్రొత్త ఉత్సాహాన్ని ధైర్యాన్ని కలిగించింది.

డింగీని ఇద్దరం వేగంగా ముందుకు నడపసాగాము. ఆ పగలంతా శ్రమపడి చాలాదూరం ముందుకో, వెనక్కో,

ప్రక్కకో తెలీనివిధంగా నడిపాం. సముద్రం ప్రశాంతంగా వున్నందువల్ల, డింగీని ముందుకు నడపడం నాకేం కష్టంగా అనిపించలేదు.

చీకటిపడింది.

అంతదాకా ఉప్పగా ఎండిపోయినట్లు వీచినగాలి, చల్లగా మారింది. గాలిలో తేమకూడా కాస్త ఎక్కువగా వున్నట్లుతోచింది. వాతావరణంలో ఉన్నట్లుండి వచ్చిన ఆ మార్పు నన్ను కాస్త కలవరపెట్టింది. బహుశా సముద్రం పైన మాకు కాస్త దూరంగా, విపరీతంగా వర్షం కురుస్తూ వుండాలనుకున్నాను. ఆ వర్షం మమ్మల్ని నిలువునా సముద్రంలో ముంచివేసే ప్రమాదముంది.

తెడ్లు వెయ్యడం ఆపేశాను. జెల్లాకు విషయం చెప్పాను.

విని ఆమెకూడా భయపడింది.

డింగీ అసలే చిన్నది. దానికి తోడు చాలా తేలికైంది కూడా. నీళ్ళలోతూ ఎక్కువగాబట్టి, విసురుగా, గాలి వేస్తే ఎంత కంట్రోలుచేసినా ఆగదు. బోల్తాకొట్టి బోరగిల పడుతుంది.

"ఏంచేద్దాం?"

"ఆఖరి ప్రార్థన చేసుకుని కళ్ళు మూసుకుందాం. కనీసం కలిసి వచ్చే అవకాశం భగవంతుడు మనకు కలిగించినందుకు ఆనందిద్దాం!" అన్నాను.

డింగీని కదలిక లేకుండా చేసేందుకు తెడ్లు వెయ్యడం మానేశాం. వర్షం రాకకోసం చెవులు రిక్కించుకొని, శబ్దాలు వింటూ ఎదురుచూడసాగాం.

దూరంగా ఎక్కడో నీళ్ళను కత్తితో మధ్యకు విసురుగా నరుకుతూన్న శబ్దం వినిపించింది. దృష్టినంతా

కేంద్రీకరించి విన్నాను. శబ్దం కాబోతున్నట్లుగా వుంది. మా డింగీ మెల్లగా అటూ ఇటూ కదలడం పసిగట్టాను. వొంగి నీళ్ళపైకి చూశాను. పెద్దపెద్ద కెరటాలు వస్తున్నాయి మా డింగీ వైపు.

అప్పటిదాకా ప్రశాంతంగా వున్న సముద్రంలో అలజడి అకస్మాత్తుగా ఎందుకు ప్రారంభమైందాని అదిరిపోయాను. అలాంటి అలజడికి మామూలుగా తిమింగలాలు కారణమవుతూ వుంటాయి. తిమింగిలం నీళ్ళలోనే వస్తూంది. అది గాలి వదిలేసరికి, దాని స్పీడుకు నీళ్ళు పదడుగులెత్తున అలల్లా లేస్తాయి. కాస్త వొళ్ళు విరిచిందంటే దాని వీపు నీళ్ళపైకి లేస్తుంది. ఆపని డింగీ దగ్గరికొచ్చాక చేసిందంటే ఇద్దరం సముద్రం పాలవుతాం. దాంతో మా వాసన పసిగడుతుంది. అంతే ఇద్దర్నీ ఒక్కసారి మింగుతుంది. ఆపైన ఆలోచించలేక పోయాను.

నా అనుమానం డెల్లాకు చెప్పాను.

తిమింగిలం మాట వినగానే, మనిషి బిగదీసుకుపోయింది.

"తప్పించుకొనే మార్గం చూడు!" అంది డెల్లా.

"దాన్ని చంపేదా?" అన్నాను పెద్ద వీరుడిలా.

"ఎలా?" అడిగింది.

"సింపుల్! దాని నోట్లోకి దూకుతాను. అక్కడ్నుంచి పొట్టలోకి చేరుకుంటాను. అక్కడ కాళ్ళతో చేతుల్తో కుమ్మి చంపుతాను" అన్నాను.

"తమాషాలు చెప్తున్నావా?"

"కాకుంటే ఇంకేం చెప్పేది?" అడిగాను.

విస్కీ బాటిల్ సంచీలోంచి లాగి గడగడ తాగింది. సగంపైగానే పూర్తిచేసింది.

"ఎందుకలా అంతా కాజేస్తున్నావ్?" కోపంగా చూస్తూ ప్రశ్నించాను.

"చచ్చాక ఇవన్నీ ఎందుకూ ఉపయోగపడవ్. అందుకే అన్నీ పూర్తిజేసి పారేద్దాం!"

"ఆ తర్వాత అదృష్టంకొద్దీ చావకుండా బ్రతికితే... నోట్లో వ్రేళ్ళు పెట్టుకోవలసిందే!"

"అదృష్టం!... ఎలా వుంటుంది?... ఎక్కడుంటుంది?... అలాంటిదంటూ వుంటే ఇలా అడుగడుక్కీ ప్రతిచోట, ప్రతినిమిషం, మనం పరిస్థితులకో, మనుషులకో, వాతావరణానికో, ప్రకృతికో, దేనికో ఒకదానికి ఖైదీలుగా చిక్కిపోతామంటావా? ఈ నిరంతర పోరాటం కన్నా ఒకరకంగా నువ్వు వస్తుందంటున్న చావు మేలు. ఈ తిమింగిలం చేతుల్లో చచ్చినా ఒక్కటే! లేదా అటు వేపునుండి వర్షం మనల్ని వచ్చి ముంచేసినా ఒక్కటే!" అంది డెల్లా విస్కీబాటిల్ నోటికి కరిపించుకుంటూ.

చావు నిశ్చయమనీ, తప్పించుకొనే దారిలేదని తెలిశాక మనిషికి దానంతటదే వేదాంతం పుట్టుకొస్తుందనడానికి డెల్లా మాటలే చాలనిపించింది.

మా ఇద్దరి జీవితాలకు ముగింపు ఆసన్నమైంది. ఆమెను ఎలాగైనా సురక్షితంగా, ఆమె దేశం చేర్చాలనీ, వాళ్ళ వాళ్ళకు అప్పజెప్పాలని, కన్నకలలన్నీ కలలుగానే మిగిలి పోతున్నాయి. నాకు నాదేశం చేరాలనీ, చేసిన తప్పులకు శిక్ష అనుభవించి, ఆ తర్వాత పుట్టినగడ్డపై మిగిలిన జీవితం పూర్తిజేసుకొని ఆ మట్టిలో కలిసిపోవాలనీ వుండేది. అది నిరాశగానే మిగిలిపోయింది.

దూరంగా, ఎంతో దూరంనుంచి లీలగా, సన్నటి

గోలగా వినిపించిన అలజడి, ఇప్పుడు స్ఫుటంగా, స్పష్టంగా, వినిపించసాగింది దగ్గరలో.

తిమింగిలాలగురించి నేను చదివింది లేదు. అవి సముద్రంలో శక్తివంతమైన స్టీమర్లకన్నా వేగంగా ప్రయాణించ గలగాలి. ఆ లెఖనచూస్తే, మొదట నేను అనుమానించి నప్పటినుండి, ఇంతదాకా దాదాపు, అరగంట గడచింది. తిమింగలాలచే ఈమాత్రం దూరం రావడానికే అరగంట పట్టడం 'అప్సర్డ్' అనిపించింది. కాకుంటే మరేంటాని ఆలోచించాను. నా మెదడుకు మరేమీ తట్టలేదు. ఏదైనా ముసలి తిమింగిలం కాబోలనుకున్నాను. అదీగాకుంటే దెబ్బ తిని గాయపడన్నా వుండాలనిపించింది.

"దగ్గర కొస్తున్నట్లుంది!" అంది డెల్లా నీళ్ళకేసి చూసి.

"ఆఁ!" అన్నాను నేనుగూడా గమనించి చూసి.

నామాట పూర్తిగాక ముందే, సముద్రం మా ముందు కల్లోలమైపోవడం, నీళ్ళు చుట్టలు చుట్టుకోవడం చూశాను. డెల్లాతో నన్ను ఘట్టిగా పట్టుకోమన్నాను. మా ఇద్దరికీ ఈదడం వచ్చు.

మా డింగీ క్రిందనుండి అలలు పుట్టుకొచ్చాయి. అది బోల్తాకొట్టకుండా మా బరువుని చకచక అటూ ఇటూ అతివేగంగా మార్చసాగాం. రెండు నిమిషాలకన్నా ఎక్కువ ఆపలేకపోయాం.

డింగీ అడ్డం తిరిగింది. బోల్తా కొట్టింది. ఇద్దరం నీళ్ళలో పడ్డాం. మామీద గొడుగులా పడింది డింగీ. మేము తెప్పరిల్లి తేలాలన్న ప్రయత్నం చేసేలోగా ఐదారుగజాలు నీళ్ళలోకి మునిగిపోయాం. నా కాళ్ళకు నున్నటి లోహం

తగిలింది. అది తిమింగలం చర్మం కావడానికి వీల్లేదు. దాని పైన నిలుచున్నాను. నా స్పర్శజ్ఞానం మేల్కొంది. అది లోహపు ఉపరితలంలా వుంది.

రెండు నిమిషాల్లో మా ఆకారాలు పైకొచ్చాయి. కాళ్ళక్రింద ఏదో ఆదరువుంది.

కళ్ళు తెరిచాను.

"మన కాళ్ళక్రిందేమిటి?" అడిగింది డెల్లా ఆశ్చర్యపోతూ.

వొంగి చూశాను. తెల్లగా కనుపించింది. అల్యూమినియంలా వుంది. అంతే! నా ఆనందానికి అంతులేదు. అది తిమింగిలం కాదు. ఏదో సబ్ మెరైన్. దాని ముందున్న గుండ్రటి భాగం నీళ్ళపైకి లేచింది. కాంతివంతమైన లైటు వెలిగింది. సముద్రంలోని కొంత భాగం పట్టపగలులా మారిపోయింది.

ఇంకొంత సేపటికి సబ్ మెరైన్ మొత్తం నీళ్ళపైకి వచ్చింది. పైనున్న డోర్ తెరుచుకుంది. ఒకతను మిలిట్రీ యూనిఫాంలో వున్నాడు. పైకొచ్చి,

"లోనికి రండి!" అన్నాడు, అమెరికన్ స్లాంగ్‌లో వున్న ఇంగ్లీషులో.

మారు మాట్లాడకుండా అతనివెంట లోనికి దిగాం. మా వెనకనే లావుపాటి బలమైన మెకాలో చేసిన తలుపు రక్కున మూసుకుంది.

నావిగేటింగ్ వీల్ దగ్గర ఇద్దరు కూర్చుని వున్నారు. మమ్మల్ని ఓమారు తలత్రిప్పిచూసి ఆ తర్వాత మళ్ళీ వాళ్ళ పనిలో యధాప్రకారం మునిగిపోయారు.

అక్కడ్నుంచి మరో అంతస్తు క్రిందకు దిగాం. విశాలమైన హాలులా వుంది. లైట్లు వెలుగుతున్నాయి. కుర్చీలు

చుట్టు వేసివున్న డైనింగ్ టేబుల్ లాంటి దాంతో ఖరీదైన హోటల్ ను గుర్తుకు తెచ్చిందా గది.

ఎడంవేపుగా వున్న తలుపు చూపిస్తూ, "లోనికెళ్ళి, వాష్ చేసుకొని రండి. వెయిట్ చేస్తుంటాను" అన్నాడు అతను.

ఇద్దరం తలుపు త్రోసుకొని లోనికెళ్ళాం. అందమైన చిన్నగది. ఒకటే బెడ్ వుంది.

తలలు తుడుచుకున్నాం. మొహాలు టాప్ దగ్గర కడుక్కొన్నాం. నీళ్ళు తియ్యగా వున్నాయి. ఆత్రంగా టాప్ ను నోటికి పెట్టుకొని త్రిప్పి త్రాగాను రెండు నిముషాలు కడుపునిండేట్లుగా.

వేరేబట్ట లేకున్నా వేసుకోనేందుకు వీలుంటుందేమోనని చూశాను. ఏవీ కనుపించలేదా గదిలో.

ఇద్దరం వెలుపలకొచ్చాం.

"ఆడవాళ్ళ బట్టలు మా దగ్గర లేవు. ఈ యూనిఫాంలు వేసుకోండి!" అంటూ టేబుల్ పైనమాకోసం పెట్టిన బట్టల్ను, తనచేతిలో వున్న వెండిపాన్ను బొత్తంతో చూపించాడు అవతలవేపు నిలుచుని.

లైటు వెలుతురు క్రింద నిలుచున్న అతన్ని చూశాను. ఆరడుగుల ఆజానుబాహు విగ్రహం. తెల్లటి హాఫ్ పాంటు, షర్టు టక్ చేసుకొన్నాడు. హాఫ్ పాంటు మడత స్టిఫ్ గా వుంది కత్తి మొనలా. మోకాళ్ళదాకా సాక్సు తొడుక్కున్నాడు. నల్లటి బూట్లు నిగనిగ మెరుస్తున్నాయి. ఎడంచేతిలో గోల్డుకలర్ వాచ్ కట్టుకున్నాడు. క్రమశిక్షణ, ధైర్యం, సాహసం మూర్తీభవించినట్లున్నాయి అతని రూపంలో.

యూనిఫాంలు తీసుకుని ఇద్దరం గదివేపు వెళ్ళబోతూంటే అతను నవ్వాడు.

తక్కున వెనక్కి తిరిగాను.

"ఇద్దరూ ఒకేసారి మార్చుకుంటారా?" అడిగాడు అతను నవ్వుతునే.

నాకూ నవ్వొచ్చింది. ఆడ మగా మరచిపోయి సాగించిన జీవితం గురించి అతనికి తెలీక అలా అన్నాడని నా కర్థమయినా, డెల్లాను లోనికి వెళ్ళమని నేను అక్కడే నిలుచున్నాను.

"నా పేరు రాజ్!" అన్నాను నన్ను నేనే పరిచయం చేసుకోనే ప్రయత్నం చేస్తూ.

"ముందు బట్టలు మార్చుకోండి. ఆహారం తీసుకోండి. ఆ తర్వాత మీ మంచి చెడ్డలు వివరంగా చెప్పండి. వింటాను" అన్నాడు తాపీగా. మాగురించి తెలుసుకోవాలన్న ఆతృత అతనికి ఎందుకు కలగటం లేదో అర్థంకాలేదు నాకు. అక్కడే నిలుచున్నాను. అతను వెళ్ళిపోయాడు మెట్లెక్కి పైకి.

అతను కనుమరుగు కాగానే, డెల్లా కోసం చూశాను. రెండు నిముషాల తర్వాత వెలుపలి కొచ్చింది. ఈమారు ఆమె వేసుకున్న దుస్తులు చూచి నవ్వాపుకోలేకపోయాను లావాటి వ్యక్తి తాలూకు యూనిఫాం కావటంతో హాఫ్ పాంటుతోపాటు, షర్టు కూడా బాగా లూజుగా వుంది. డ్రాయరు, బ్రా లేకపోవటంతో తెల్లటి షర్టులోంచి ఆమె వొంటి రంగు కనుపించసాగింది. నడుం చుట్టూ రెండు చేతులూ గట్టిగా పట్టుకుని వచ్చింది.

"ఏంటలా చేతుల్తో పాంటుని పట్టుకున్నావ్?" అడిగాను.

"లూజుగా వుంది. వేద్దామంటే బెల్టు కూడా లేదు! జారిపోతుంది!" అంది.

"బకిల్సు వెయ్యాకపోతివా?"

"చూశాను. అదీ లాభం లేదు!" అంది.

"ఇక్కడే వుండు నేను బట్టలు మార్చుకొని వస్తాను. ఆ తర్వాత బెల్టు కోసం ట్రై చేద్దాం!" అని లోనికి వెళ్ళాను.

నా డ్రెస్ ఒక మోస్తరుగా సరిపోయింది. కాస్త లూజుగా వున్నా జారిపోయే ప్రమాదం లేదు. వెలుపలికొచ్చాను. డెల్లా అలాగే నిలుచుని వుంది.

"పద! పైకి వెళదాం!" అన్నాను.

ముందు నేనూ, నా వెనుక డెల్లా ఇద్దరం మెట్లెక్కి పైకొచ్చాం.

నాతో అంతకు ముందు మాట్లాడిన ఆఫీసరు కోసం అటూ ఇటూ చూశాను. అతను కనుపించలేదు. నావిగేటర్లు నా చూపులు చూచి ఎదురుగా వున్న డోర్ కేసి చెయ్యి చూపించారు వెళ్ళమన్నట్లు.

వాళ్ళు చూపించిన వైపు డోర్ వద్దకు వెళ్ళి నెట్టాను. ఆ తలుపు తెరుచుకొంది. విశాలమైన గది మధ్య, రాకింగు ఛెయిర్‌లో కూర్చున్న అతను కనుపించాడు.

"కమాన్ మై ఫ్రెండ్!" నన్ను చూస్తూనే ఆహ్వానించాడు.

ఇద్దరం లోనికి వెళ్ళాం.

రెండు చిన్న మోడాల్లాంటివి చూపించాడు కూర్చోమని. వాటిపైన కూర్చున్నాం.

"బట్టలు సరిపోయాయా?" అడిగాడు.

"అఁ! నాకు సరిగానే వున్నాయి. ఈ మెకు కాస్త లూజుగా వున్నాయి. బెల్టులాంటి దేదన్నా వుంటే బావుంటుంది" అన్నాను.

"మా సబ్ మెరైన్‌లో ఆడవాళ్ళ బట్టలుండవు. బెల్టులు కూడా వుండవు" అంటూ డ్రాయరు లాగి అందు లోంచి వెడల్పాటి టేప్ తీసిచ్చాడు. అది అందుకుంది డెల్లా. కూర్చునే కట్టుకుంది నడుం చుట్టూ.

"యస్! ఇప్పుడు చెప్పండి. ఎవరు మీరు? ఈ సముద్రంలోకి ఎలా వచ్చారు? ఆ డింగీలో ఎక్కడికి వెళ్ళాలని ప్రయత్నం చేస్తున్నారు?" అడిగాడు అతను.

మా కథంతా క్లుప్తంగా చెప్పాను చకచక. అంతా విన్నాడు. డెల్లాకేసి చూశాడు.

"ఎక్సయిటింగ్ స్టోరీ!" అన్నాడతను.

"ఇది స్టోరీ కాదు! జరిగిందే!" అన్నాను అతని మాటల్ని కరెక్టు చేస్తూ.

"అయితే మీరు ఏ దేశానికో సంబంధించిన గూఢ చారులనుకొన్నాం. మా సబ్ మెరైన్‌ల గురించి, ఫ్లీట్ గురించి వివరాలు సేకరించేందుకొచ్చి ప్రమాదంలో చిక్కుకుని పోయారని మావాళ్ళూహించారు" అన్నాడు అతను.

అతని పేరు కెప్టెన్ 'షివర్లీ' అని తర్వాత తెలుసుకున్నాను. అమెరికన్ సిక్స్త్ ఫ్లీట్‌లో పని చేస్తున్న పెద్ద అధికారని కూడా గ్రహించాను.

"మేము గూఢచారులం కాదు" అన్నాను నేను.

"ఎలా నమ్మాలి?" నవ్వుతూ అడిగాడు షివర్లీ.

"నేను ఇండియన్‌ను. ఆమె బ్రిటిష్ దేశస్తురాలు. మా ఆకారాల్ని బట్టి ఆ మాత్రం సులభంగా గ్రహించగలరను

కుంటాను. మా రెండు దేశాలు మీకు మిత్ర దేశాలే! అటువంటప్పుడు మేము గూఢచారులం అయ్యే ప్రసక్తి లేదు!'' కొంత ఒప్పించే ధోరణిలో సాగింది నా వాదన.

''కరెక్టు! మీ దేశాలు మాకు మిత్రదేశాలయినంత మాత్రాన మీరు మాకు మిత్రులని నమ్మడం అసాధ్యం. నిజానికి మా దేశంలో మావాళ్ళే, చాలా మంది డబ్బుకు ఆశపడి, పొరుగు దేశాల తరఫున గూఢచారుల్లా పనిచేసి, పట్టుబడిపోయిన సంఘటనలు కోకొల్లలున్నాయి'' అన్నాడు షివర్లీ.

అతను చెప్పింది కూడా నిజమే! అలాంటి వెన్నో కథలు పేపర్లలో చదివాను గూడా.

''అయితే మిమ్మల్ని నమ్మించేందుకు మేమేం చెయ్యాలి చెప్పండి!'' అన్నాను.

''మీకా శ్రమ అవసరం లేదు. ఇక్కడ్నించి మిమ్మల్ని దరినీ మా బేస్‌కు తీసుకుపోతాం. అక్కడ నా పై అధికారులకు మిమ్మల్ని అప్పజెపుతాను. ఆ తర్వాత ఏం చెయ్యవలసిందీ వాళ్ళే ఆలోచించుకుంటారు'' అన్నాడు షివర్లీ.

అంటే మేము మళ్ళీ ఖైదీలమయ్యామన్న మాట! డెల్లా నా వేపు భయంగా చూసింది.

''మీరిద్దరూ భోజనం చేస్తారా?'' అడిగాడు షివర్లీ.

''ఇప్పుడు ఆకలిగా లేదు! తర్వాత తింటాం!'' అన్నాను నేను.

''అయితే ఇందాక చూపించిన గదిలోకి వెళ్ళి రెస్టు తీసుకోండి! ఆ గది మీకు సౌకర్యంగా వుంటుందికదూ!'' అడిగాడు,

"చాలు! సర్దుకుంటాం!" అన్నాను.

ఇద్దరం అక్కడ్నించి దిగి క్రింది హాల్లోకి వచ్చాం. టేబుల్ ప్రక్కనుంచి అంతకు ముందు బట్టలు మార్చుకున్న గదిలోకి వెళ్ళాం.

అనుమానపు పరిస్థితుల్లో మిలిట్రీవాళ్ళ చేతబడగూడదెవ్వరు. పడ్డాక ఎంత కాదని తల మొత్తుకున్నా వాళ్ళు వినరు. నిజం చెప్పించడమనే సాకుతో నానాయాతనలు పెడతారు. ఆ నిజం మనం చెప్పేది కాదనీ, వాళ్ళు కోరే నిజం మాత్రమే నిజమని అభిప్రాయ పడతారు.

వాళ్ళు పెట్టే యమయాతనల గురించి నేను చాలా సార్లు విన్నాను. పుస్తకాల్లో చదివాను. అందుకే కంపరంగా వుంది.

"ఈ సబ్ మెరైన్‌లో అన్ని సౌకర్యాలూ వున్నాయి. మంచి గాలి వస్తూంది. తియ్యటి నీళ్ళు దొరుకుతున్నాయి. లైట్లు వెలుగుతున్నాయి. బాత్ రూం వుంది. ఇవన్నీ ఎలా అమర్చారో..." అంది డెల్లా ఆశ్చర్యపోతూ.

"ఇంతకన్నా గొప్ప ఘనకార్యాలు సాధించాడు మనిషి శాస్త్ర పరిశోధనతో" అన్నాను ఎటో చూస్తూ.

"ఏమిటో ఆలోచిస్తున్నావ్? నా మాటలు సరిగా విన్నట్లు లేదు!" అంది మళ్ళీ డెల్లా.

"ఏం లేదు! మనల్ని వీళ్ళు ఏం చెయ్యబోతారా అని ఆలోచిస్తున్నాను."

"ఏమీ చెయ్యరు. గట్టు చేరంగానే మీ త్రోవన మీరు పొమ్మని వదిలేస్తారు."

"ఎలా చెప్పగలవ్?"

"లేకుంటే మనల్ని వెంటేసుకుని, అంటిపెట్టి, సప్త సముద్రాలూ తమతో త్రిప్పుతారనుకున్నావా?"

"అనుకో లేదు," అన్నాను.

ఆమెకు నాకు తెలిసిందిగానీ, నా ఊహలుగానీ చెప్పడం ఇష్టం లేదు. దాంతో బెంబేలెత్తిపోతుందన్న అనుమానం కూడా కలిగింది నాకు.

ఇద్దరం అడవి గురించీ, అక్కడి మనుషుల గురించీ, నా వెంటబడ్డ ఆడమనిషి గురించీ చాలాసేపు కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నాం. ఆ ఆడమనిషి మాటెత్తినప్పుడు మాత్రం డెల్లా కళ్ళలో అసూయ, కోపం కనుపించాయి.
తలుపు తట్టిన శబ్దమైంది.

నేను లేచి వచ్చి తలుపు తీశాను.

ఎదురుగా షివర్లీ నిలుచుని వున్నాడు. అతని ఎడం చేతిలో పైపు సన్నగా కాలుతూంది.

"భోంచేద్దాం! రండి" అన్నాడు.

ఇద్దరం వెలుపలకొచ్చాం.

టేబుల్ చుట్టూ డజను కుర్చీలున్నాయి. మొత్తం యూనిఫాంలో ఆరుగురున్నారు. రకరకాల టిన్నులు చిన్నవీ పెద్దవీ టేబుల్ పైన పెట్టున్నాయి.

ఒకతను కత్తితో ఒక్కొక్క టిన్నే ఓపెన్ చెయ్యసాగాడు.

మా ముందున్న ప్లేట్లలో, బ్రెడ్ ముక్కలు కొన్ని పెట్టాడు. మరో చిన్న డబ్బాలోంచి ఉడకబెట్టిన కోడి గుడ్లు, వేయించిన చాపలు, వెన్న, బఠాణీలు, మొదలైన రకరకాల సైడ్ డిష్‌లు సర్వ్ చేశాడు.

"కానీండి!" అన్నాడు షివర్లీ.

ఆ భోజనం చూస్తూంటేనే నాకు కడుపు నిండినట్లయింది. అలాంటి ఆహారం తీసుకొని ఎన్నో రోజులయింది

కూడా. గ్లాసులనిండా బీరు పోసి వుంది. అందరం ముందు బీర్ కొద్ది కొద్దిగా సిప్ చెయ్యసాగాం.

అంతకు ముందు డబ్బాలు ఓపెన్ చేసిన వ్యక్తి, వెడల్పాటి టిన్ లోంచి కొంత మిల్క్ పౌడర్ తీశాడు. దాన్ని మరుగుతున్న నీళ్ళలో వేసి కలిపాడు. సాకరిన్ సీసాలోంచి కొన్ని టాబ్లెట్లు అందులో వేసి, ఇన్‌స్టెంటు పౌడరు కూడా కలిపాడు.

కమ్మటి కాఫీ వాసన నా ముక్కుపుటాల్ని తాకింది.

"మిస్టర్ రాజ్ అండ్..." అంటూ డెల్లా వేపు చూసి ఆమె పేరు కోసం తడుముకుంటున్నట్లు ఆగాడు.

"డెల్లా!" తన పేరు చెప్పింది.

"సారీ! మీ పేరు మరచిపోతున్నాను. తృప్తిగా కావలసినంత తినండి. ఏం కావాలో మొగమాట పడకుండా అడగండి సర్వ్ చేస్తాను" అన్నాడు షివర్లీ.

సబ్‌మెరైన్ కదులుతున్న శబ్దంగానీ, ఇంజన్ పని చేస్తున్నట్లు చప్పుడుగానీ వినిపించలేదు. అంతా నిశ్శబ్దంగా వుంది.

"మీరీ సబ్‌మెరైన్‌లోనే తిరుగుతూంటారా ఎప్పుడూ...?" అడిగింది డెల్లా.

"ఆఁ! విరోధి కూటమి తాలూకు సబ్‌మెరైన్‌లుగానీ, నౌకలుగానీ, ఏజంట్లుగానీ, మా రహస్యాల్ని తెలుసుకొనేందుకు ప్రయత్నిస్తున్నారేమో తెలుసుకోవడం మా పని. మరి తిరగకుంటే మా కర్తవ్యం ఎలా నిర్వహిస్తాం?" కాఫీ కప్పు ముందుకు లాక్కుంటూ అన్నాడు షివర్లీ.

"ఓమారు తెచ్చుకునే సప్లయిస్ ఎన్ని రోజులు సరిపోతాయి?" అడిగాను నేను.

"దాదాపు నెల రోజులు."

"నెల తర్వాత మళ్ళీ బేస్‌కు వెళ్తారా?"

"మా బేస్ కూడా సముద్రంలోనే వుంది" అన్నాడు షివర్లీ.

"మీ కేదేనా ప్రమాదం సంభవిస్తే బేస్‌లో వున్న వాళ్ళకు తెలిసే అవకాశం వుందా?" అడిగాను యథాలాపంగా.

షివర్లీ కళ్లు పెద్దవయినాయి. నావేపు అనుమానంగా, కోపంగా చూస్తూ "ఎందుకడుగుతున్నావ్? మమ్మల్ని ఏదన్నా ప్రమాదంలోకి తోద్దామని ఊహిస్తున్నావా?" ప్రతి మాటా తూచి తూచి అన్నాడు.

అతని గొంతు వినగానే నాకు కాళ్ళు వణకడం మొదలెట్టాయి. "సారీ! తెలుసుకోవాలన్న ఉత్సాహంకొద్దీ అడిగాను. అంతే!" అన్నాను నా అమాయకత్వాన్ని తెలియజెయ్యాలన్న తపనతో.

"నిన్ను నేనడిగాను. నువ్వే దేశానికి ఏజంటును కాదన్నావ్. ఏవేవో కథలు చెప్పావ్. నేనూ నమ్మాను. నీబోటివాడు ఎలాగోలా సముద్రంలోంచి బైటపడి, తన వాళ్ళను త్వరగా జేరుకోవాలని ఆరాటపడతాడు తప్ప, అడ్డదిడ్డమైన ప్రశ్నలు వేసి, అనవసరమూ ప్రమాదకరమూ అయిన విషయాల్లో తల దూర్చడు!" అంటూ క్షణం ఆగి "నా టెల్ మి టు వుచ్ కంట్రీ యూ బిలాంగ్" అరిచాడు షివర్లి.

"నేనింతకు ముందు మీకు చెప్పిందంతా నిజం! అందులో ఏమీ అబద్ధం లేదు! నన్ను నమ్మండి!" అన్నాను దీనంగా.

"నో! ఒకమారు నమ్మాను. నా ఐ వోంట్! నాకు నిజం కావాలి! మీరు ఏ దేశపు గూఢచారులో చెప్పండి! క్విక్!" అన్నాడు షివర్లీ.

డెల్లా ముఖం పాలిపోయింది. అయోమయంగా నాకేసి చూసింది. నాకు ఏం పాలుపోలేదు.

షివర్లీ కుర్చీలోంచి లేచి నిలుచున్నాడు.

అతని కళ్ళల్లోకి చూశాను. వాటిల్లో సాధుత్వం మాయమై క్రూరత్వం నిండుకుంది.

అర్థంగాక ఇద్దరం లేచి నిలుచున్నాం.

"మీరు నిజం ఒప్పుకోరా?" అడిగాడు షివర్లీ.

చెప్పిందే చెప్పాను మళ్ళీ.

"నా వెంట రండి" అన్నాడు.

ఇద్దరం అతని వెంట క్రింది అంతస్తులోకి నడిచాం. మమ్మల్నక్కడే నిలుచుండమని చెప్పి, గదిలోకి వెళ్ళి ఖరీదైన కోలీఫ్లెక్స్ ఆటోమేటిక్ ప్రింట్ కెమెరా తెచ్చాడు. దాంతో ఫోటోలు తీశాడు. బటన్ నొక్కగానే పాజిటివ్ ప్రింట్లు వెలుపలికొచ్చాయి. వాట్ని తీసుకుని రేడియో రూంలోకి వెళ్ళిపోయాడు. మమ్మల్ని అంతకు ముందు చూపించిన గదిలోకి వెళ్ళమన్నాడు మేము వెళ్ళి పోయాం. మేము లోనికి పోగానే వెలుపలినుంచి తాళం వేసినట్లు 'క్లిక్'మన్న శబ్దమైంది.

"నోరు మూసుకుని వుండాల్సింది!" అన్నాను కూర్చుంటూ.

"అవును" అంది డెల్లా.

"ఇలా దారుణంగా అనుమానిస్తారనుకోలేదు. నేనెప్పుడూ సబ్ మెరైన్ చూడలేదు. తెలియని విషయాలు

తెలుసుకుందామన్న ఉత్సాహం మన గొంతులకు ఉరి త్రాడు తగిలించేట్లుంది" అన్నాను.

"ప్రతి నిముషం మృత్యువు మనల్ని ఏదో రూపంలో అంటిపెట్టుకునే వుంటుంది. ఇన్నాళ్ళూ ఎలాగో దాని కళ్లు కప్పి తప్పించుకున్నాం. ఇంక ఆఖరి ఘడియలు దగ్గర పడ్డట్లున్నాయి. అందుకే ఇలాటి సంఘటనలు జరుగుతున్నాయి" అన్నాను.

"ఫోటోలు ఎందుకు తీసినట్లు?"

"వాటిని రేడియో ట్రాన్స్‌మిట్ చేస్తారనుకుంటాను బేస్‌కు. అక్కడ వాళ్ళ దగ్గరున్న ఏజెంట్ల ఫోటోలు దేనితోనన్నా సరిపోతాయేమో పరిశీలించి, మళ్ళీ ఇక్కడకు మెసేజ్ పంపుతారు గాబోలు!" అన్నాను.

"మన ఫోటోల్లాంటి ఫోటోలు ఎటూ వుండవు. కాబట్టి మనం భయపడాల్సింది లేదు" అంది డెల్లా.

"అవును." నాకో ఆశారేఖ కనుపించింది.

ఉన్న ఒక్క బెడ్ పైనే ఇద్దరం పడుకున్నాం. డెల్లా త్వరగానే నిద్రపోయింది. నాకు మాత్రం కునుకు రాలేదు. ఏం జరగబోతుందాన్న ఆతృతతోపాటు; లక్ష ఆలోచనలు కూడా రాసాగాయి. బొంబాయి గుర్తొచ్చింది. అక్కడి నా జీవితం, దాన్నుండి పారిపోయి రావడం మొదలైనవన్నీ సినిమా బొమ్మల్లా కళ్ళ ముందు చకచక తిరగనారంభించాయి.

నిద్ర వచ్చే సూచనలు కనుపించలేదు.

లేచి కూర్చున్నాను.

సిగరెట్ ముట్టించాను. కిటికీకి బిగించిన అద్దంలోంచి చూడసాగాను. నల్లటి నీళ్ళు తప్ప మరేం కనుపించలేదు.

అప్పుడప్పుడూ పెద్దపెద్ద చేపలు, పాములు, మొదలైన జలచరాలు, కిటికీకి అమర్చిన అభ్రకం షీటుకు మోదుకుంటున్నాయి. అవి నోరు తెరిచి కిటికీపై వస్తుంటే, నాతల దాని నోట్లో ఇరుక్కున్నట్టుగానే వుంది. అలా ఎంతసేపు వారిని చూసినా విసుగుపుట్టలేదు. చాలా ఎక్సయిటింగ్ గా వుంది. దగ్గరలోనే పడుకున్న డెల్లాకాని, ప్రయాణం చేస్తున్న సబ్ మెరైన్ గానీ, నాకు గుర్తురాలేదు.

కళ్ళు నొప్పులు పుట్టినట్లయింది. ఓమారు అరచేతుల్తో అదిమి రుద్దుకున్నాను. క్రిందికి చూశాను. సిగరెట్ పీకలు కుప్పగా పడివున్నాయి. వాటిప్రక్కన రెండు ఖాళీ పాకెట్లు కూడా వున్నాయి

తలుపు దబదబ తట్టిన శబ్దమయింది.

లేచివెళ్ళి లోపలున్న గొళ్ళెం తీశాను. డెల్లా నిద్ర పోతూనే వుంది. తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా షివర్లీ నిలుచుని వున్నాడు.

"కమ్ విత్ మీ!" అన్నాడు.

"డెల్లా నిద్రపోతూంది" అన్నాను.

"నువ్వు రా! చాలు!" అన్నాడు షివర్లీ.

అతనివెంట పైభాగంలో వున్న గదికి నడిచాను.

అతని గదిలోకి వెళ్ళాం ఇద్దరం. కూర్చోమన్నాడు తను కూర్చుంటూ.

ఎదురుగా కూర్చున్నాను.

"నువ్వు ఏదేశం తరపుగా సీక్రెట్ ఏజంటుగా పని చెయ్యటం లేదనీ, దారితప్పిన బాటసారిననీ, చెప్పావు. అవునా?"

"అవును" అన్నాను.

"నువ్వు చెప్పిన కథలో మరచిపోయిందేమైనా వుందా? ఆలోచించు" అన్నాడు షివర్లీ.

"లేదు! మొత్తం చెప్పాను" అన్నాను.

అలా అంటూంటే గుర్తొచ్చింది. ఆటంబాంబులు దాచిన రహస్య స్థావరంలో మేము కొన్నాళ్ళుండిన సంగతి చెప్పలేదని. ఆ విషయం కావాలనే చెప్పలేదు నేను. దానివల్ల మంచికన్నా, చెడే ఎక్కువ జరుగుతుందని అనుమానించాను. ఒకవేళ దానిసంగతి తెలిసిందేమో షివర్లీ కనిపించింది. ఇప్పుడు తిరిగి చెప్తే నా మీదున్న అనుమానం ఎక్కువయ్యే అవకాశం వుంది. అందుకని పాతకథకే అంటిపెట్టుకుని వుండటం శ్రేయోదాయకమని పించింది.

"ఆలోచించుకుని మరీ చెప్పు" అన్నాడు షివర్లీ.

డెల్లా వెంట లేకపోవడం నాకు అధైర్యంగా వుంది. ఇలాంటి సమయాల్లో ఆమె చాకచక్యంగా మాట్లాడు తుంది. కొంచెంసేపు మౌనంగా ఎటో చూస్తున్నట్లు కూర్చున్నాను.

"అంతా చెప్పాను. ఏం మరచిపోలేదు!" అన్నాను ధైర్యంగా.

"మీ ఫొటోలు మా బాస్‌కు పంపాను. మీగురించి చాలా సమాచారం పంపారు వాళ్ళు. మీ రిద్దరూ దాదాపు రెండు మాసాల క్రితం, మేము ఆటంబాంబులు దాచి వుంచిన ద్వీపంలో దిగారు. అక్కడ బందీలుగా వున్నారు. చాకచక్యంగా తప్పించుకొని వెళ్ళిపోయారు. అప్పుడే మీగురించి అన్నివివరాలు మా సైనిక స్థావరాలన్నింటికీ పంపారు. మీకోసం చాలామంది వెతకుతున్నారు. మా

అదృష్టంవల్ల మీకై మీరే వచ్చి చిక్కారు.'' అన్నాడు షివర్లీ.

నేనేం మాట్లాడలేదు.

''నేను చెప్పింది నిజం కాదా?'' అడిగాడు షివర్లీ కోపంగా అతని చేతిలో వెండిపన్ను వేసిన పాదవుపాటి పేము బెత్తం వుంది. దాన్ని గాలిలో గిర్రున త్రిప్ప సాగాడు.

నేను మౌనంగా చూడసాగాను.

''కాదు! అది అబద్ధం. మేము అలాంటి ప్రదేశం వెళ్ళ లేదు'' అన్నాను.

ఆమాట పూర్తి కాకముందే బెత్తానికున్న వెండిపన్ను నా నుదుటికి తగిలింది. దాని తాకిడికి మెదడులోని నరా లన్నీ కదలిపోయాయి. మెరుపులు మెరిసినట్లయింది. వెంటనే అంతా చీకటిగా తోచింది.

మళ్ళా కళ్ళు తెరిచేసరికి ప్రక్కనే డెల్లా కూర్చుని వుంది. ఆమె చూపులు నావైపే కేంద్రీకరించి వున్నాయి.

టవలు నీళ్ళలో తడిపి కళ్ళు తుడిచింది.

లేచి కూర్చున్నాను.

''ఎలావుంది?'' అడిగింది.

''తలంతా దిమ్ముగా వుంది'' అన్నాను.

''షివర్లీ బాగా కొట్టాడా?''

''లేదు. ఒకేదెబ్బ వేశాడు. నిన్నేమన్నా అడిగాడా?'' అడిగాను డెల్లాను.

''అడిగాడు. నిజం చెప్పాను.''

''విన్నాక ఏమన్నాడు?''

''ముందెందుకు చెప్పలేదని అడిగాడు. అసలే మమ్మల్ను ఏజంట్లని అనుమానపడుతున్నారు మీరు. అందుకని భయ

పడ్డామని చెప్పాను. నన్ను కొట్టలేదు. కాని మనం ఏజంట్లు కాదని మాత్రం నమ్మడంలేదు. మనచేత నిజం చెప్పించేందుకు అవసరమైన సామగ్రి ఇక్కడ లేదట. అందువల్ల బేస్‌కు చేరుస్తాననీ, అంతా వాళ్ళే చూసుకుంటారని అన్నాడు'' అంది డెల్లా.

''నిజం! నిజం! నిజమంటే ఏంది. మనకు తెలిసిందా? వాళ్ళకు కావలసిన నిజం చెప్పేదాకా చంపుతారు. అది అబద్ధమని తెలిసీ ఎలా చెప్పడం'' అన్నాను వాళ్ళ నిర్హేతుకరమైన ధృక్పధాన్ని తిట్టుకొంటూ.

''అనుమానమన్నది పెనుభూతం లాంటిది. మనమే ఇచ్చాం వాళ్ళకు ఆ అవకాశం. మన ఫోటోలు బేస్‌లో వున్నాయట. ఇక్కడ్నుంచి రేడియోద్వారా ట్రాన్స్‌మిట్ చెయ్యగానే, వాళ్ళు సంతోషించి వెంటనే వివరాలు పంపారు. అర్ధంకానిదల్లా ఇండియన్ ఎలా ఏజెంటుగా పనిచేస్తున్నాడనేదే! అందుకే నీ బ్యాగ్రౌండ్ గురించి సమాచారం సేకరించేందుకు ఇండియాలో వాళ్ళ గూఢచారులు పని ప్రారంభించారట. మరో ఇరవై నాలుగు గంటలలో అవసరమైన అన్ని వివరాలు సేకరించుకు రాగలరని చెప్పాడు షివర్లీ'' అంది డెల్లా.

బేస్‌కు చేరాక మమ్మల్ను వాళ్ళు పెట్టబోయే చిత్రహింసలు, ఊహిస్తూ కూర్చున్నాను. సగం ప్రాణాలు ఇక్కడే పోయాయి. మిగిలిన సగం పోవటానికి ఎంతో టయిమ్ అవసరం లేదనిపించింది.

''ఈ సబ్‌మెరైన్‌లోంచి తప్పించుకునే మార్గమేమయినా వుందా?'' అడిగాను.

లేదన్నట్లు తలూపింది డెల్లా.

ఆమె చెప్పుకున్నాం. నాకు తెలుసు. అందర్నీ చంపితే తప్ప వెలుపలకుపోవటం వీలుగాదు. అందరూ తర్ఫీదు పొందిన సైనికులు. పైగా సబ్ మెరైన్ కంట్రోలువద్ద నలుగురున్నారు. అందర్నీ చంపాక ఎలా నడపాలో కూడా తెలీదు మాకు.

"ఈ కిటికీ చూశావా?" అడిగాను డెల్లాను.

"ఆఁ!" అంది.

"దీనికున్న మైకా షీటు బ్రద్దలుకొడితే నీళ్ళు లోపలికి వస్తాయి. దెబ్బతో సబ్ మెరైన్ మునిగిపోతుంది. వాళ్ళూ, మనమూ అందరం ఛస్తాం. చచ్చే ముందు కనీసం కొంత స్వేచ్ఛ సంపాదించుకున్నట్లన్నా వుంటుంది ఏమంటావ్?" అడిగాను.

"బాగానే వుంటుంది. కానీ అది మనకు సాధ్యమా?" అనుమానంగా నా వైపు చూస్తూ అంది డెల్లా.

"ప్రయత్నిద్దాం!" అన్నాను.

డెల్లా మారు మాటడకుండా కూర్చుంది.

(సశేషం)

## సప్లిమెంటు పోటీ - 14.

82, 83, 84, 85, 86 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు జనవరి '76 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టు కార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30 పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి. —ఎడిటర్

## 65

"నరకం అంటే ఎప్పుడైనా విన్నారా?"

"మా లాడ్జిలో రెండ్రోజులు ఉండండి. మా సాయ శక్తులా ప్రయత్నించి చూపిస్తాము."

* * *

గణపతి :- నేను నీదగ్గర అప్పు తీసుకున్నట్లు గుర్తు లేదే?

తిరుపతి :- ఆరోజు నువ్వు బాగా తాగి వున్నప్పుడు తీసుకున్నావు!

గణపతి :- అలాగా! అయితే నువ్వు బాగా తాగి ఉన్నప్పుడు తీర్చేస్తానులే!!

* * *

ఓ అమెరికన్ యువతి రడీమెడ్ బట్టలషాపుకి వెళ్ళి—

'నేను మారేజ్ చేసుకోబోతున్నాను. మంచి రంగు సెలెక్టుచేసి యివ్వండి" అంది.

"మొదటి పెళ్ళైతే రోజ్‌కలర్, రెండో పెళ్ళైతే బ్లూ, మూడో పెళ్ళైతే లైట్‌గ్రీన్—" అన్నాడు.

"ఏడో పెళ్లి అయితే?" అందా యువతి.

—ఎమ్. వి. యన్. శర్మ.

# 66

ఒక క్రొత్త గాయకుడు సంగీత దర్శకుడితో—

"ఏమండీ! నా పాట మీకు నచ్చిందా?"

సం. దర్శకుడు:- నీవు రేడియోలో పాడవలసినవాడివి!

క్రొ. గా :- థ్యాంక్స్! నేను రేడియోలో యెందుకు పాడాలండీ?

సం. దర్శకుడు:-రేడియో ఐతే ఆఫ్ చేయవచ్చు!!

* * *

ఒక వ్యక్తి తన స్నేహితులందర్నీ తన యింటికి భోజనానికి ఆహ్వానించాడు. తన స్నేహితులు ఇంటికి వస్తుండగా చూచి ఇంట్లో వున్న విలువైన వస్తువులన్నీ మూటగట్టడం మొదలుపెట్టాడు.

అది చూచి అతని భార్య "ఏమండీ యీ సామానన్నీ దాస్తున్నారెందుకు? మీస్నేహితులు దొంగిలిస్తారని భయమా" అని అడిగింది.

భర్త "వారు యీ సామాన్లు దొంగిలిస్తారని కాదు కాని, యీ సామాన్లు గుర్తుపడ్తారని...." అని అన్నాడు.

* * *

డాక్టర్ (రోగితో):- నీవు నిన్నటికన్నా బాగున్నావు.

రోగి:- మీరు చెప్పినట్లే చేశానండి.

డా. :- ఏమిటది?

రోగి :- మీరు చెప్పినట్లే సీసాలో గాలిపోకుండా బిరడా గట్టిగా పెట్టాను. ఇంతవరకు వాడలేదు.

* * *

ఒక కానిస్టేబుల్ భార్య తన భర్త జేబులోని నోట్లను తీస్తుండగా కానిస్టేబుల్ అది చూచి వెంటనే ఆమె చెయ్యి

పట్టుకొని కోపంతో—

"నేను నీ భర్తనే కాక కానిస్టేబుల్ని. ఇప్పుడు నిన్ను అరెస్ట్ చేస్తున్నాను" అన్నాడు.

భార్య ఆ నోట్లల్లోనుంచి ఒక 5 రూ॥ల నోటు తీసి కానిస్టేబుల్ భర్తచేతిలో పెట్టి "ఈ విషయం యిక్కడనే మరిచిపోండి" అంది.

—ఎమ్. ఏ. ఉబేద్, మహబూబాబాద్.

## 67

ఒక మహిళా మండలిలో ఒక మహిళ ప్రసంగిస్తూ—

'సోదరీమణులారా....ఇది అంతర్జాతీయ మహిళా సంవత్సరం కనుక మనమంతా ఇంకా పురోగమించాలి. నేను ముఖ్యంగా మనవిచేసేదేమిటంటే, మొట్టమొదటగా మనమంతా మన భర్తల పేర్లను మనపేర్ల నుండి తొలగించాలి. మనంకూడా మన భర్తలతో సమానంగా చదువుకొన్నాం, ఉద్యోగాలు చేస్తున్నాము. కాని మనకు వంటపని తప్పడం లేదు. మనమే ఎందుకు వంటచెయ్యాలి?....కనుక ఇకనుంచి మనమంతా మన భర్తలు చేస్తున్న పనిచేసి, వాళ్ళని మన పని చెయ్యమందాం దీనికి మీరంతా అంగీకరిస్తారని తలుస్తా ." అంటూ ఆగింది.

అంతలో ఒకామె లేచి "సారీ ... మొదటిపని చేస్తా కాని రెండోపని నేను చెయ్యలేను," అంది.

"అదేం!" అంటూ అందరూ ఆశ్చర్యపోయారు.

"నేను కాపరానికొచ్చిందగ్గరనుంచి మా ఆయన వంటపనే చేస్తున్నారు. అది నేను తీసికోవాలంటే కుదిరేపని కాదు" అంది.

* * *

"ఒరేయ్ మన రామారావుకి చీర, జాకెట్ కడితే ఆ వొచ్చే అమ్మాయిలాగే వుంటాడు కదూ." అన్నాడు ఒకడు ఇంకొకడితో.

ఆ అమ్మాయి దగ్గరగా వచ్చి "వ్వాట్ ఫ్రెండ్స్ నన్ను గుర్తుపట్టలేదా!...మీ రామారావుని. ఆడవాళ్లు మన షర్టూ, పాంటు వేస్తున్నారని నేను చీర, జాకెట్ వేసాను" అని అన్నాడు పళ్లికిలిస్తూ.

* * *

"హలో....పోలీస్ స్టేషనేనా?....సార్! ఉమెన్స్ కాలేజీ దగ్గర ముగ్గురు అమ్మాయిలు నా వెనకపడి అల్లరిచేస్తున్నారు సార్" అంటూ ఒకబ్బాయి పోలీస్ స్టేషన్‌కి ఫోన్‌చేశాడు.

"సార్ వుమెన్స్ కాలేజీ దగ్గర అమ్మాయిలు ఒక అబ్బాయిని అల్లరిపెడుతున్నారట" అని చెప్పాడు ఫోన్ కాల్ రిసీవ్ చేసికొన్న హెడ్‌కానిస్టేబుల్, ఇనస్పెక్టర్‌తో.

"రాంగ్ నెంబర్ అని ఫోన్ పెట్టేయవోయ్" అని సలహా ఇచ్చాడు ఇన్‌స్పెక్టర్.

— జి. మోహన్, వుయ్యూరు.

## 68

"రోజూ నన్ను పెళ్లిచేసుకోమని ఓ వందసార్లన్నా అనుంటారు" చిరాకుపడింది ప్రేయసి.

"ఎవరు చెప్పు. పళ్లు రాలగొట్టేస్తాను వెధవల్ని" మండి పడ్డాడు ప్రియుడు.

"ఇంకెవరు. మా అమ్మా నాన్నాను."

* * *

రామం ఆఫీసులో గుమస్తాగా పనిచేస్తున్నాడు. అతను ఆఫీసు వదలి బయటకు వెళ్లేటప్పుడు తప్ప, ఆఫీసులో వున్న

ప్పుడు కళ్లజోడు డ్రాయర్లో పెడతాడు.

ఒకరోజు అతనికోసం ఎవరో ఒకాయన వచ్చేరు.

తోటి గుమస్తా రావు డ్రాయరు తెరచి చూపి "రామం లేడండి" అన్నాడు.

అతను తెల్లబోయాడు.

* * *

"ఏమోయ్ రామారావ్! ఎంతగా మారిపోయావ్. ఈ పదేళ్లలో రంగు మారింది. ముఖం మారింది. ఫేషన్లూ మార్చావ్. నడక మారింది. ఏమిటి విశేషం?"

"సారీ! మీరు పొరబడుతున్నారు. నా పేరు రామారావ్ కాదు. రంగారావ్."

"హార్నీ! పేరుకూడా మార్చేశావన్నమాట."

—వి. విజయభాస్కర్, కాకినాడ.

## 69

"ఓ వందరూపాయి లప్పుకావాల్రా అర్జెంటుగా" అన్నాడు గిరీశం.

"ఎందుకు....?" దీర్ఘంతీసాడు కైలాసం.

"ఆఁ...ఏంలేదు. ఊర్లో కొన్ని చిల్లరబాకీలున్నాయ్‌లే!" తాపీగా జవాబిచ్చాడు.

* * *

ఒక ప్రఖ్యాత తారామణి ఒక సన్మానసభలో ప్రసంగిస్తూ సెల్ఫ్‌డబ్బా కొట్టుకుంటూంది. "నేను చెప్పడంలో అతిశయోక్తి కనిపించవచ్చుగాని, నిజానికి నా బరువు ఏడు మల్లెపూవు లెత్తు....

"చిన్న సవరణ. ఒక మల్లెపువ్వు యిక్విల్ట్ పది కేజీలు" అరిచాలెవరో సభలోంచి!

* * *

"ఒరేయ్ ఢుంబూ! మా దొడ్లో బాదంచెట్టుంది చూసావా! నీకు బాదం పప్పంటే యిష్టంగదూ! మరి తింటావా?" అన్నాడు గుర్నాథం.

బుర్రూపాడు తింటానన్నట్టు ఢుంబూ.

"సరే! అయితే ఇదిగో ఒక సిగరెట్ పట్రారా" అంటూ పావలా ఇచ్చాడు. ఢుంబు ఓ పావుగంట తర్వాత వచ్చాడు. సిగరెట్ యిచ్చాడు గుర్నాధానికి. మిగతా చిల్లరడిగితే "మీరు భలేవారండీ! మీ దొడ్లో బాదంచెట్టు లేదుగా! నాకు ముందే తెల్సు. అందుకే మిగిలిన చిల్లరతో బాదం పప్పు కొనుక్కున్నాను" అని చెప్పి తుర్రుమన్నాడు ఢుంబు.

—ఎన్. నాగేశ్వరరావ్, యలమంచిలి.

## 70

జపాన్‌లోని ఒక క్లబ్‌లోకి ఒక ఇండియన్ వెళ్లాడు. అతనికి జపానీస్ డ్రింక్ ఇవ్వబడ్డది. మొదటి గ్లాస్ త్రాగిన తర్వాత అక్కడి ఫర్నిచర్ అంతా అతని చుట్టూ తిరుగుతున్నట్టు అతనికి అనిపించింది.

"అహా! ఎంత ఘాటు డ్రింకు" అన్నాడు ఇండియన్ సంబరపడిపోతూ.

"కాదు నాయనా, ఇపుడు భూకంపం వచ్చింది" అన్నాడు గాభరాగా ఆ క్లబ్‌లో ఒకతను.

* * *

ఒక ఏడేళ్ల అబ్బాయి ముక్కునుండి రక్తం కార్చుకుంటూ ఏడుస్తూ వాళ్ల ఇంట్లోకి అడుగుపెట్టాడు.

"అరె ఏంటయింది నాయనా!" అంటూ అడిగింది వాళ్ల అమ్మ.

"నేను ఆడుకుంటుంటే నా ముక్కు కొరికేశాడమ్మా ఆ అబ్బాయి" అంటూ ఏడుస్తూ చెప్పాడు.

"ఎవడురా వాడు వాణ్ని పోల్చుకోగలవా?"

"తప్పకుండానమ్మా, వాడిని ఎక్కడున్నా సరే పోల్చుకుంటాను. వాడి చెవి నేను కొరికేశానుకదా!"

*　　　*　　　*

బస్సు కండక్టర్ అందరి దగ్గరికి వచ్చి టికట్లు యిచ్చి డబ్బులు కలక్టు చేస్తున్నాడు. విశ్వనాథం దగ్గర డబ్బులు లేవు. తన దగ్గరికి కండక్టరు రాగానే జేబులు వెతుక్కుంటూ సీటుక్రింద వెతుక్కుంటున్నాడు.

"ఏంటయింది సర్" అన్నాడు కండక్టర్.

"నా రూపాయి పడిపోయిందండీ! మరి నా దగ్గర డబ్బులు లేవు" అన్నాడు ఏడుపు మొహం పెడ్తూ.

కండక్టర్‌కి జాలివేసి టికట్టు యిచ్చాడు, డబ్బులు తీసుకోకుండానే.

"మరి మిగిలిన డబ్బులు........" అన్నాడు విశ్వనాథం చేయి చాపుతూ.

కండక్టరు తెల్లమొహం వేశాడు.

—మామిడి సత్యనారాయణమూర్తి, బరంపురం. ★



